# చతుర

డిసెంబరు,197

125 పైసలు



# చతుర

డిసెంబరు 1978

సంపుటి 1 సంచిక 11

## ఈనెల సమగ్ర నవల

యౌవన ప్రాంగణంలో ప్రవేశించిన యువతీయువకుల మనస్సులు సంధ్యాకాశంలో మనోహరంగా వెల్లివిరిసే వర్ణ చిత్రాల వంటివి. క్షణక్షణానికీ మారిపోయే ఆ సహజ వర్ణపు రూపాలవలెనే వీరి మనసులూ అనుభవంతో వికసిస్తూ, మారిపోతూ ఎన్నెన్నో వినూతన సోయగాలను సంతరించుకుంటాయి.

ఆ వయసులో తమకు నచ్చిన వారికి సన్నిహితంగా వెళ్ళగలిగిన యువతీ యువకుల మనసులు మధురానుభూతులతో ఎన్నెన్ని మనోజ్ఞ కావ్యాలను విరచించుకుంటాయో! ఆ అనుభూతులూ, అనుబంధాలూ క్షణికమని తెలిసీ, తెలియకా వాటిని శాశ్వతం చేసుకోజూచే ప్రయత్నంలో వారి ప్రవర్తనలెలా, ఎన్ని మలుపులు తిరుగుతాయో...!

తమను ఉక్కిరి బిక్కిరిచేసే ఆ అనుభూతుల్ని భాషలోకి అనువదించి చెప్పుకోలేక వారెలా విలవిలలాడి పోతారో...! అందుకే ఆ అనుభూతులు వారి హృదయాల్లోనే ధ్వనించే...

## మౌనరాగాలు

తన పాత్రల మనసుల మారు మూలల్లోని అంతరాంతర జ్యోతిస్సీమల్ని అందంగా విప్పిచెప్పటంలో...

## నవీన

సాధించుకున్న ప్రావీణ్యాన్ని ప్రతి సంభాషణలో ప్రదర్శించే ఈనెల చతుర సమగ్రనవల 'మౌన రాగాలు'

## ఈనెల ముఖపత్రం :

ఈ విశాల ప్రపంచంలో ఎన్ని భాషలున్నాయో, అంతకు మించిన సంఖ్యలో విభిన్న ప్రాంతాలలో వేర్వేరు జాతులున్నాయి. వీరిని గురించి మానవేతిహాసికులు ఇంకా పరిశోధనలు కొనసాగిస్తూనే ఉన్నారు. ఎన్నెన్నో నూతన విషయాలను వెలుగులోకి తెచ్చి సభ్య ప్రపంచాన్ని సంభ్రమ పరుస్తూనే ఉన్నారు. ఇటీవలి పరిశోధనల ఫలితంగా అలా వెలుగులోకి వచ్చిన దక్షిణ అమెరికా ప్రాంతపు 'సూర్య' జాతీయులనబడేవారిలో ఒకరి చిత్రం ఈనెల చతుర ముఖపత్రం. చేపలవేట వీరి ప్రధానవృత్తి.

## రెండవ కవరు

సాంప్రదాయిక దుస్తులలో సున్న జర్మన్ యువతి. చేతిలో పానపాత్ర. మధ్య యుగాల నాటి జర్మన్ కంచు విగ్రహం. ఒక రకంగా పేపర్ వెయిట్‌లా ఉపయోగపడే కళాఖండం.

## మూడవ కవరు

అపురూప భవంతులకు ఆలవాలమైన రాజస్తాన్‌లోని రసపుత్ర వీరుడు రాజామాన్‌సింగ్ అంబర్‌ప్యాలెస్‌లోని 'షీష్‌మహల్'

## నాలుగవ కవరు

బ్రిటిష్ మ్యూజియంలోని జపాన్ దేశపు దంతశిల్పం. వారి పురాణ గాథలలో వర్ణింపబడిన కోసెన్సీ అనబడే సాధువు రూపమిది. ఆనాటి వారి పురాణ పురుషులు దివ్యశక్తి సమన్వితులు. ఈ శిల్పంలోని సాధువు తలచుకున్నపుడల్లా సర్పంగా మారిపోగలడని ఒక నమ్మిక.

చతుర

ఈనాడు కాంపౌండ్,

హైదరాబాద్-500004.

# రాజు కొండ ఎక్కేందుకు వెళ్లాడు

రాజు, శంకర్ ఐదిపిల్లలతో కొండఎక్కేందుకు వెళుతున్నారు




శంకర్ రాజుని ఏడిపిస్తున్నాడు




వాళ్ళు విశ్రాంతికోసం కాసేపు ఆగుతారు




కాసేపటికి.
రాజుని తోయబోయి
శంకర్
జారిపడతాడు







శంకర్ సిగ్గుపడి పోతున్నాడు




రాజు వరుస తప్పకుండా న్యూట్రామూల్ హాయిగా తాగుతాడు. న్యూట్రామూల్ అమూల్ వారి ఆరోగ్యాన్నిచ్చే, రుచికరమైన పానీయం. న్యూట్రామూల్ బలవర్ధకమైన, మీగడగల అమూల్ పాలతోపాటు, అసలైన కోకో, మాల్ట్, పంచదార కలసిన మిశ్రమం.

అరే, ఆశ్చర్యం! న్యూట్రామూల్ ఖరీదు కూడా తక్కువే. 500 గ్రాముల న్యూట్రామూల్ మీకు అందుబాటయే వెల రూ. 12.21. స్థానిక పన్నులు, సెంట్రల్ సేల్స్ ట్యాక్స్, రవాణా ఛార్జీలు అదనం.

రాజుకి, , ఇప్పుడిక శంకర్‌కి, ఇంకా దేశమంతటా వేలాది మందికి రోజూ న్యూట్రామూల్ తాగడం అంటే ఎంతో ఇష్టం.

**అమూల్ వారి న్యూట్రామూల్ ప్రతి కప్పూ మీకు పోషణను ఇచ్చు**



daCunha/N/3 TEL

# మళ్ళీ మీ రోజువారి పనులు మామూలుగా చేసుకోవాలని ఆతృతగా ఉందా మీకు?

## గ్లాక్సోస్-డి® అలసటను ఎదుర్కొనేందుకు వెంటనే శక్తిని సమకూరుస్తుంది.



## దోమలు పారిపోయాయి...హాయిగా నిద్ర పట్టేసింది

ఓడొమాస్ ఏర్పరచే కవచం దోమలను దగ్గరికి రానివ్వదు గనక మీరు రాత్రంతా నిశ్చింతగా, హాయిగా నిద్ర పోవచ్చు. ఓడొమాస్ మీ చర్మానికి కూడా సురక్షితమైనది.




దోమల పాలిట శత్రువు-బల్సారావారి

# ఓడొమాస్

బల్సారా
—సౌఖ్యమైన జీవనానికి అధునాతన సాధనాలు

BALSARA బల్సారా అండ్ కంపెనీ (ప్రై.) లి.
43, నగీన్‌దాస్ మాస్టర్ రోడ్, బొంబాయి-400 001.

CHAITRA-BLS-243 TEL

మిరమిట్లు గొల్పే తెలుపు
చూడగానే
అందరి నోట ఒకే మాట...



ఇది తప్పక

**డెట్**

డిటర్జెంట్
బిళ్ల వుతుకే




Shilpi DM 35A/78 Tel

# మీరు ఎన్ని భాషలు చదవగలరు

ఒకటి, రెండు, మూడు... అంతేనా! అలా ఆగిపోనవసరం లేదు. 'విపుల' మీచేత ఎన్నెన్నో భాషల కథలను నెల నెలా ఆసక్తితో చదివింపజేస్తుంది... అనేక భాషల అత్యుత్తమ కథల వేదిక విపుల.




# విపుల

రంగుల ఆఫ్‌సెట్ ముద్రణ. కథలకుతోడు కార్టూన్
జోకులు * 132 పేజీలు 125 పైసలు మాత్రమే

# రచయితలకు సూచనలు

* జాతి జీవిత చిత్రాన్ని వివిధ కోణాలనుండి ప్రతిబింబించగల సమగ్ర నవలలను 'చతుర' ఆహ్వానిస్తున్నది. నవల 'చతుర'లో అచ్చులో 100 పేజీలకు సరిపడేదిగా ఉండాలి. 'చతుర'లో అచ్చులో పేజీకి సుమారుగా 260 పదాలు వస్తుంటాయి.

* ఈ పరిమితులను దృష్టిలో ఉంచుకుని 'చతుర' కొరకై ప్రత్యేకంగా రాసిపంపిన నవలలు మాత్రమే పరిశీలింపబడుతాయి. ప్రస్తుతం వివిధ మాసపత్రికలు వెలువరిస్తున్న 100-112 పేజీల పాకెట్ సైజు నవలాను బంధాలలో ప్రచురితమవుతూన్న నవలికలు చతురలో అచ్చులో 60-70 పేజీలు మాత్రమే అవుతాయి. రచయితలు ఈ తేడా గమనించాలి.

* నవలను ప్రచురించే సమయంలో అవసరాన్నిబట్టి కొంత వరకూ కుదించవలసివచ్చే పక్షంలో అందుకు అభ్యంతరం లేనివారే నవలలను పంపాలి.

* అనువాద నవలలు పంపదలిచేవారు మూల రచయిత నుండి ముందే అనుమతి తీసుకుని అనుమతి పత్రంతోసహా నవల పంపాలి.

* ప్రచురణకై ఎన్నిక కాని నవలలను తిప్పిపంపేందుకై నవలతో పాటే తగు పోస్టేజీ తప్పని సరిగా జతపరచాలి. అలా జతపరచని పక్షంలోనూ, నవలలు పోస్టులోగానీ, ఇతరత్రాగానీ పోయినా మా బాధ్యత ఉండదు.

* 'చతుర'లో ప్రచురించే ప్రతి నవలకూ పారితోషికం రచనను బట్టి రు॥ 1,000 నుండి రు. 2,000 వరకూ ఉండగలదు. ఈ విషయంలో సంపాదకులదే తుది నిర్ణయం.

చతుర

ఈనాడు కాంపౌండ్, హైదరాబాద్-500004.

# పసివాడి ప్రతిభ

'మారో' అనే పదకొండేళ్ళ ఇటాలియన్ బాలుణ్ని కొందరు దుండగులు ఎత్తుకు పోయారు. అయితే అమాయకుడైన ఆ బాలుడు ఆ కఠినాత్ముల హృదయాల్ని ఆకట్టుకుని, వారి అభిమానాన్ని సంపాదించ గలిగాడు.

మారో ఓ ధనవంతుడి కొడుకు. కొందరు దోపిడీదార్లు వారి ఇంట్లో ప్రవేశించి కుటుంబ సభ్యులందర్నీ నోట్లో గుడ్డలు కుక్కి కట్టిపడేసి ఇల్లంతా దోచుకున్నారు. వారు వెళ్ళిపోతూ 14ఏళ్ళ వయస్సుగల మారో సోదరుణ్ని తీసికెళ్ళేందుకు భుజానవేసుకున్నారు. "అతను అస్వస్థతగా ఉన్నాడని, అతనికి బదులు తనను తీసికెళ్ళమని" మారో ఆ దుండగులతో వాదించాడు. వారు మారోని 'సరిడీనియా' కొండ ప్రాంతాలకు తీసుకుపోయారు.

మారో కావాలంటే పెద్ద మొత్తం డబ్బు చెల్లించాల్సి ఉంటుందని ఆ దుండగులు హెచ్చరించినా మారో తండ్రి దాన్ని లెక్కచేయలేదు. వారు ఆ కుర్రాణ్ని చంపేద్దామనే నిర్ణయానికి వచ్చారు. అయితే మారో వారికి వినోదం కలిగిస్తూ, కమ్మని పాటలు పాడుతూ, కథలు చెప్తూ కాలక్షేపం చేస్తూండటంతో వారా ఉద్దేశాన్ని విరమించుకోవటమే కాక, ఆ కుర్రాడిపై వారికి ఓ రకమైన అభిమానం కూడా ఏర్పడి, అతణ్ని "లిటిల్ గారిబాల్డో" అని ముద్దుగా పిల్చుకోసాగారు.

అలా కొంత కాలం గడిచింది.

ఓ రోజు మెలకువ వచ్చేసరికి మారోకి ఎవరో కొత్త మనిషి మాటలు వినిపించాయి. "మొదట కుర్రాణ్ని విడిచి పెడితే డబ్బిస్తాం." అంటున్నాడా కొత్త వ్యక్తి. ఆ మధ్యవర్తిగా వచ్చిన మనిషికి మారోని వప్పజెప్పేటప్పుడు ఒక్కో



దుండగీడు ఆకుర్రాణ్ని కావులించుకుని, ముద్దెట్టుకుని వదిలి పెట్టారు. అప్పటికే పథకం ప్రకారం వలపన్నిన పోలీసులు వారినందరిని అరెస్టు చేశారు.

మారో రెండు నెలల తర్వాత తన తల్లిదండ్రుల్ని కలుసుకో గలిగాడు. కఠినాత్ములైన ఆ దుండగుల హృదయాల్ని కరగించి, వారి మనసుల్ని ఆకట్టుకుని మృత్యువునుంచి బైటపడిన మారోని ఇటాలియన్ ప్రెసిడెంటు అభినందించి అతనికి ఓ బైనాక్యులర్‌ను బహుమతిగా అందజేశారు.

# నిరుద్యోగపర్వం

భారతదేశంలోని నిరుద్యోగం పొంగి పొర్లి సౌదీ అరేబియాదాకా ప్రవహిస్తోంది. హాజ్ యాత్ర పేరుతో అక్కడికి చేరి ఉద్యోగాలకోసం వీధులు వెంట బలాదూరుగా తిరుగుతూన్న భారతీయుల్ని ఏరివేసే కార్యక్రమాన్ని చేపట్టింది ప్రస్తుతం సౌదీ అరేబియా ప్రభుత్వం.

బొంబాయిలోని 'హాజ్' కమిటీ పకడ్బందీ అయిన పరిశీలన జరపకపోవటం వల్ల విద్యావంతులైన భారతీయ నిరుద్యోగులు యాత్రికులుగా సౌధీ అరేబియా చేరుతున్నారు.

అలా వచ్చి తిరిగి వెళ్ళకుండా అక్కడే ఉండిపోయే వారిపై క్రమశిక్షణ చర్యలు తీసుకొని, శిక్షించాలని సౌదీ అరేబియా ప్రభుత్వం సంకల్పించింది.

గత ఏడాది 20,000 మంది భారతీయ యాత్రికులు సౌదీఅరేబియాకి చేరారు. అయితే వారిలో 6,000 మంది మాత్రమే తమ మాతృదేశానికి తిరిగి వెళ్ళారు. మిగతా వారిలో కొందరు ఉద్యోగాలు సంపాదించుకుని సౌదీఅరేబియాలోని ఇండియన్ ఎంబసీకి పాస్‌పోర్టు కోసం అర్జీలు పెట్టుకున్నారు. ఈ ఏడాది కూడా 20,000మంది అరేబియా యాత్రకు సిద్ధంగా ఉన్నారు.

ప్రస్తుతం సౌదీఅరేబియాలో రహస్య పోలీసు దళాలు ఇలా ఉద్యోగాలకోసం రోడ్ల వెంట తిరిగే వారిని పట్టుకునేందుకు ముఖ్యమైన సెంటర్లలోను, ఆసుపత్రులు, హోటళ్ళు, మార్కెట్టు పరిసరాలు, భవన నిర్మాణాలవద్ద నిఘా వేశారు. పట్టుబడిన వారికి 24 గంటల నుండి 6 నెలల వరకు జైలుశిక్ష, 1,000 నుండి 10,000



సౌదీ కరెన్సీ జరిమానాగా విధించి తరువాత వారిని భారతదేశానికి సాగనంపుతారట.

# దౌర్జన్యకారులు

ఇంగ్లండులో మూడవదిగా గుర్తింపబడిన 'గ్లాస్గో' నగరం దౌర్జన్యకారుల వల్ల ఎంతోపతనమయింది. పనీపాటా లేని ఇరవై ఏళ్ళలోపు వయసుగల యువకులు జట్లుజట్లుగా చేరి అమాయకులైన ప్రజలపై దౌర్జన్యాలు చేస్తుంటారు.

ఏడాదిన్నరలో ఎనిమిదిసార్లు ఈ దౌర్జన్యకారులు తన ఇంటిపై దాడిచేసి, గాజు పనిముట్లు ధ్వంసం చేయటమేకాక, విలువైన వస్తువుల్ని ఎత్తుకుపోయారని ఆ ప్రాంతంలో నివశించే ముప్పైఏళ్ళ మహిళ 'డైనాహంటర్' వెల్లడించింది.




ఈ ముండగులవల్ల ప్రతి ఏడాది పౌరులకు 50 లక్షల పౌండ్లు నష్టం కలుగుతుందట. ఈ నగరంలోని భవనాల్లో మొదటి అంతస్తుల్లో నివసించే వారికి ఈ దౌర్జన్యకారుల బెడద విపరీతంగా ఉంటుంది. వారు ఆ అల్లరిని తట్టుకోలేకపోతుంటారు. అందుకే అక్కడి భవనాల్లో మొదటి అంతస్తులు ఎప్పుడూ ఖాళీగానే ఉంటాయి

గ్లాస్గో నగరంలో ఇలాంటి రౌడీ ముఠాలు 185 పైగా ఉన్నాయి. ఒక్కొక్క ముఠాలో 30 నుండి 40 మంది సభ్యులుంటారు. 'ఫ్లీట్', 'స్పర్', 'సెలెస్టియన్ టైగర్' లాంటి తమాషా అయిన పేర్లుంటాయా ముఠాలకి. ఒక్కొక్క ప్రాంతాన్ని ఒక్కో ముఠా ఆశ్రయించి ఉంటుంది. ఆ ముఠా పేరు ఆ ప్రాంతంలో గోడలమీద రాసి ఉంటుంది.



ఈ ముఠాలు ఒకదానిమీద ఒకటి దాడులు జరిపి కత్తులు, ఇనుప కడ్డీలు, గొలుసులతో కొట్టుకుంటారు. ఈ తగాదాలో అమాయకులైన పౌరులెవరయినా ప్రాణాలు కోల్పోతే వారికి చీమ కుట్టినట్టు కూడా ఉండదు.

యువతరంలోని నిరుద్యోగం, పేదరికాలే ఈ దౌర్జన్యకారుల ముఠాలు ఏర్పడటానికి కారణాలని పోలీసుల అంచనాలవల్ల తేలింది.

ఈ ముఠా తగాదాల వల్ల 1975లో 45 హత్యలు జరిగితే, 1976లో ఆ సంఖ్య 71కి పెరిగింది. గత 20 ఏళ్ళలోనూ గ్లాస్గో నగరంలో నేరాలు 200 శాతానికి పెరిగాయట.

## గాలిబుడగలు

చమురు, గ్యాసులను ఘనీభవింపజేసి దూరప్రాంతాలకు బ్రహ్మాండమైన గాలిబుడగల ద్వారా పంపే రవాణా పద్ధతిని సోవియట్ యూనియన్ కనుగొన్నది.

ఈ పద్ధతిలో ఏడు ఓడల్లో పంపే సరుకును ఒక్క బెలూన్‌లో ఇమిడ్చి, రెండులక్షల క్యూబిక్ మీటర్ల పరిమాణం గల వాయు శకటం లాక్కు వెళుతుందట.

మామూలు వాయువుకంటే 80శాతం తక్కువ బరువుగల ప్రకృతి సిద్ధమైన గాలిని ఈ బెలూన్‌లలో నింపి, వీటిలో అధిక పరిమాణంలో చమురు, గ్యాసు రవాణా చేస్తారు.

ఇంధనపు సౌకర్యాలు అవసరమైన పారిశ్రామిక ప్రాంతాలకు వాతావరణ పరిస్థితులతో ప్రమేయం లేకుండా సుదూర ప్రాంతాలకైనా చమురు, గ్యాసు ఎంతో చౌకలో రవాణా చేయవచ్చు.

గొట్టాలు, వాహనాల ద్వారా రవాణా చేసే పద్ధతి కంటే - బెలూన్‌ల ద్వారా



రవాణా పద్ధతికి, వాటి నిర్మాణానికి 91. 7 శాతం, వాటి నిర్వహణ బాధ్యతలకు 50 శాతం ఖర్చు తక్కువగా ఉన్నట్లు తేలింది.

# పసివారి ఆత్మహత్యలు

"పిల్లల్లో ఆత్మహత్యలు నివారించడానికి పది మార్గాలు" అనే ఓ గ్రంథం టోక్యో పోలీసులు ప్రచురించగా జపాన్ మొత్తం మీద అత్యధిక కాపీలు అమ్ముడయిన గ్రంథంగా అది వాసి కెక్కింది.

స్కూలుకెళ్ళే పిల్లల్లో ఆత్మహత్యలు అరికట్టేందుకు తల్లిదండ్రులకు సూచలున్న ఆ పుస్తకం వల్ల చాలా ప్రయోజనం కనబడిందట.

జపాన్‌లో ఏటా వెయ్యిమంది పైగా పిల్లలు ఉరేసుకునో, విషం తాగో, ఎత్తయిన కట్టడాల మీద నుంచి దూకో, బండ్ల కిందపడో, గ్యాస్ గదుల్లో తలుపులు బిగించుకునో రకరకలుగా ఆత్మహత్యలు చేసుకుంటున్నారు.

'వీరీ ఆత్మహత్యలు ఎందుకు చేసుకుంటున్నారు?' అని పరిశోధిస్తే సర్వసాధారణమైన కారణం ఒకటి బయటపడింది. ఎక్కువమంది పరీక్షల్లో తప్పి తల్లిదండ్రులకు ముఖం చూపించలేక ఆత్మహత్యలకు పాల్పడుతున్నారు. కొందరు, తమ అభిమాన తారను టీవీలో చూడలేకపోయినందుకు నిరాశచెంది ఆత్మహత్య చేసుకున్న సందర్భాలూఉన్నాయి

ఇలా ఆత్మహత్యలకు పాల్పడిన 100 మంది పిల్లల చరిత్రల్ని, ఆత్మహత్యకు విఫలయత్నం చేసి, చావుతప్పి కన్ను లొట్టపోయిన 300 మంది పసివాళ్ళ సమస్యల్ని పరిశీలించిన మీదటే జపాను పోలీసులు ఆ పుస్తకాన్ని రూపొందించారు.

సంరక్షకులకు, పిల్లలకు మధ్య పరస్పర అవగాహనను కూర్చి, వారిలో ఆందో



ళనలు, అపోహలు పోగొట్టేందుకు సూచనలు ఆ పుస్తకంలో ఉన్నాయట.

## చేపాంతకుడు

'నాసన్ టాకా' అనే ముసలాయన న్యూ ఐర్లండు తూర్పు తీరంలో షార్క్ చేపలు పట్టుకుని, వాటి ద్వారా వచ్చే ఆదాయంతో జీవనం సాగిస్తున్నాడు.

తన చిన్నతనపు విశేషాలు చెప్తూ మంచి హుషారుగా ఉన్నప్పుడు షార్క్ చేపలు తను పిలిస్తే వచ్చేవని, తను పట్టి చేతుల్తో వెళ్తే తన భార్యామణి గుడిసె లోకి రానిచ్చేది కాదని అంటుండే వాడట.

నాసన్ తన సహచరులతో కలసి 14 మీటర్ల పొడవైన దోనెమీద సముద్రంలోకి చొచ్చుకొనిపోయి 'షార్క్' చేపల్ని వేటాడేవాడు.

కొబ్బరి చిప్పలతో నీటిమీద బుడ బుడ శబ్దం చేస్తూ 'కారా' భాషలో పాటనందుకునేవాడు. దాంతో షార్క్ చేపలు నీటిపైకి తేలి ఎరచేత ఆకర్షింప



బడి, దగ్గరగా వచ్చి ఉచ్చులో బిగుసుకు పోయి, భయంతో గిలగిల లాడేవి. నాసన్ మెల్లగా పాట పాడుతూ, కబుర్లు చెప్తూ ఆ చేపలను బోటులోకి లాక్కొని దుడ్డు కర్రతో చావమోదేవాడు.

రెండు మీటర్ల పొడవుగల షార్క్ చేపల్ని రోజుకి కనీసం పదింటినైనా వేటాడతానని అంటాడు నాసన్. ఆ ప్రాంత గ్రామస్తులకు షార్క్ చేపలే ముఖ్య ఆహారం.

నాసన్ ఎన్ని షార్క్ చేపల్ని మృత్యువుపైపు ఆకర్షించాడో లెక్క చెప్పలేడట గానీ ఇన్నేళ్ళ అనుభవం లోనూ ఒక్క చేప చేత కూడా గాయ పడలేదట.

## ఆనాటి కార్లు

అమెరికాలోని 'మౌంటేజ్ మ్యూజియం' లోని పురాతన నమూనా కార్లు ప్రపంచ వ్యాప్తంగా ప్రశంసల్ని పొందాయి. మన దేశపు ప్రాచీన మోటారు కార్లు ఈ మ్యూజియంలో ఎక్కువ సంఖ్యలో ఉండటం ప్రత్యేక విశేషం.

చాలా ప్రాచీనమయిన మోటారు కారు ఇండియాకు చెందిన 1933 మోడల్ 'మైబెచ్ జెబ్'. ఇది ప్రత్యేకంగా హిట్లరు కోసం తయారు చేశారట. హిట్లరు దాన్ని పాటియాలా మహారాజావారికి బహూక రించారు. ఆయనగారూ దాన్ని 1955లో ధోల్‌పూర్‌కి చెందిన సత్యజిత్‌సింగ్‌కు ఇచ్చేశాడు. ఆ కారుకి 96 హార్స్ పవర్ గల 12 సిలెండర్లున్నాయట. చివరికి ఆ కారు 1947లో నిజాం నవాబు చేతుల్లోకొచ్చింది.



బొంబాయిలో అతి పురాతనమయిన కారు 1909 మోడల్ ఫియట్. దాన్ని 'భతేనా' అనే ఆయన 1903లోనే 8 వేల రూపాయలకి కొన్నాడట. ఆ తర్వాత అది ధార్ మహారాజా తుకోజీ రావ్‌కు, నేపాల్‌కి చెందిన ఒక ఉన్నత కుటుంబానికీ, మరికొందరికీ ఉపయోగ పడిందట.

1924 మోడల్ 'లాన్ కాస్టర్' కారు, బస్సుకంటే పొడవు, 7 అడుగుల ఎత్తు. మంచి సీట్లు ఏర్పాట్లుగల దాన్ని 'రేవా మహారాజా' 1968లోనే 3వేల రూపాయలకు కొన్నాడట.

# సినిమావాళ్ళ దోపిడీ

'బ్రింక్స్ ప్రొడక్షన్' అమెరికాలో ఓ పెద్ద చిత్ర నిర్మాణ సంస్థ. ఆ సంస్థ 'బ్రింక్స్ జాబ్' అనే ఓ గొప్ప చిత్ర రాజాన్ని నిర్మించింది. 1950లో జరిగిన ఒక యదార్థ సంఘటన ఆధారంగా ఆ చిత్రం నిర్మించారు.

1950 జనవరి 17న ఏడుగురు దుండగుల ముఠా ఒకటి తుపాకులతో బెదిరించి, బీభత్సం సృష్టించి, ఎంతో సాహసంతో బోస్టన్‌లో 27లక్షల డాలర్లను దోచుకు పోయారు.

1956లో ఆ ముఠాలోని ఒక సభ్యుడు పోలీసుల చేతికి చిక్కాడు. అతని నుండి అవసరమైన రహస్యాలను రాబట్టి మిగతా వారిని కూడా పోలీసులు పట్టుకున్నారు.



ఈ సంఘటన ఆధారంతో బ్రింక్ ప్రొడక్షన్ వారు మూడు నెలల్లోనే ఓ చిత్రాన్ని నిర్మించారు.

అయితే ఆ చిత్రం విడుదల కాక ముందే ముగ్గురు సాయుధులైన దుండగులు ఆ ఫిలిం నిర్మాణ సంస్థ ఆఫీసు లోకి దౌర్జన్యంగా ప్రవేశించి, ఆ ఫిలిం ఎడిటర్‌ని రివాల్వర్లతో బెదిరించి, ఆ చిత్రం తాలూకు 18 రీళ్ళ ఫిలింను తీసుకుపోయారు. ఇందువల్ల ఆ చిత్ర నిర్మాణ సంస్థకు పది లక్షల డాలర్ల నష్టం కలిగి ఉండవచ్చునని అంచనా.

 

# ప్రాణాంతక రచన

'జాక్ డ్రామండ్' అనే అమెరికన్ రచయిత "బ్యాంకు దోపిడి" అనే నవల రాసేందుకు కథ సిద్ధం చేసుకున్నాడు. తన నవల అతిసహజంగా ఉండాలనీ, స్వీయానుభవాన్నే నవలగా రాయాలనీ అతని తాపత్రయం.

అందుమీదట బ్యాంకు దోపిడికి కావలసిన ప్లాను తయారు చేసుకుని, నవల మొదటి భాగం కూడా రాసేశాడు. దాన్ని తన కుమార్తెకు పంపుతూ "నా నవల సహజత్వాన్ని ప్రతిబింబించాలని నేనీ సాహసాన్ని చేస్తున్నాను. ఒకేరోజు మూడు బ్యాంకుల్ని దోచుకుని ఆ అనుభవాలు వ్రాసి నా నవల గొప్పదనాన్ని నిరూపిస్తాను" అని ఛాలెంజీ చేశాడు.

ఆ తర్వాత డ్రామండ్ కోటులోపలి జేబులో రివాల్వర్ వేసుకుని ఓ బ్యాంకు



దగ్గరి కెళ్ళి తచ్చాడుతుండగా అనుమానించి ఓ పోలీసు అధికారి అతన్ని అటకాయించాడు. డ్రామండ్ రివాల్వర్ తీసి అతన్ని బెదిరించాడు. మరో పోలీసు అధికారి అతన్ని పట్టుకోవడానికి ప్రయత్నించగా డ్రామండ్ రివాల్వర్ పేల్చాడు. ఆ పోలీసు అధికారి చాకచక్యంగా తప్పించుకుని డ్రామండ్‌ను నిర్దాక్షిణ్యంగా కాల్చి చంపేశాడు. పాపం! ఆ డిటెక్టివ్ నవలా రచయిత కథ అలా ముగిసింది 1978 జులై 15న కొలంబస్ లోని ఓబియాలో.

# సృష్టికర్తలు

సంతానం లేని తన కవలసోదరికి ఒక స్త్రీ తన గర్భాశయంలోని ఒక నాళాన్ని దానం చేసేందుకు సిద్ధపడటం గురించి లండన్‌లో ఓ ఆసుపత్రిలోని డాక్టర్ల బృందం విశేషంగా చెప్పుకున్నారు.

30 ఏళ్ళ వయసుగల ఆ మహిళకు గర్భాశయ నాళాల ద్వారాలు మూసుకొని పోయి, గర్భధారణకు అవకాశాన్ని కోల్పోయింది. అందుచేత ఆమె సోదరి గర్భాశయ నాళాన్ని అమర్చి డాక్టర్లు విజయం సాధించారు.

గర్భాశయ నాళాన్ని ఒకరి నుండి తీసి వేరొకరి గర్భాశయంలో అమర్చి, ఆమె గర్భాశయంలో ప్రకృతి సిద్ధంగా జరగవలసిన అండోత్పత్తి కార్యక్రమం తిరిగి యథావిధిగా కొనసాగేట్లు చేసిన చారిత్రాత్మకమైన ఈ ఆపరేషన్‌ను లండన్ డాక్టర్లు చేశారు.

రేపీపాటికి అంతా అయిపోతుంది !

కన్యగా తన జీవితం అయిపోతుంది. ఇంతకాలం తల్లిదండ్రులతో ముడిపడి వున్న తన జీవితం అయిపోతుంది.

ఒక కొత్త వ్యక్తితో తన జీవితం ప్రారంభమౌతుంది.

ఆ కొత్త వ్యక్తిని తను ఒక్కసారి మాత్రమే చూసింది.

ఆ ఒక్కసారి కూడా కొన్ని క్షణాలు మాత్రమే!

చూసీ చూడనట్టుగా, ఎందుకో ఉవ్వెత్తున ఎగిరిపడుతున్న గుండెలతో, తనను గుచ్చిగుచ్చి చూస్తున్న అతని చూపులతో తన చూపులు కలవగానే ఏదో భయం.

వెంటనే తన చూపుల్ని ఉపసంహరించుకుంది.

అతన్ని చూడగానే తనకు కలిగిన మొట్టమొదటి భావం...బాగానేఉంటాడు. కానీ కొంచెం లావు! ఆడదానిలా అంత పెద్ద జుట్టు ఎందుకో? చిరాకెయ్యదూ?

అతడెలా ఉంటాడో తర్వాత ఎన్నో సార్లు గుర్తు తెచ్చుకోడానికి ప్రయత్నించింది.

కానీ ఎందుకో అతని రూపం తనకు స్పష్టంగా జ్ఞాపకం రావటంలేదు.

చాలా అస్పష్టంగా, ఎక్కడో కలలో చూసినట్టుగా మాత్రమే అతని రూపం తన కళ్ళలో మెదిలింది.

ఎత్తుగా, లావుగా, తెల్లగా నిగనిగలాడుతున్న మొహం.

భుజాలదాకా వేలాడుతున్న లాంగ్ హేర్.

వినయ్‌కంటే అందంగా ఉంటాడా ?

ఔను...ఈ ప్రశ్న తనలో చాలా సార్లు మెదిలింది.

వినయ్...

ఒకప్పుడు ప్రతిక్షణం తన చైతన్య స్రవంతిలో ఒక ముఖ్య భాగమయిన వినయ్...

ఆ రోజుల్లో తన టెక్నికలర్ కలలకు ఆధారభూతుడైన వినయ్...

వినయ్ ఈ పెళ్ళికొస్తాడా ?

వస్తే తను అతనితో మాట్లాడాలా?

తనూ, వినయ్ మాట్లాడుకోవటం అతను చూస్తే?

తనను అనుమానిస్తాడా ?

తనను చేసుకోనని పీటలమీది నుంచి లేచి వెళ్ళిపోతాడా ?

అతడలా వెళ్ళిపోతుంటే తనేం చెయ్యాలి ? అలా సినిమాల్లో చూపించినట్టుగా వెళ్ళొద్దని అతని కాళ్ళు పట్టుకుని బ్రతిమాలాలా !

ఛీ ఛీ....అంత అవమానం కంటే హాయిగా విషం పుచ్చుకొని ఈ లోకానికి గుడ్‌బై చెప్పెయ్యడం మంచిది.

అరుంధతి నవ్వుకుంది.

తనెందుకింత పిచ్చిగా ఆలోచిస్తోంది?

ఈ పెళ్ళి నిర్ణయమయినప్పట్నుంచీ తనిలాగే ఆలోచిస్తోంది. ఎప్పుడూ అతన్ని గురించే...చూడటానికి బాగానే ఉన్నాడు. కాని అతడు నిజంగా సంస్కారవంతుడేనా? ఏమో! తనకెలా తెలుస్తుంది. అతన్ని చూసిన ఆ రెండు మూడు క్షణాల్లో అతడెలాంటివాడో తనెలా తెల్సుకోగలుగుతుంది ? 'మొహం మన స్తత్వానికి అద్దం పడుతుంద'ని అంటారు. అతడి ముఖంలో తనేం చూసింది?

తనను గుచ్చిగుచ్చి చూస్తున్న అతని చూపులు.





అతడు కళ్ళద్దాలు పెట్టుకున్నట్టు గుర్తు. నిజంగా పెట్టుకున్నాడా? లేదు... లేదు...అతడు కళ్ళద్దాలు పెట్టుకోలేదు. లేదు...లేదు...పెట్టుకున్నాడు.

అరుంధతి తీవ్రంగా, అతి తీవ్రంగా ఆలోచించింది. లాభంలేదు. తన బుర్ర పనిచెయ్యటం లేదు. తనకు ఇంత చిన్న విషయం గుర్తురావటం లేదు. హోసీయ్ అపర్ణనడిగితే! అమ్మబాబోయ్ ఇంకేమన్నా ఉందా? 'అక్కయ్యా ఇరవై నాలుగు గంటలు బావగార్ని గూర్చే ఆలోచిస్తుందని' ఇంటికొచ్చిన బంధువులందరితోనూ చెప్పేస్తుంది. అపర్ణ చాలా ఫాస్ట్ గర్ల్...అపర్ణ వేగానికి తను తట్టుకోలేదు. చకచకా మాట్లాడేస్తుంది. కొత్త వాళ్ళతో ఆడ మొగా తేడా లేకుండా చకచకా పరిచయం చేసుకుంటుంది. అడక్కుండానే ప్రతి విషయాన్నిగూర్చి తన అభిప్రాయం చెప్పేస్తుంది. తన అభిప్రాయంతో ఏకీభవించని వాళ్ళతో గంటలగ్గంటలు వాదిస్తుంది. ఆఖరు మాట తనదే కావాలని మొండిగా ప్రవర్తిస్తుంది.

జోక్స్ వేస్తుంది.

నవ్వుతుంది. నవ్విస్తుంది.

ఎంత త్వరగా నవ్వుతుందో అంత త్వరగా ఏడుస్తుంది.

ఎంత త్వరగా కోపమొస్తుందో అంత త్వరగా పోతుంది.

వేగం... ప్రతిదీ వేగమే.

తను ప్రతిదీ మెల్లగానే చేస్తుంది. గబగబా మాట్లాడలేదు.

మనస్సు మారు మూలల్లో మొలకెత్తే కొన్ని సున్నితమైన అనుభూతుల్ని తనకెవరితోనూ చెప్పుకోవాలనిపించదు. అలా చెప్పుకుంటే వాటి అందమంతా అంతరించి పోతుందని పిస్తుంది.

కాని అపర్ణ అలా కాదు. ఎక్కడ పడితే అక్కడ వాటిని పారేస్తుంది. తేలిక చేస్తుంది.

"ఏమిటే అరూ! నువ్విక్కడ వున్నావా? ఇల్లంతా వెతికాను. ఎక్కడెక్కణ్నించో బంధువులంతా వచ్చారు కదా! వాళ్ళతో సరదాగా నాలుగు మాటలు మాట్లాడితే నీ సొమ్మేం పోయిందే. ఒక్కదానివే వచ్చి ఈ డాబా మీద కూర్చోకపోతే వాళ్ళందరి మధ్యన ఉంటే నీకూ హాయిగానే ఉంటుందికదా!" అంది అమ్మ వస్తూనే.

"నాకు ఒంటరిగా ఉంటేనే హాయిగా ఉంటుందే"

"నీదో పిచ్చి మాలోకం...నీ తోడిది అపూ చూడు. వాళ్ళందరికి క్షణం ఊరుకోకుండా ఏవో కబుర్లు చెబుతూ, వాళ్ళకేం కావాలో అందిస్తూ, వాళ్ళను నవ్విస్తూ ఎంత సరదాగా గడుపుతుందో చూడు. సరేగాని అందరూ భోజనాలకు కూర్చుంటున్నారు పద."

"నాకేమీ తినాలనిపించడం లేదే."

"అదేమిటే పొద్దున ఎనిమిదింటి కెప్పుడో కాస్తంత టిఫిన్ చేశావు. ఇప్పుడు ఒంటిగంటౌతుంది. తినాలనిపించక పోవటమేమిటి? రేపు ఎలాగు పెళ్ళి సందడి - అసలు తింటావో లేదో! ఇవ్వాళైనా కాస్త తిందువుగాని పద!"

"ప్లీజ్ అమ్మా నన్నిలా వదిలెయ్. నాకెందుకో ఆకలిగా లేదు."

"నిన్ను బతిమాలే ఓపిక నాకు లేదే తల్లీ! బయట నాకు బోలెడు పనులున్నాయి. కిందికి రావటం నీకు బద్దక

మైతే ఇక్కడికే పంపిస్తాను. కాస్త తిని పడుకో. నీకేమయిందో ఏమిటో ? పెళ్ళి చూపుల నాటినుంచీ చూస్తున్నాను. నిద్రాహారాలు రెండూ మానేశావు. కళ కళ లాడుతూ ఉండాల్సిన మొహం చూడు ! ఎలా వాడిపోయిందో ! మా కాలంలో లాగ ఏమీ తెలియని చిన్న తనంలో పెళ్ళి చేయటమే మంచిదని పిస్తుంది. అన్నీ తెలిసిన వయస్సులో పెళ్ళి చేయటం వలన ఏమిటేమిటో ఆలోచించుకుని బుర్రంతా పాడు చేసుకుంటారు."

అమ్మ వెళ్ళిపోయింది.

అమ్మ అన్నమాట నిజమే. తనకు పెళ్ళి నిర్ణయమైన క్షణం నుండి తన గుండెల్లో ఏదో గుబులు. మాటల్లోకి అనువదించలేని ఎన్నో విచిత్రమయిన అనుభూతుల పరంపర, భవిష్యత్తును గూర్చి భయం, ఆందోళన, కలలు, ఉత్కంఠ.

తన జీవితంలో ఒక మహత్తరమయిన సంఘటన జరగబోతోంది.

తన జీవితం ఒక గొప్ప మలుపు తిరుగబోతోంది.

ఒకదశ పరిసమాప్తమై మరొక దశ ప్రారంభం కాబోతున్నది.

తనకుచిరపరిచితమయిన మనుష్యుల్ని, ప్రపంచాన్ని వదిలేసి కొత్త మనుష్యుల మధ్యలోకి, కొత్త ప్రపంచంలోకి అడుగు పెడ్తోంది.

ఆ మనుష్యులెలా ఉంటారు ? తననెలా చూస్తారు ?

కొత్త మనుష్యులంటేనే భయపడి పోయే తను వాళ్ళ మధ్య ఇమడ గల్గుతుందా ?

ఇకనుండి తన జీవితంలో అత్యంత ప్రధానమయిన పాత్రను నిర్వహించబోతున్న అతడెలాంటి వాడు ?

తన నర్థం చేసుకొని, తన అభిప్రాయాలను గౌరవించి, తనకో ప్రియమయిన స్నేహితుడుగా ఉంటాడా ?

లేక, భార్యంటే తన కాళ్ళ కింద పడి ఉండాల్సిన ఒక బానిస లాంటిదని ప్రతిక్షణం తన మీద అధికారం చెలాయిస్తాడా ?

తెలీదు. తనకేమి తెలీదు.

ముక్కు, మొహం తెలియని ఒక ఆగంతకుని నమ్మి తనను అతని చేతుల్లో పెడ్తున్నారు. ఇంతకాలం తనను పువ్వుల్లో పెట్టి పెంచి పెద్ద చేసిన తన ప్రియమైన తల్లిదండ్రులు.

ఈ తల్లిదండ్రులిలా ఎందుకు ప్రవర్తిస్తారు ?

తమ ప్రాణాలతో సమానంగా పెంచిన కూతుర్ని ఓ ముక్కు, మొహం తెలియని కొత్త వ్యక్తిని నమ్మి అతని చేతుల్లో పెట్టడానికి ఎందుకు సాహసిస్తారు ?

అతని చేతుల్లో పెట్టేముందు అతనేం చదివాడు ? అతనికున్న ఆస్తిపాస్తులేమిటి ? అతడు నెలకెంత సంపాదిస్తాడు ? ఇవే చూస్తారు తప్ప...

అతడెలాంటివాడు !

సంస్కారవంతుడేనా ?

అతని మనస్తత్వానికి, మా అమ్మాయి మనస్తత్వానికి లంకె కుదురుతుందా ?

ఈ విషయాలను గూర్చి పట్టించుకోరెందుకు ?

ఒకవేళ పట్టించుకున్నా ఒకవ్యక్తి ఎలాంటివాడో చెప్పటం ఎంత కష్టం !

బయటకు చూడటానికి సంస్కార





వంతుడిలాగే కనిపించవచ్చు! కానీ అతని లోపల ఎలాంటి క్రూర జంతువులు నిద్రపోతున్నాయో తెలుసుకోవటం ఎలా సాధ్యం?

ఒక వ్యక్తిని ఎన్నో రోజులుగా ఎంతో దగ్గరగా స్టడీచేస్తే తప్ప ఆ వ్యక్తి ఎలాంటివాడో చెప్పడం కష్టం.

కానీ ఈ దేశంలో తమకు కాబోయే అల్లుడిని గూర్చి అంతలోతుగా పరిశీలించే అవకాశం తల్లిదండ్రులకు ఎక్కడుంది?

ఎవరో మధ్యవర్తులద్వారా ఫలానా చోట ఓ సంబంధం ఉందని తెలుస్తుంది. తెలియటమే చాలు! చంద్రమండలం మీదకైనా సరే రెక్కలు కట్టుకొని పరిగెత్తుతారు ఈ దేశంలోని ఆడపిల్లల తల్లిదండ్రులు.

ఆ మొగ మహారాజు కాస్త చదువుకున్నవాడు, ఆస్తిపాస్తులున్న వాడైతే చాలు... అది మంచి సంబంధం కిందే లెక్క.

ఆ తర్వాత పెళ్ళిచూపులు... వరదక్షిణా, ఆడ బిడ్డల కట్నాలు... సూట్లు... బూట్లు... స్కూటర్..., ట్రాన్సిస్టర్... టేప్ రికార్డర్...లిస్టుకు అంతుండదు.

ఆ మగ మహారాజు ఎంత వికారంగా ఉన్నాసరే అమ్మాయి మాత్రం అప్సరసలా ఉండాలి. అమ్మాయి తెల్లగా ఉండాలి. ముక్కు, మొహం చక్కగా ఉండాలి. కొంచెం చామన ఛాయగా ఉంటేచాలు అబ్బాయి వెంట వచ్చిన వాళ్ళెక్కయ్యో, చెల్లెలో వెంటనే 'అమ్మాయి నల్లగా ఉందని' మూతి మూడు వంకర్లు తిప్పుతుంది.

ఈ దేశంలో ఆడపిల్ల నల్లగా పుట్టడం ఒక శాపం.

ఏమిటిదంతా!

సాంప్రదాయం!

కొన్ని శతాబ్దాలుగా ఈ దేశంలోని మధ్యతరగతి కుటుంబాల్లో అవిచ్ఛిన్నంగా ఒక తరం నుండి మరొక తరానికి ప్రవహిస్తున్న సాంప్రదాయమనే మహాప్రవాహం—

ప్రపంచం ఎంత మారినా, సైంటిస్టులు ఎన్ని నూతన విషయాలు కనిపెట్టినా, స్త్రీని ఉద్ధరించాలని ఎందరో సంస్కర్తలు ఎంత గొంతు చించుకున్నా ఈ ప్రవాహం ఆగదు. ఈ పెళ్ళిళ్ళ తంతు ఇలానే కొనసాగుతుంది. ఎవడో వస్తాడు. వాడిని దేవుడిలా చూడాలి. అమ్మాయి వెళ్ళి దీనంగా, హీనంగా వాడి ముందు కూర్చోవాలి. ఆ అబ్బాయి అతని వెంట వచ్చిన అతని బంధుజనం అమ్మాయిని నఖశిఖ పర్యంతం వాళ్ళ ఎక్స్‌రే కళ్ళతో పరీక్షించాలి.

"లాభం లేదు! అమ్మాయి నల్లగా ఉంది. మాకు నచ్చలేదు!"

"లాభంలేదు! అమ్మాయి పొట్టిగా ఉంది..."

"అమ్మాయి మరీ పొడుగ్గా ఉంది. మాకు నచ్చలేదు"

"అమ్మాయి మరీ లావుగా ఉంది. మాకు నచ్చలేదు."

"అమ్మాయి మరీ సన్నగా ఉంది. మాకు నచ్చలేదు."

అమ్మాయి నచ్చిందో... 'మా వాడిని ఏభైవేలు పెట్టి చదివించాము. ఆ యాభైవేలు మీరిస్తారా?' అంటారు.'

"మా వాడికి ఫారెన్ వెళ్ళాలనుంది.

మీరు పంపిస్తారా?"

"మావాడికి స్కూటర్ కావాలి. మీరు కొని పెడతారా ?"

"మావాడికి ఫ్రిజ్ కావాలి, టేప్ రికార్డర్ కావాలి, మా హోదాకు తగ్గట్టు పెళ్ళి చెయ్యాలి".

ఆ కోరికలకు అంతం లేదు.

ఆడపిల్లలంటే ఈ దేశంలో ఎందుకింత చులకన?

ప్రతిక్షణం వాళ్ళనిలా హింసించటానికి వాళ్ళు చేసిన పాపం ఏమిటి?

"ఏమిటే అక్కయ్యా ? ఆ పెళ్ళికొడుకు ది గ్రేట్‌ను గూర్చి ఆలోచిస్తూ, కలలుగంటూ, కవిత్వం రాస్తూ, బుర్ర పాడుచేసుకుంటూ నీ లోకంలో నువ్వు ఉండటం కంటే కాస్త బయటకొచ్చి ఎవరెవరొచ్చారు, ఏమేం కబుర్లు తెచ్చారో చూడరాదుటే. ఎప్పుడూ ఇలా ఆలోచిస్తూ కూర్చుంటే బుర్ర వేడెక్కిపోదూ...? పెళ్ళనగానే రాణీగారు తిండి తిప్పలు కూడా మానేసింది. సరేగాని పెళ్ళికూతురుగారికి కిందకు రావటం నామర్దాగా ఉంటుందని అమ్మగారు నాచేత ఈ తినుబండారాల్ని మీకోసం పైకి పంపించారు. పెళ్ళికూతురు గారూ! కాసేపు కలల్ని తినటం మానేసి ఈ తిండి తినండి" అంది అపర్ణ.

"నీ వాగుడు కట్టిపెట్టి వచ్చిన దారినే వెళ్ళిపోవే".

"సారీ ! నీచేత బలవంతగానయినా ఈ తిండి తినిపించాలని అమ్మగారి ఆజ్ఞ! కాబట్టి వచ్చిన దారినే వెళ్ళిపోయి నిన్ను నీ కలలకు, ఆ కలలలో నీ పెళ్ళికొడుక్కి వదిలివేయలేకపోతున్నందుకు కడు చింతిస్తున్నాను. వెంటనే తింటావా ? లేక తినిపించమంటావా?"

"కాస్తో కూస్తో చదువుకొని కూడా నువ్వింత చెత్తగా ఆలోచిస్తావనుకోలేదే..."

"కాస్తో కూస్తో యేమిటే నీ మొహం. యూనివర్సిటీ నాకు బి. ఎ. డిగ్రీ ప్రదానం చేసింది. కావాలంటే ఇప్పుడే వెళ్ళి నీకు ఆ సర్టిఫికెట్ తెచ్చి చూపిస్తాను".

"ఎందుకే నీ బి.ఎ...దండగ!"

"ఎందుకమ్మా ! ఆకస్మాత్తుగా నా బి. ఎ. డిగ్రీ మీద దండయాత్ర సాగించావు?"

"పెళ్ళి చేసుకోబోయే ప్రతి ఆడదీ పెళ్ళికొడుకును గూర్చే ఆలోచిస్తుందని అందరు బడుద్ధాయిల్లాగే నువ్వూ ఆలోచిస్తుంటే నీ బి.ఎ. ఎందుకే ?"

"ఎందుకంత ఫోజు కొడతావుగాని, నువ్విప్పుడు.... ఇప్పుడే కాదు.... ఆ కాబోయే భర్తగార్ని చూసినప్పట్నించి నువ్వాయన్ను గూర్చే ఆలోచించటం లేదుటే ? నిజం చెప్పు! అనవసరంగా అబద్ధాలు చెప్పావంటే ఆడపిల్లలు పుడతారు. వాళ్ళూ మళ్ళీ మనలాగే పెళ్ళిళ్ళుకాక మనకు పెద్ద భారమయి కూర్చుంటారు".

"మనమంతా ఇలా చెత్తగా ఆలోచిస్తున్నంత కాలం ఈ దేశంలో ఆడపిల్లల బ్రతుకులిలాగే ఉంటాయే!"

"అమ్మా...తల్లీ...నీతో వాదించే టైం నాకు లేదు. క్రింద రత్నమ్మ పిన్ని నాకోసం చూస్తోంది. సారిక, సరళ కూడా నాకోసం చూస్తున్నారు. వాళ్ళతో మాట్లాడినట్టే లేదు. వెంటనే భోజనం చేస్తావా? వెళ్ళిపొమ్మంటావా ? త్వరగా చెప్పు!"

అరుంధతి లేచి బయటకువెళ్ళి చేతులు కడుక్కొని వచ్చి భోజనం ముందు కూర్చుంది.

"ఈరోజు రాధత్తయ్యా, సందీప్ బావ వచ్చేస్తారనుకుంటాను. చిన్నప్పుడెప్పుడో చూశాను. సందీప్ బావ ఇప్పుడెలా ఉన్నాడో! భలే స్టయిల్‌గా తయారయి ఉంటాడు. అందులో మద్రాసులాంటి మహా నగరంలో ఉంటున్నాడు. అసలు సందీప్ మనతో మాట్లాడతాడంటావా?"

"అతడు మాట్లాడకపోతే యేం? నువ్వు మాట్లాడతావుగా?"

"ఔను! మాట్లాడతాను. నాకేమన్నా భయమా ? ఎంత మహా నగరంలో ఉంటున్నా మన మేనత్త కొడుకేగా!"

"రేపు నీ కాబోయే మొగుడేగా!"

"ఛీ! అసహ్యంగా మాట్లాడకే అక్కయ్యా! నాకంత ఆశలేదు".

"ఎందుకు లేదే?"

"ఎందుకు లేదో నీకు తెలుసు. నాకు తెలుసు. బి.ఇ. పాసై, పెద్ద కంపెనీలో పెద్ద ఉద్యోగం చేస్తున్న సందీప్ బావ నాలాంటి పల్లెటూరు పిల్లను పెళ్ళి చేసుకుంటాడా? మద్రాసు మహా నగరంలో ఉంటున్న అతనెక్కడ? మనమెక్కడ?"

"ఆ విషయం తెలిసికూడా సందీప్‌ను చూడాలని ఎందుకంత తహతహలాడి పోతున్నావు?"

"నేనేమీ తహతహలాడిపోవటం లేదు నీలాగ..."

"నాలాగేమిటి!"

"పెళ్ళికొడుకును చూడాలని..."

"నీ మొహంలేవే! ఊరికే పాడిందే పాట..."

"పోనీలేగానీ, నీ పెళ్ళికి వినయ్ వస్తాడంటావా?"

"నన్నెందుకడుగుతున్నావు? నాకెలా తెలుస్తుంది?"

"లెటరేమైనా రాశాడేమోనని"

"పిచ్చిపిచ్చిగా మాట్లాడకు. మేం లెటర్స్ రాసుకోవడం మానేసి చాలా కాలమైందని నీకు తెలుసు".

"అక్కయ్యా! అక్కయ్యా! ఖమ్మం నుండి రమణమ్మ పిన్ని, ఉజ్వలక్కయ్యా వాళ్ళు వచ్చేశారు" అంటూ అసల అక్కడికి పరుగెత్తుకొచ్చింది.

"ఉజ్వలక్కయ్యా వచ్చేసిందన్న మాట!" అంటూ అపర్ణ, అనల గబగబా మెట్లుదిగి కిందకు పరిగెత్తారు.



## 2

రమణమ్మ, ఆమె ఇద్దరు కూతుళ్ళు ఉజ్వల, ఉష అప్పుడే రిక్షా దిగి ఇంట్లోకొచ్చారు.

"ఏమిటే అక్కయ్యా ! ఇంత పొద్దు పోయింది. బస్సు లేటయిందా ?"

"అసలు ట్రెయిన్లోనే రావాలను కున్నాము. మేమంతా తయారవుతుండగానే ఆ గోల్కొండ కాస్తా వెళ్ళి పోయింది. ఉసూరుమంటూ బస్టాండ్ కెళ్ళి గంటసేపు వెయిట్ చేసి నాలు గ్గంటలు ప్రయాణం చేసి ఇక్కడికి చేరుకున్నాము" అంది రమణమ్మ.

"ట్రెయిన్లో వస్తే హాయిగా [illegible]

గంటల్లో చేరుకునేవాళ్ళం" అంది రత్నమ్మ.

"రెండు గంటలు కూడా ఎందుకే ? గంటన్నరలో వచ్చేస్తాము. నువ్వెప్పుడొచ్చావే రత్నా?" అంది రమణమ్మ.

"నేను నిన్ననే వచ్చానక్కయ్యా"

"పొద్దుపోయింది. త్వరగా భోజనానికి లేవండే" అంది రాజమ్మ.

అక్కచెల్లెళ్ళు ముగ్గురూ కబుర్లు చెప్పుకొంటూ వంటింట్లో కెళ్ళారు.

అపర్ణ, ఉజ్వల, సరళ, సారిక, అనల, ఉమ తమ కబుర్లలో పడ్డారు.

"హైదరాబాద్ ఎలా ఉందే ఉజ్జీ?" అంది అపర్ణ.

"హైదరాబాద్ కేం, బ్రహ్మాండంగా ఉంది" అంది ఉజ్వల

"అదృష్టవంతురాలివి. ఎం. ఏ. లో సీటు సంపాదించావు."

"వాగటం తగ్గించి, చదవటం కొంచెం ఎక్కువ చేస్తే నీకూ్కడా సీటు వచ్చేదేనే" అంది సారిక.

"పాడు ఎంట్రెన్స్! ఆ అడ్డమేగనుక లేకపోతే, బి.యే.లో వచ్చిన మార్కుల్ని బట్టే సీటిస్తే నాకు తప్పకుండా సీటొచ్చేదే!" అంది అపర్ణ.

"యస్.సి , బి. సి, లకు రిజర్వేషన్‌లు పోగా మనకు మిగిలే సీట్లెన్నని

ఈ దేశంలో సోకాల్డ్ ఫార్వర్డ్ క్లాసులో పుట్టడం లాంటి శాపం మరొకటి లేదని పిస్తుంది" అంది సారిక.

"కరెక్టే, అక్కయ్యా ! మెడిసిన్ ఎంట్రెన్స్ రెండుసార్లు రాశాను. ఏం లాభం ? ఇంటర్మీడియట్ ఫస్ట్‌క్లాస్‌లో పాసయ్యాను. డాక్టర్ కావాలని కలలు గన్నాను. బి. యస్‌సి. వెలగబెడ్తున్నాను" అంది అనల.

"ఎస్సీస్లు, బి సీ లు చదువుకోవటానికి వాళ్ళకు కావాల్సిన ఆర్థిక సహాయం చెయ్యనీ. నో అబ్జెక్షన్ ! కాని ఉద్యోగాలకు మెడిసిన్ లాంటి కోర్సులకు మెరిట్ నుబట్టే సెలక్షన్ జరగాల్సి. అంతే కాని ప్రతిచోట ఈ రిజర్వేషన్లేమిటి, నాన్సెన్స్!" అంది అపర్ణ.

"కబుర్లు తర్వాతగానీ ముందు భోజనానికి లేవండి!" అంది రాజమ్మ.

అందరూ భోజనాలకు కూర్చున్నారు.

"ఇంతకూ పెళ్ళికూతురెక్కడే అపూ?" అంది ఉజ్వల.

"పెళ్ళికూతురు గారు డాబా మీద నుంచి దిగరుట, పెళ్ళికొడుగ్గారు వస్తే తప్ప!" అంది అపర్ణ.

"పెళ్ళికొడుకును నువ్వు చూశావుటే? బావుంటాడా?" అంది ఉమ.

"బాగానే ఉంటాడు. ఎఱ్ఱగా... బుర్రగా..." అంది అపర్ణ.

"ఎవరిలా ఉంటాడే?" అంది సరళ.

"ఎవరిలాగా ఉండడు. తనలాగే ఉంటాడు" అంది అపర్ణ.

* * *

భోజనాలు ముగించి అందరూ డాబా మీదకు చేరారు. "రేపీపాటికి అరుంధతిని పెళ్ళికూతుర్ని చేస్తారు. ఎంత ముద్దొస్తావోనే అరూ!" అంది ఉజ్వల.

"ఎవరికే ముద్దొచ్చేది? నీకా? పెళ్ళి కొడుక్కా?" అంది అపర్ణ.

అందరూ నవ్వారు.

"నాకే! ఏం? నీకేమన్నా అభ్యంతరమా?" అంది ఉజ్వల.

"నాకేమీ లేదుగానీ పెళ్ళి కొడుక్కుండొచ్చు"— అపర్ణ.

"ఎందుకు?—ఉజ్వల.

"ముద్దు పెట్టుకునే అధికారం వారికి తప్ప..."అపర్ణ.

"అమ్మమ్మలా ఆలోచిస్తున్నావే!"– ఉజ్వల.

"ఎందుకమ్మా?" — అపర్ణ.

"పెళ్ళి కాగానే స్త్రీ భర్తగారి ప్రైవేట్ ప్రాపర్టీ అయిపోతుందన్న ఫ్యూడల్ భావాన్ని నువ్వుకూడా అంగీకరిస్తున్నావన్నమాట!"—ఉజ్వల.

"ఇందులో ఫ్యూడల్ భావమేముంది? చేసుకున్న ఆడదాన్ని ఎవడ్నిపడితే వాడ్ని ముద్దు పెట్టుకోనిస్తే విప్లవ భావం అవుతుందా?"–అంది అపర్ణ.

మళ్ళీ అందరూ నవ్వారు.

"అబ్బ! ఎంతకాలమయిందే మీరిద్దరూ ఇలా పోట్లాడు కోడం చూసి!" అంది రత్నమ్మ.

"ఇలాగే రోజూ ఎవరో ఒకరి పెళ్ళి ఏర్పాటు చేయించండి. ఎంచక్కా అందరం కలుసుకొని హాయిగా పోట్లాడుకుంటూ, నవ్వుకుంటూ, పోట్లాట కాస్త శ్రుతి మించితే ఏడ్చుకుంటూ..."—అపర్ణ.

"శుభమా అని పెళ్ళి జరుగుతుంటే ఏడ్వడం ఏమిటే!" — రత్నమ్మ.

"అది కాదు పిన్నీ! ఏడవటం అంటే నిజంగా ఏడవటంకాదు. ఉత్తుత్తిగా ఏడవటం"—అపర్ణ.

"ఉత్తుత్తిగా కూడా ఏడుస్తారన్న మాట! నాకు తెలియదే!"— ఉజ్వల.

"నీకెక్కడ తెలుస్తుందిలేవే! నీలాంటి రెవల్యూషనరీ బుర్రలకు కడుపునిండా ఏడవటమన్నా, నవ్వడమన్నా, తినడమన్నా తాగడమన్నా ఫ్యూడల్ మనస్తత్వం లాగే తోస్తుంది—అపర్ణ.

మళ్ళీ అందరూ నవ్వారు.

"నీ మొహంలా ఉంది జోక్"— ఉజ్వల.

"ఏదో నా మీది అభిమానం కొద్దీ అలా అంటున్నావు గాని నిజంగా నా మొహంలా ఉంటే దానికింక వంకేముందే? అద్భుతం అన్నమాట!"— అపర్ణ.

మళ్ళీ అందరూ నవ్వారు.

"ఇన్ని మాటలు ఎక్కడ నేర్చావే అపూ?"—రత్నమ్మ.

"నేను మాట్లాడే మాటలన్నీ మన మాతృభాషలో వేగా! ఉజ్జీ లాగా పరభాషా పదాల్ని, భావాల్ని అరువుతెచ్చుకోవడం నా కలవాటు లేదే పిన్నీ!"— అపర్ణ.

"బోష్టింగ్ కొంచెం ఎక్కువైందే

ఆపూ! స్వంత డబ్బా వాయించుకోవడం అంత ఆరోగ్యకరం కాదు." — ఉజ్వల

''ఇంతకూ పెళ్ళికూతురు గారు ఒక్కమాట కూడా మాట్లాడటం లేదే మిటీ?'' — ఉమ.

"మీరంతా మాట్లాడుతున్నారుగా! నన్నేం మాట్లాడమంటారు?" — అరుంధతి.

"పెళ్ళి కొడుకును గురించి చెప్పవే. నీకు నచ్చాడా?" — ఉమ

అరుంధతి నిట్టూర్చింది.

"నచ్చటం అంటే ఏమిటే?" — ఉజ్వల.

"ఉమ అడిగింది నిన్ను కాదు." — అపర్ణ.

"ఆ విషయం నాకు తెలుసు." — ఉజ్వల.

"తెలిసికూడా తప్పు చెయ్యడం..." అపర్ణ.

"షటప్!" — ఉజ్వల.

"వీళ్ళెప్పుడూ ఇలాగే పోట్లాడుకుంటారు గాని పెళ్ళి కొడుకును గూర్చి నీ అభిప్రాయం చెప్పవే అక్కయ్యా!" — ఉమ.

"కనీసం నువ్వైనా ఇంత సీరియస్‌గా నాక్కాబోయే జీవిత భాగస్వామిని గురించి అభిప్రాయం అడిగావే చాలా థాంక్స్!"

అరుంధతి కంఠంలో ధ్వనించిన ఆవేదనతో కూడిన నిర్లిప్తత అక్కడున్న వాళ్ళనందర్నీ ఆశ్చర్యపరచింది. కాసేపు అందరూ ఒకరి మొహాలొకరు చూసుకున్నారు.

"అదేమిటే అరూ! నీ అభిప్రాయం కనుక్కోకుండానే నీకీ పెళ్ళి చేస్తున్నారా?" అంది రత్నమ్మ.

"ఊరికే అన్నాను పిన్నీ .... నా అభిప్రాయం అడిగి చేసినా, అడక్కుండా చేసినా పెద్ద తేడా ఏమీ ఉండేది కాదను కుంటాను" — అరుంధతి.

"ఇంతకూ నువ్వు చెప్పదల్చుకున్న దేమిటే అక్కయ్యా!" - ఉమ.

"మ్యారేజెస్ ఆర్ మేడిన్ హెవెన్ అన్నారు కాబట్టి మనం వెంటనే టాపిక్ మార్చటం మంచిది" — అపర్ణ.

"ఎవడా అన్నది? నీలాంటి దద్దమ్మెవడో అయ్యుంటాడు. నీలాంటి చదువుకున్నదీ కూడా ఇలాంటి మూఢ నమ్మకాల్ని వల్లిస్తే నాకు ఒళ్ళు మండుతుంది" — ఉజ్వల.

"మరీ అంతగా ఒళ్ళు మండితే ఓ బిందెడు చన్నీళ్ళు తెచ్చి కుమ్మరిస్తా లేవే" - అపర్ణ.

"కిందకు వెళ్ళి బిందెడు నీళ్ళు శ్రమెందుకు పడ్తావుగాని కాస్త నోరు మూస్తే చాలు" — ఉజ్వల.

"దాని నోరు మూయించటం ఎవరికి సాధ్యమౌతుందే! వసపిట్టలా ఎప్పుడూ వాగుతూనే ఉంటుంది" -అరుంధతి.

"ఔను! నేనెప్పుడూ వసపిట్టలా వాగుతూనే ఉంటాను. నీలాగా మూగ దయ్యంలా ఉండటం నాకు చేతకాదు" అంటూ అపర్ణ అక్కణ్ణించి విసురుగా లేచి వెళ్ళిపోయింది.

కింద కొత్త వాళ్ళెవరో వచ్చిన సందడి కావటంతో ఎవరొచ్చారో చూద్దామని ఉమ, అనల, సారిక మొదలైన వాళ్ళంతా కిందకు వెళ్ళారు.

"పాపం అక్కయ్యొక్కతే పెళ్ళి పనులతో సతమతమై పోతోంది. నేనూ

వెడతానే" అంటూ రత్నమ్మ కూడా కిందకెళ్ళింది.



# 3

"ఎందుకే అరూ! చాలా నిర్లిప్తంగా ఉన్నావు! నీకీ పెళ్ళి ఇష్టంలేదా?" —ఉజ్వల.

"ఈ దేశంలో ఎంతమంది ఆడపిల్లల పెళ్ళిళ్ళు వాళ్ళ యిష్టా యిష్టాల్ని బట్టి జరుగుతున్నాయ్యంటావు"—అరుంధతి.

"దేశం సంగతి తర్వాత మాట్లాడదాం గాని నీ సంగతి చెప్పు. ఇష్టం లేకపోతే 'ఈ పెళ్ళి నాకిష్టం లేదు. నేను చేసుకోను' అని చెప్పాలి. యూనివర్సిటీ చదువులు చదువుకున్న. మనం కూడా ఈ మాత్రం సాహసాన్ని ప్రదర్శించక పోతే ఈ దేశం ఇంకో శతాబ్దం తర్వాత కూడా ఇలాగే ఉంటుంది."

"చెప్పటం చాలా సులువు."

"నిజమే! కానీ, నేను చెప్పింది చేస్తాను. నాకిష్టం లేని పెళ్ళి నేను చేసుకోను. అసలీ అరేంజ్‌డ్ మ్యారేజస్ అంటేనే నాకు అసహ్యం. ముక్కూ, మొహం తెలీని ఓ అగంతకునిచేత తాళి కట్టించుకోవడం కంటే అవమానంలేదను కుంటాను."

"నీ అంత సాహసం నేను చెయ్యలేనే. ఇప్పటికే నాన్నగారు నా పెళ్ళి జరగటం ఆలస్యమయిందని బాధ పడ్తున్నారు. ఐదారు సంబంధాలు ఏవో కారణాలవల్ల కాకుండా పోయాయి. చాలా కాలంగా నేను వాళ్ళకో పెద్ద భారమౌతున్నట్టుగా ఫీలౌతున్నాను. నీలాగా యే ఎం.ఏ. లోనో జాయినయితే నేనింతగా ఫీలయ్యేదాన్ని కాను. కానీ, నాకా అదృష్టం లేదు. సీటు దొరకలేదు. ఏదన్నా ఉద్యోగం చేద్దామంటే అదీ దొరకలేదు. అలాంటప్పుడు చేసేదేముంది? ఎవరో ఒక మహారాజు దొరికిందే భాగ్యమనే స్థితికి నా స్థానంలో ఉన్న ఏ ఆడదయినా వచ్చేస్తుందేమో!" అరుంధతి కళ్ళలో నీళ్ళు తిరిగాయి.

కొద్దిసేపు ఇద్దరూ నిశ్శబ్దంగా కూర్చున్నారు.

"వినయ్ నన్నింత అన్యాయం చేస్తాడనుకోలేదే!" అంది అరుంధతి కొంచెం ఆగి.

"ఎందుకలా చేశాడంటావు?"

"అదే అర్థంకావటం లేదు. నువ్వంటే ఇష్టమేనంటాడు. మరెవ్వరిమీద లేదంటాడు."

"కానీ పెళ్ళిమాత్రం చేసుకోనంటాడు. కవిత్వమంతా ఒలకబోస్తూ ఉత్తరాలు రాస్తానంటాడు రోగ్!"

"అంత మాటనకే ఉజ్జీ, ప్లీజ్!" బాధతో విలవిల్లాడిపోతూ అంది అరుంధతి.

ఉజ్వాల నవ్వింది. "తనకు నచ్చిన వాడి విషయంలో స్త్రీ ఎంత ఉదారంగా ఉంటుందో చూశావా! స్త్రీలోని ఈ బలహీనతనే పురుషుడు ఎంతో తెలివిగా వాడుకొంటూ, దోచుకుంటూ, స్త్రీని అధఃపాతాళానికి తొక్కేస్తున్నాడు. అయినా మనకు బుద్ధి రావటంలేదు.




నీతో ఎంతో స్నేహంగా ఉన్నాడు. నువ్వంటే ఎంతో ఇష్టమన్నాడు. నీకు లెటర్స్ రాశాడు. తీరా పెళ్ళిచేసుకో మంటే నీళ్ళు మింగాడు. ఈజ్ హి నాట్ ఎ రోగ్? అతన్ని రోగ్ అంటే అంత బాధ పడిపోతున్నా వెందుకే?"

అరుంధతి వెంటనే ఏమీ మాట్లాడ లేదు. "చూడటాని కెంతో అమాయ కంగా ఉంటాడు. ఎంతో సాఫ్ట్ గా మాట్లాడతాడు. ఎంతో అందంగా కవిత్వం రాస్తాడు. అలాంటివాడిని రోగ్ అంటే నా అంతరాత్మ ఒప్పుకోవటం లేదే!"

"అంతరాత్మ! నాన్సెన్స్! జీవితాన్ని దృఢంగా ఎదుర్కొగల దమ్ములేని ప్రతి దద్దమ్మకూ అంతరాత్మ ఒక సాకు"

"అంతకఠినంగా మాట్లాడకే, ప్లీజ్!" ఉబికి వస్తున్న కన్నీళ్ళను ఆపుకోవ టానికి ప్రయత్నించింది అరుంధతి.

"నువ్వు మరీ సున్నితంగా పెరిగావే అరూ! అతడు నిన్ను పెళ్ళి చేసుకోక పోవటానికి చెప్పిన కారణమేమిటి?"

"ఏ కారణమూ చెప్పడు. పెళ్ళిచేసు కోవటం అంత అవసరమా? అంటాడు ఎప్పుడూ ఇలాగే స్నేహితులుగా ఉండి పోతేనే బావుంటాదంటాడు. నిన్ను పెళ్ళి చేసుకుంటే ఏదో ఒక విషయంలో నీతో పోట్లాడాల్సి వస్తుంది. చాలీచాలని జీతం, పిల్లలు, ఇరుకు గదులు, రోగాలు, రోష్టులు, ఆ నరకప్రాయమైన సంసారం లోకి నన్నెందు కీడుస్తావు? అంటాడు. వెరీ స్ట్రేంజ్ ఫెలో! ఎప్పుడూ కలలు కంటూ బ్రతుకుతాడు. వాస్తవం కంటే కలలే బాగుంటాయంటాడు."

"భావకవిత్వం బాగానే తలకెక్కి నట్లుందే! నేనొక విషయం చెపుతున్నాను గుర్తుంచుకో! ఇలా అనేవాడే ఓ మంచి ఉద్యోగం దొరగ్గానే ఓ ఇరవై ముప్పై వేల రూపాయలు కట్నం తీసుకొని భేషుగ్గా పెళ్ళి చేసుకొని సంసారం చేస్తాడు. పిల్లల్ని కంటాడు. పెళ్ళాంతో పోట్లాడతాడు. వీలైతే లంచాలు కూడా తీసుకొంటాడు. బాంక్ బాలన్స్ పెంచు కుంటాడు."

"నేను నమ్మలేనే!"

"గో టు హెల్! లేకపోతే జీవితాంతం బ్రహ్మచారిగా ఉండి నీ గురించి కలలు గంటూ, కవిత్వం రాస్తూ బ్రతుకుతాడను కుంటున్నావా? స్టుపిడ్..."

"మనిషి చాలా సిన్సియర్‌గా కని పిస్తాడు..."

"పోనీలే! ఆ వినయ్‌నిక వదిలేసి రేపు రాబోయే ఈ వినయ్ గురించి చెప్పు!"

"చెప్పటానికేముంది?"

"చెప్పటానికేమీ లేదా? రేపట్నుంచి నీ జీవిత భాగస్వామి కాబోతున్నవ్యక్తిని గూర్చి చెప్పటానికేమీ లేదా?"

"నాకేం తెలుసునని నీకు చెప్పటానికి?"

"ఏం తెలుసుకోకుండానే అతనిచేత తాళి కట్టించుకోబోతున్నావా?"

"మా వాళ్ళు తెలుసుకున్నారు. అతన్ని పెళ్ళిచేసుకోమన్నారు"

"నువ్వు కళ్ళు మూసుకొని చేసు కుంటున్నావు."

"అంతకంటే చేసేదేమీ కనిపించడం లేదు."

"కాస్త చదువుకొన్న మనం కూడా

ఇలా పిరికిగా ప్రవర్తిస్తే ఏమీ చదువుకోని అమాయకులైన అమ్మాయిల గతేమిటి?"

"చదువుకున్నా, చదువుకోక పోయినా ఈ దేశంలోని ఆడపిల్లలందరి సమస్యలూ ఒక్కటే! బి.ఎ. చదివి ఇంట్లో కూర్చున్న ఇద్దరు బిడ్డల పెళ్ళిళ్లు చేసెయ్యాలని ఏ తండ్రయినా తొందర పడతాడు. నా పెళ్ళి కాకుండా అపర్ణ పెళ్ళికాదు. అపర్ణ నా కంటే అందంగా ఉంటుంది. హుషారుగా ఉంటుంది. చూసేవాళ్ళను త్వరగా ఆకర్షిస్తుంది. నా కోసం వచ్చిన పెళ్ళి వారందరికీ అపర్ణ నచ్చటం...వాళ్ళు మీ రెండో అమ్మాయి నయితే చేసుకుంటా మనటం... మా వాళ్ళు పెద్దమ్మాయికి చెయ్యకుండా రెండో అమ్మాయికి చెయ్యలేమనటం... ఈ లెక్కన ఇప్పట్లో నాపెళ్ళి జరగదు. కాబట్టి తనకూ త్వరలో పెళ్ళి జరిగే ఆశ లేదనీ, తనపెళ్ళి జరక్కపోవడానికి నేనే కారణమనీ అపర్ణ కూడా ఫీల్ కావటం... ఈ పరిస్థితుల్లో నన్నేం చేయమంటావు చెప్పు? ఎక్కడెక్కడో తిరిగి, ఎవరెవర్నో సంప్రదించి చివరికి ఈ సంబంధం తెచ్చారు. ఆ అబ్బాయికి నేను నచ్చానట! ఏడెనిమిది మంది పెళ్ళి కొడుకుల్లో ఒకరికైనా నచ్చినందుకు నన్ను నేను అభినందించు కున్నాను. అంతే! అతన్ని గూర్చి తెలుసుకోడానికి నేను ప్రయత్నించలేదు. నా పెళ్ళి జరిగి మావాళ్ళ భారం తీరిపోతే అదే చాలను కున్నాను."

"కనీసం అతన్ని చూశావా?"

"చూశాను. కానీ అతనెలా ఉంటాడో ఇప్పుడు నాకు గుర్తుావడం లేదు."

'అక్కయ్యా! అక్కయ్యా!' అంటూ కేకలు పెడ్తూ అపర్ణ అక్కడికి పరిగెత్తుకొని వచ్చింది. 'మద్రాసునుంచి సందీప్ వాళ్ళు వచ్చేశారు' అని చెప్పేసి గిరుక్కున వెనక్కు తిరిగి అదే పరుగుతో మెట్లు దిగి కిందికి పోయింది.

"సందీప్ వాళ్ళను చూసి చాలా కాలమైంది. నేనూ వెళ్తానే..."

"సందీప్‌ను చూడాలని నీకూ ఉత్సాహంగానే ఉందన్నమాట"

"అబ్బే! ఉత్సాహం ఏమీ లేదు. వాళ్ళంతా మనకు దూరంగా ఎక్కడో మద్రాసు మహా నగరంలో ఉంటున్నారు. వాళ్ళను చూసి చాలా కాలమైంది."

"అంత డొంకతిరుగుడు సంజాయిషీ అక్కరలేదు. లేవే! నాకు తెలుసు."

"ఏం తెలుసు? నీ మొహం..."

"నాకేం తెలుసో నీ మొహమే చెబుతోంది"

"పెళ్ళికూతురుగారికి తెలివి కొంచెం ఎక్కువైందే!"



## 4

క్రిందంతా సందడిగా ఉంది. పెళ్ళి కొచ్చిన చాలామంది బంధువులతో కిటకిట లాడుతోంది. అప్పుడే ఆటో దిగిన రాధమ్మ, సందీప్ అతని పక్కన అతని ఫ్రెండ్ రవికాంత్ సోఫాలో కూర్చున్నారు.

"ఏమిటే అక్కయ్యా! ఇంత పొద్దు పోయింది. ట్రెయిన్ లేటా?" అన్నాడు కృష్ణమూర్తి.

"ట్రెయిన్ టైముకే వచ్చింది మామయ్యా! స్టేషన్‌లో టాక్సీ దొరకలేదు. అరగంటసేపు చూసి రెండు ఆటోల్లో వచ్చాము. మద్రాసు నుండి వరంగల్ చేరటానికి కెంత టైము పట్టిందో, వరంగల్ నుండి హనుమకొండ చేరుకోటానికి అంతకంటే ఎక్కువ టైము పట్టింది. ఇదీ మన దేశంలో పరిస్థితి" అన్నాడు సందీప్.

"జోక్ బాగానే ఉందిగాని కొంచెం ఎక్కువైంది బావగారూ" అంది అపర్ణ.

"కొంచెం ఎక్కువైతేనే జోక్, జోక్స్ విషయంలో నీకింకా ఫండమెంటల్స్‌కూడా తెలిసినట్టులేదు. బై ది బై నిన్ను చిన్నప్పు డెప్పుడో చూశాను. నీ పేరు గుర్తు రావటం లేదు."—సందీప్.

"అదేమిట్రా దీపూ! అది మామయ్య రెండో కూతురు అపర్ణ కాదుట్రా"

"ఎప్పుడో చిన్నప్పుడు చూసుంటాడు. వాడికేం గుర్తుంటుంది లేవే!" కృష్ణమూర్తి.

"ఓ!అపర్ణ! బ్యూటిఫుల్!"—సందీప్

"ఏమిటి బ్యూటిఫుల్? పేరా? మనిషా! బై దిబై బావున్నారా సందీప్ గారు!" —ఉజ్వల

"నువ్వే రక్షించాలి మమ్మీ! ఎవరీ అందాల బాల?" అన్నాడు సందీప్ వాళ్ళమ్మ చెవిలో.

"ఆ అమ్మాయి ఉజ్వల. అపర్ణ వాళ్ళ పెద్దమ్మ కూతురు. ఏం ఉజ్వలా! బావున్నావా? అమ్మా వాళ్ళొచ్చారా? ఏం చదువు తున్నావు?" అడిగింది రాధమ్మ.

"అందరమూ వచ్చాము. నేను ప్రస్తుతం ఉస్మానియాలో ఎం.ఎ. ఏకనమిక్స్ చేస్తున్నానండీ!" అంది ఉజ్వల.

"ఉజ్వల! ఎంత అందమైన పేరు! ఈ పల్లె ప్రాంతాల్లో కూడ ఇంతమంచి పేర్లు పెట్టుకునే వాళ్ళున్నారన్నమాట!" అన్నాడు సందీప్.

"ఇంకా నయం! ఈ పల్లెప్రాంతాల్లో ఉండే వాళ్ళుకూడా అన్నం తింటారా? బట్టలేసు కుంటారా? తెలుగు, హిందీ, ఇంగ్లీషు భాషలు కూడా మాట్లాడారా? అన్లేదు" అంది ఉజ్వల.

అక్కడున్న వాళ్ళంతా నవ్వారు.

"అలానే అందామను కున్నాను గాని, మిమ్మల్ని చూసి నా అభిప్రాయం మార్చుకోవాల్సి వచ్చింది."—సందీప్

"అంటే ఆమె తప్ప ఇక్కడున్న మిగతా వాళ్ళెవరు మీ కళ్ళకు నాగరికత తెలిసిన మనుషుల్లా కన్పించడం లేదన్న మాట."— అపర్ణ.

"అఫ్ కోర్స్! బెర్నార్డ్ షా జోకొకటి గుర్తొస్తోంది. అమెరికాలో ఓ మీటింగ్‌లో మాట్లాడుతూ అమెరికన్స్‌లో ఏభై శాతం ఫూల్స్ అన్నాట్ట షా. వెంటనే అక్కడున్న వాళ్ళంతా మమ్మల్ని ఫూల్సంటారా? అని పెద్ద గోల చేశారట. వెంటనే ఏమన్నాడో తెలుసా?"

—సందీప్.

"యాభై శాతం అమెరికన్స్ తెలివైన వాళ్ళు" అన్నాడు. వెంటనే అక్కడున్న అమెరికన్స్‌అంతా చప్పట్లు కొట్టారు."

—ఉజ్వల.

మళ్ళా అందరూ నవ్వారు. అపర్ణ తప్ప.

చతుర ... లలి

"ఏం అపర్ణా, జోక్ బాగాలేదా !" ...సందీప్.

"చాలా బాగుంది! మాలాంటి అడివి మనుషులకు మీ జోక్స్ అర్థమౌతాయా?" అంది అపర్ణ రుసరుసలాడుతూ.

"కోపమొస్తే ఆడవాళ్ళు అందంగా ఉంటారన్నది వట్టి కవుల కల్పనే అనుకున్నాను. కానీ ఈ క్షణంలో అపర్ణను చూస్తే అది నిజమేననిపిస్తోంది" అన్నాడు సందీప్. ఈసారి అందరితోపాటు అపర్ణ కూడా నవ్వింది.

"బైదిబై మీట్ మై ఫ్రెండ్ రవికాంత్ ! వీడు మంచి మోడరన్ ఆర్టిస్టు, మంచి గాయకుడు. పుట్టినప్పటినుంచి మద్రాసులోనే ఉండి అరవ్వాళ్ళలో కలిసిపోయాడు. 'తెలుగు దేశాన్నెప్పుడూ చూడలేదు. ఒకసారి చూపించరా బాబూ అని కాళ్ళావేళ్ళాపడితే తీసుకొచ్చాను" అన్నాడు సందీప్ తన స్నేహితుడిని చూపుతూ.

రవికాంత్ అందరికీ నమస్కారం చేశాడు.

"వీడి గడ్డాన్ని, మీసాల్ని, లాంగ్ హేర్ని, నల్లటి మొహాన్ని చూసి చిన్న పిల్లలు ఝుడుసుకోగలరు. వాళ్ళనెవర్నీ వీడి దగ్గరికి రానివ్వకండి." —సందీప్.

"చిన్న పిల్లలే కాదు. పెద్ద పిల్లలు కూడా ఝుడుసుకోగలరు." —అపర్ణ.

"అమ్మా, అపర్ణా! వాళ్ళకు కాఫీ అదీ చూడు !" అన్నాడు కృష్ణమూర్తి.

"ఏమే అనలా ! బావగారికి కాఫీ తెచ్చివ్వు" అంది అపర్ణ అక్కడే ఉన్న అనలతో.

"చెప్పింది నీకైతే నేనెందు కెళ్ళాలి?" అనల

"ఇక్కడా పోట్లాడుకోవటమేనా! ఎవరో ఒకరు త్వరగా వెళ్ళండి!" —కృష్ణమూర్తి.

"మొద్దు! ఎప్పుడూ ఇంతే!" అనల నెత్తిమీద ఒక మొట్టికాయవేసి అపర్ణ లోపలికెళ్ళింది.

సందీప్ బావ ఎంతందంగా ఉన్నాడు ఒక క్షణమైనా అతనిమీది నుంచి తన చూపుల్ని మళ్ళించుకోలేకపోయింది. ఆరడుగుల ఎత్తు! తెల్లగా నిగనిగలాడుతున్న శరీరం... విశాలమైన నుదురు ఎదుటి వ్యక్తిని సూటిగాచూసే తళతళలాడుతున్న కళ్ళు... నల్లగా మెరుస్తూ భుజాలదాకా వేలాడుతున్న ఉంగరాల జుట్టు... కలలో కూడా ఊహించలేనంత అందం బావది! ఈ మూడు రోజుల్లోనూ బావను తనవైపు తిప్పుకోవాలి. మధ్యలో ఈ ఉజ్వలొకతె. తనంత తెలివైన వాళ్ళు, అందమైన వాళ్ళు, లేరనుకుంటుంది. ఉజ్వల తన కంటె అందమైందా? తనకంటె ఒక అంగుళం పొడుగెక్కువేమో. పైగా ఎం.ఎ. చదువుతోంది. వెధవ ఎం॥టెన్స్ లేకపోతే తనూ ఎం. ఎ. చదివేదే. అయినా బావమీద తనకున్న అధికారం ఉజ్వలకెందుకుంటుంది? అంతా తన పిచ్చిగాని ఆకాశమంతెత్తున్న బావ తనకూ అందడు, ఉజ్వలకూ అందడు.

"ఏమిటే అపర్ణా ఆ పరధ్యానం! ముందున్న కాఫీ కప్పును తన్నేశావు" —రాజమ్మ.

"పోతే పోయింది లేవే! మద్రాసు నుంచి బావ, అత్తయ్య వచ్చేశారు, త్వరగా వాళ్ళకు కాఫీ పట్టుకెళ్ళాలి. కాస్త కాఫీ కలిపివ్వమ్మా!"

"కాఫీ కలిపివ్వమని నన్నడుగుతావేమే? నేనేమీ పన్లేక కూర్చున్నట్టు. వంట మనిషి నరసింహాచారి నడుగు." —రాజమ్మ.

"అబ్బబ్బ! ఇప్పుడా వంట గదిలోకి వెళ్ళే ఓపిక నాకు లేదే! పిన్నీ! పిన్నీ, ప్లీజ్! వంటమనిషితో ఓ మూడు కప్పులు కాఫీ పట్టించుకురావా! నే వెడ్తున్నాను."

"ఏం మామయ్యా! అరుంధతికి కట్నమెంతిస్తున్నారు?" కృష్ణమూర్తి నుద్దేశించి అన్నాడు సందీప్.

"కట్నాన్ని గూర్చి అడుగుతావా? ఆ అడిగేవాడి నోటికి మొక్కాల్సిందే... ఇంట్లో తినటానికి తిండి లేకపోయినా ఓ మొగపిల్లవాడు...వాడు కాస్తో కూస్తో చదువుకున్నవాడు అయ్యుంటే చాలు. ఇరవై వేలు, ముప్పైవేలు అంటున్నారు. మగపిల్లవాడుగల తండ్రికి ఒక వెయ్యుంటే ఓ రూపాయతో సమానంగా కనిపిస్తుంది. అమ్మాయి బాగుండాలి. చదువుకోవాలి. వీటితో పాటు వేలకువేలు కట్నం తేవాలి. లాంఛనాల్లో ఎలాంటి లోపమూ జరక్కూడదు. రోజురోజుకు మన పెళ్ళికొడుకుల కోరికలకు అంతూ పంతూ లేకుండా పోతోందిరా" అన్నాడు కృష్ణమూర్తి.

"మనం పెళ్ళికొడుకుల్ని ఇలా నెత్తిమీదెక్కించుకున్నంత కాలం ఇలాగే జరుగుతుంది బాబాయ్! మనమసలు వీళ్ళనింతగా ఎందుకు యాచించాలి. నువ్వు చేసుకోకపోతే ఆ అమ్మాయికిక పెళ్ళికాదు బాబోయ్ అన్నట్టుగా ఈ ఆడపిల్లల తల్లి

దండ్రులెందుకు ప్రవర్తించాలి ? అసలీ దేశంలోతమ పిల్లల పెళ్ళిళ్ళను గూర్చితల్లి దండ్రు లింతగా ఎందుకు పట్టించుకోవాలో నాకర్థం కాదు"—ఉజ్వల.

"తల్లిదండ్రులు పట్టించుకోకపోతే ఎవరు పట్టించుకుంటారే"—కృష్ణమూర్తి

"ఆ పెళ్ళి చేసుకునే వాళ్ళే పట్టించుకోవాలి. పెళ్ళి అనేది పూర్తిగా ఆ పెళ్ళి చేసుకోబోయే యువతీయువకులకు సంబంధించిన వ్యవహారం. దాంట్లో ఎవరూ జోక్యం చేసుకోకూడదు. వాళ్ళిద్దరూ ఒకరికొకరు బాగా తెలిసుండాలి. ఇద్దరి మధ్య పరస్పర అవగాహనా, ఆకర్షణా ఏర్పడి అది పెళ్ళి చేసుకోవటానికి దారి తీయాలి. అంతేగాని ఇద్దరు ముక్కూ మొఖం తెలియని వాళ్ళకు ఈ తల్లిదండ్రులిలా బలవంతంగా పెళ్ళిచేసి జీవితాంతం కలిసుండాలి అని శాసించటం ఏమిటి? ఎంతో చదువుకున్న యువతీయువకులు కూడా ఈ అరేంజ్డ్ మారేజెస్‌కు మొద్దుల్లాగ తలొగ్గడం చూస్తే వళ్ళు మండుతుంది--"ఉజ్వల.

"మీరు చలం శిష్యురాలిలా ఉన్నారే? యామై కరెక్ట్?"—సందీప్.

"నో. యూ ఆర్ నాట్ కరెక్ట్. నేను చలం శిష్యురాలిని కాదు. మరెవరి శిష్యురాలినీ కాదు"—ఉజ్వల.

"ఇందాక మీరు మాట్లాడిన ప్రతి మాటలో నాకు చలమే కనిపించాడు. చలం ప్రచారం చేసిన భావాల్ని వల్లించొచ్చు. కానీ ఆయన శిష్యురాల్నని చెప్పుకోవటం మాత్రం ఇష్టంలేదు."—సందీప్.

"అదేంకాదు. చలంతో నాకు కొన్ని మౌలికమైన విభేధాలున్నాయి. ఒకప్పుడు నేనూ చలమంటే పడిచచ్చేదాన్నే. స్త్రీకి జరుగుతున్న కొన్ని అన్యాయాల్ని చలం మొట్టమొదటిసారిగా చాలా ఆవేశపూరితంగా ఖండించాడు. కానీ ఆయన సాహిత్యాన్ని సీరియస్‌గా అధ్యయనం చేస్తే నాలాంటిదాన్ని ప్యాక్ చేసే విషమొకటి తెలుస్తుంది"—ఉజ్వల.

"ఐ థింక్ సెక్స్‌పట్ల ఆయన దృక్పథమే మిమ్మల్నంత ప్యాక్ చేసి ఉంటుంది?—సందీప్.

"కాదు. పూర్వపు ప్రబంధకవుల్లాగే చలం కూడా స్త్రీ నొక విలాసవస్తువుగా, పురుషుడిలోని లైంగిక వాంఛల్ని సంతృప్తి పరచాల్సిన ఒక సాధనంగా మాత్రమే చూశాడనిపిస్తుంది. మరొక విషయం...పూర్వపు స్త్రీలు భర్తలకోసం త్యాగాలు చేస్తే చలం - స్త్రీలు ప్రియుల కోసం తమ సర్వస్వాన్ని త్యాగం చేస్తారు. దటీజ్ రియల్లీ ప్యాకింగ్..."—ఉజ్వల.

"మీ రంతగా ప్యాక్ కావల్సిందేమిటో నాకర్థం కావటంలేదు. చలం స్త్రీలను సరిగ్గానే అర్థం చేసుకున్నాడని నా అభిప్రాయం. ఈ సృష్టి ఇలాగే కొనసాగాలంటే స్త్రీ పురుషులు కలుసుకోవాలి. అది జరగాలంటే స్త్రీ పురుషుణ్ని ఆకర్షించాలి. వారిలోని సెక్సువల్ ఇన్‌స్టింక్ట్‌ని ప్రొవోక్ చెయ్యాలి. చలమైనా, మీరైనా, నేనైనా ఈ అంశాన్ని ఎలా కాదనగలము. ఈ సృష్టిలో స్త్రీ స్థానం యేమిటంటే షీ ఈజ్ ఎ మదర్. స్త్రీ పిల్లల్ని కనాలి. వాళ్ళను పెంచి పోషించాలి. స్త్రీ పిల్లల్ని కనాలంటే ఆమె పురుషుణ్ని ఆకర్షించాలి. సృష్టి స్త్రీకి సమకూర్చిన అందమంతా




ఇందుకోసమే. ఉమెన్స్ లిబరేషన్ అంటూ మీరెన్ని థియరీలు చెప్పినా ఈ మౌలిక సత్యాన్ని తారుమారు చెయ్యలేరు. అసలీ సోకాల్డ్ ఉమెన్స్ లిబ్బర్సంటే నాకేమాత్రం సింపతీ లేదు. —సందీప్.

"ఔను! మీరూ మగవారేగా. స్త్రీలను పిల్లలు కనే యంత్రాలుగా, సెక్స్ ఆబ్జెక్ట్స్‌గా తప్ప మరోలా చూడలేని తరతరాల సంస్కారం మీ రక్తంలో కూడా ప్రవహిస్తోంది. అలాంటప్పుడు ఉమెన్స్ లిబరేషన్ మూవ్‌మెంట్ పట్ల మీ కెలా సింపతీ ఉంటుంది? అయినా మీలాంటి వాళ్ళ సింపతీ కోసం మేమేమీ యాచించటంలేదు" —ఉజ్వాల

"అరె! కోపమొచ్చిందా? ఆర్గ్యుమెంట్‌లో కోపం రాకూడదు-జస్ట్ కాలక్షేపానికి మీతో వాదించాను. అంత సీరియస్‌గా తీసుకోవద్దు"—సందీప్.

"కొన్ని విషయాల్ని నేను సీరియస్‌గా తీసుకోకుండా ఉండలేను."

"అదేమిటే! కాఫీ లేకుండా వట్టి చేతులతో వస్తున్నావు"—కృష్ణమూర్తి.

"కాఫీ ఇక్కడకు వచ్చే ఏర్పాట్లు చేసే వస్తున్నాను డాడీ! బావగారూ!

మీకు కాఫీ ఎలా ఉండాలి? హాటా? కోల్డా పంచదార ఎక్కువుండాలా? తక్కువుండాలా? త్వరగా చెప్పండి!"-అపర్ణ.

"త్వరగా చెప్పేస్తున్నా! అచ్చం నీలా ఉండాలి!"—సందీప్.

అందరూ ఆ మాటకు నవ్వారు. కానీ అపర్ణకా మాట అద్భుతంగా ఉంది.

"ఓ. కే. బావగారూ! అచ్చం నాలాంటి కాఫీ తీసుకొస్తాను" అంటూ అపర్ణ గిరుక్కున వెనక్కు తిరిగింది. అబ్బ! బావ ఎంత తియ్యగా మాట్లాడాడు. ఈ ఇంట్లో ఉన్న ఆడపిల్లలంతా బావను చూపుల్తో తినేస్తున్నారు. అందరూ మాయమైపోయి తనూ, బావ ఇద్దరే మిగిలిపోతే ఎంత బావుండును అనుకుంది అపర్ణ.

"మీ ఫ్రెండ్‌గారేమీ మాట్లాడటం లేదేమిటి?"— ఉజ్వల.

"వాడంతే లెండి! మాట్లాడడు. పాడతాడు"—సందీప్.

"పోనీ, పాడమనండి"—ఉజ్వల.

"అంత ఈజీగా పాడతాడా! వాడికి మూడ్ రావాలి"—సందీప్.

"మూడ్ రావాలంటే ఏంచెయ్యాలి?"
—ఉజ్వల.

"కొంచెం హాట్ స్టఫ్ పడాలి."
—సందీప్.

"నోర్ముయ్యరా దీ పూ! ఊరికే ఎందుకురా వాగుతావు?"—రవికాంత్.

"ఉజ్వలగారు వింటారుట. ఒక పాట పాడరా కాంత్!"—సందీప్.

"పాటసంగతి తర్వాతగాని, ఉజ్వల గారికి నాదో చిన్న ప్రజంటేషన్!" రవికాంత్ తన చేతుల్లో ఉన్న తెల్లకాగితాన్ని ఉజ్వల చేతికిచ్చాడు.

"వాటిజ్ దిస్?" ఉజ్వల కాగితాన్ని విప్పి చూసింది.

"వండ్రఫుల్" అంది ఉజ్వల ఆ కాగితం మీదున్న పెన్సిల్ డ్రాయింగ్ కేసి కళ్ళప్పగించి చూస్తూ.

చుట్టూ కూర్చున్న ఆడపిల్లలంతా ఉజ్వల చుట్టూ చేరి ఆ కాగితాన్ని చూడసాగారు. "ఎవరీమె? ఎంత అందంగా ఉంది? అప్పుడే ఎలా వేశారు?" అన్నారంతా.

"వీడప్పుడే బొమ్మ గీసేశాడన్న మాట. ఏదీ నన్నొకసారిచూడనివ్వండి" ఉజ్వల చేతిలో ఉన్న కాగితాన్ని సందీప్ తీసుకున్నాడు.

"ఫెంటాస్టిక్ ఫెలో! సెకండ్లలో ఉజ్వల అందాన్నంతా ఈ గీతల్లోకి తీసుకు రాగల్గాడు." – సందీప్.

అప్పుడే కాఫీ కప్పుల్తో అక్కడికొచ్చిన అపర్ణ "ఏమిటి బావా అది? నాకు చూపించవూ?" అంది. అపర్ణ ఆ బొమ్మకేసి ఆశ్చర్యంగా చూసింది.

"ఎవరీమె? ఎవరు వేశారీ బొమ్మ?"
—అపర్ణ.

"ఆమెవరో చెప్పుకో చూద్దాం!"
—సందీప్.

"ఎక్కడో చూసినట్టుంది."—అపర్ణ.

అందరూ నవ్వారు.

"ఎందుకు నవ్వుతారు?—అపర్ణ అసహనంగా.

"ఆ బొమ్మలో ఉన్నమ్మాయి ఇప్పుడు నా ఎదురుగానే ఉంది!"
—సందీప్.

"ఈ బొమ్మనేనా?" అకస్మాత్తుగా అపర్ణ మొఖంమీద సిగ్గు దొంతరలు దోబూచులాడాయి.




''సారీ అపూ! ఆ బొమ్మ ఉజ్వలది. మా కాంత్ వేశాడు. చాలా బాగా వేశాడు కదూ!''—సందీప్.

మరుక్షణంలో అపర్ణ ముఖం వివర్ణ మయిపోయింది.

''మీ ఫ్రెండ్‌కు ఆడపిల్లల బొమ్మలు వేయడం తప్ప ఇంకేమీ పని లేదన్న మాట.''—అపర్ణ కోపంగా.

"ఆడపిల్లల బొమ్మలు గీయటం కాదు వాడి పని. బ్యూటీని శాశ్వతం చెయ్యడం. బాధపడకు అపూ! వాడికి మూడ్ రావాలే గాని, వెళ్ళేలోగా నీ బొమ్మ కూడా వేస్తాడు''—సందీప్.

"ఏం అక్కరలేదు. వేరేవాళ్ళలాగా పిచ్చిపిచ్చి బొమ్మలు వేయించుకోవా లన్న సరదా నాకేం లేదు ఆ సరదా వున్నవాళ్ళను వేయించుకోమనండి'' —అపర్ణ.

బయట ఆటోరిక్షా ఆగిన చప్పు డైంది. అందరూ గేటువైపు చూశారు.

"విమలమ్మత్త వచ్చేసింది'' అంది అపర్ణ.

"ఏమిటే విమలా ! ఇంతాలస్యం'' ఎదురుగా వెళ్ళాడు కృష్ణమూర్తి.

"బస్సు టైర్ పంక్చరైంది. మామయ్యా!'' అన్నాడు సుధీర్ ఆటో దిగి.

"నువ్వు కూర్చున్నవైపేనా బావా!'' అంది అనల.

అందరూ నవ్వారు.

"బావగారు అంత లావున్నారని అంత లావు జోకేస్తావుటే అనూ!''అంది ఉమ.

"ఔనన్నయ్యా! టైర్ పంక్చరయి ఓ గంటసేపు ఆలస్యమయింది'' అంది విమలమ్మ.

"అసలీ వెధవ ఆర్టీసీ బస్సుల్లో ప్రయాణం చేయటం కంటే నడిచి రావడం మేలనిపిస్తుంది.''—సుధీర్.

"కొంచెం ఎక్సర్‌సైజన్నా అవు తుంది. అప్పుడు టైర్లు క్షేమంగా ఉంటాయి" వెంటనే అంది అనల. మళ్ళీ అందరూ నవ్వారు.

"ఏం మరదలు పిల్లా! ఏదో పోనీలే అని ఊరుకుంటుంటే తెగ జోకులేస్తు న్నావే? కొంచెం ఆటో దిగనీ!''—సుధీర్.

"ఆటో టైర్లు మాత్రం క్షేమంగానే ఉన్నట్టున్నాయే !" —అనల.

ఈసారి అందరూ ఇంకా బిగ్గరగా నవ్వారు. సుధీర్ కూడా నవ్వాడు.

విమలమ్మ, సుధీర్‌లతో పాటు అందరూ లోనికొచ్చారు. కృష్ణమూర్తి పని మనుషుల చేత సామాన్లు లోపల పెట్టించాడు

"ఏమిటి బావా! పత్రికలు తెగ చది వేస్తున్నట్టున్నావు" సుధీర్ చేతిలో ఉన్న పత్రికలు తలాఒకటి తీసుకొని తిరగేయ సాగారు.

"తెలుగు సినిమా పత్రికలకు మా బావగారు మహారాజ పోషకులు"-అనల.

"కాలక్షేపానికి సినిమా పత్రికలే బాగుంటాయి! సరేగానీ, అన్నయ్యగారూ! మీరెప్పుడొచ్చారు ?" అన్నాడు సుధీర్ సందీప్‌ని చూసి.

"ఇంతకు ముందే వచ్చాం! వాడిని ఇదివర కెప్పుడో ఐదారేళ్ళ క్రితం చూశాను. అప్పటికీ ఇప్పటికీ వాడు ఒక్క అంగుళం కూడా పెరగలేదు" అన్నాడు సందీప్ రవికాంత్‌కేసి తిరిగి.

"అదేమిటన్నయ్యా! అట్లా అంటావు ఇదివరకు మనం కలుసుకున్నపుడు నా హైటు అయిదడుగులు. ఇప్పుడు ఐదున్నర. అప్పటికీ, ఇప్పటికీ నేను ఆరు అంగుళాలు పెరిగాను. మరి ఒక్క ఇంచ్ కూడా పెరగలేదంటావేమిటి ?" అన్నాడు సుధీర్ సీరియస్‌గా.

"అరేయ్ సుధీర్! నువ్వొక్క ఇంచ్ కూడా పెరగలేదనటానికి ఇప్పటి నీ ఆన్సర్ చాలురా" —సందీప్.

"నా కర్థం కాలేదు" —సుధీర్.

"ట్యూబ్ లైట్ బుర్ర! ట్యూబ్ లైట్ కాస్త త్వరగానే వెలుగుతుంది. నియాన్ లైట్ బుర్రంటే కరక్టుగా సరిపోతుంది." —సందీప్.

"ఏమిటీ ట్యూబ్‌లైట్, నియాన్ లైట్ల గొడవ? నా హైట్‌కు ఈ లైట్లకు సంబంధం ఏమిటో కొంచెం కూడా బోధ పడటం లేదు" — సుధీర్ విసుగ్గా.

"మీలో మెంటల్‌గా పెరుగుదల లేదు అంటారు సందీప్ బావగారు. ఎందుకంత తికమక పడ్డారు" —అపర్ణ.

"నువ్వు భలే దానివే అపర్ణా! నేనిప్పుడు తికమక పడ్డానా? నా సంగతి నీకు తెలియదేమో! మిన్ను విరిగి మీద పడ్డా నేను తికమక పడను. తెల్సిందా? నేను కాలేజీలో చదువుకునే రోజుల్లో ఒకసారేమైందో తెలుసా?" —సుధీర్.

"ఒరే సుధీర్ ! ఇప్పుడా కథంతా చెబుతావా?" —సందీప్ భయపడి పోతున్నట్టు మొఖం పెట్టి.

"కథ కాదన్నయ్యా ! నిజంగా జరిగింది. పెద్ద మద్రాసులో ఉంటున్నావు.

కథకూ, నిజంగా జరిగిందానికి తేడాయే తెలీదు" పెద్ద జోకేసినట్టు తనకు తానే నవ్వుకున్నాడు సుధీర్.

"కాలేజీలో చదువుకునే రోజుల్లో ఏం జరిగిందో చెప్పండి బావగారూ! మేం వింటాం" —అనల.

"ఆఁ.. చెబుతాను..ఏప్రెల్ ఫస్టు నాడు నాకు తెలియకుండా మా క్లాస్ మేట్ ఒకడు నా వెనక షర్ట్‌కు ఏప్రిల్ ఫూల్ అని పెద్దగా రాసి ఉన్న పేపరొకటి పిన్ చేశాడు. నన్ను చూసి అందరూ ఒకటే నవ్వటం... చివరకు ఆడపిల్లలు కూడా నవ్వారు. వాళ్ళంతా అలా నవ్వుతుంటే నేనేమన్నా తికమక పడ్డాననుకున్నారా? వాళ్ళతో పాటు నేనూ వాళ్ళకంటే పెద్దగా నవ్వటం మొదలెట్టాను. వాళ్ళు పాపం బోరై పోయి నా వెనుక 'ఏప్రిల్ ఫూల్' అని రాసుందని చూపెట్టారు. అప్పుడు కూడా నేనేమయిన తికమక పడ్డాననుకున్నారా? ఓస్! ఇదా! దీన్నిట్లా నా వెనుకెందుకట్టారు? మీ కంత సరదాగా ఉంటే నా ముందే కట్టుకుంటాను. అని ఆ కాగితాన్ని నా ముందే కట్టేసుకున్నాను". —సుధీర్ ఎవరూ నవ్వటం లేదేమిటని ఆశ్చర్యపడుతూ.

"గ్రేట్ బావా గ్రేట్! సెన్సాఫ్ హ్యూమరంటే అదీ!" —అనల చప్పట్లు కొట్టి

"వేన్నీళ్ళు రెడీగా ఉన్నాయి. స్నానాలు చేసేవాళ్ళు చెయ్యొచ్చు!" —అపర్ణ

"నేను చేసేస్తాను" —సుధీర్.

"మీరు బాత్‌రూంలో కెళ్ళారంటే రెండు గంటలదాకా బయటకు రారు. కాబట్టి మీకు లాస్ట్ ఛాన్స్. మీరు చేసెయ్యండి బావగారూ!" సందీప్ నుద్దేశించి అంది అపర్ణ.

"ఈ విషయంలో కూడా వీడిలో పెరుగుదలేమీ లేదన్న మాట!" —సందీప్.

"ఈ విషయంలో పెరుగుదల ఉందన్నయ్యా! మనం ఇదివరకు కలుసుకున్నప్పుడు నాకు స్నానం చెయ్యడానికి గంటసేపు పట్టేది. ఇప్పుడు గంటన్నర." —సుధీర్.

"ఆడదానిలా గంటన్నరసేపు ఏం స్నానంరా!" —సందీప్.

"స్నానం విషయంలో మగవాళ్ళకంటే ఆడవాళ్ళకేం ఎక్కువుందో నాకర్థం కాదు." —సుధీర్.

"నీకు అర్థంకాని విషయాలు ఈ ప్రపంచంలో చాలా ఉన్నాయి బావా!" —అనల.

"ఒరేయ్! ఆ సినిమా పత్రికలు చదువు తున్నంత కాలం నీకు ఏ విషయమూ అర్థం కాదురా" —సందీప్.

"అన్నట్టు హేమమాలిని బాత్‌రూంకే రెండు లక్షల రూపాయలు ఖర్చయ్యాయని ఓ పత్రికలో చదివాను. రెండు లక్షల రూపాయలు ఖర్చు పెట్టి కట్టించుకున్న ఆ బాత్‌రూం ఎంత అందంగా ఉంటుందో! లైఫ్‌లో ఒక్కసారన్నా అలాంటి బాత్‌రూంలో స్నానం చెయ్యగల్గితే ఎంతదృష్టం" —సుధీర్.

"ఆ సినిమా తారను పెళ్ళాడేసెయ్యి బావా! హాయిగా 24 గంటలూ ఆ బాత్‌రూంలోనే గడిపేసెయ్యొచ్చు." —అపర్ణ.

"అంత పెర్సనాలిటీ లేదని కాదు.

ఇంతమంది అందమైన మరదళ్ళుండగా ఆ సినిమా తారను పెళ్ళాడితే మీరందరూ ఊరుకుంటారా ?" —సుధీర్.

"డాబామీది రెండో గదిని మీ కోసం కేటాయించాము. అందరూవెళ్ళి స్నానాలు చేసి బట్టలు మార్చుకోండి" అన్నాడు కృష్ణమూర్తి.



## 5

సుధీర్ బావ అమాయకుడు. అందుకని అందరూ అతనిమీద జోక్స్ వేసే వాళ్ళే. సందీప్ బావకు కొంచెం గర్వం ఎక్కువే. తనంత అందమయినవాళ్ళు, తెలివైనవాళ్ళు లేరని. కొంచెం హైటు తక్కువనిగాని సుధీర్ బావే సందీప్ బావకంటే బాగుంటాడు. కాకపోతే కొంచెం లావు. తను తప్ప సుధీర్ బావ మీద ఎవరు జోక్స్ వేసినా తను భరించ లేదు. తనెందుకలా ఫీలౌతుంది ? సుధీరంటే తనకిష్టం. అక్కయ్యకు సందీప్ బావంటే ఇష్టం. కానీ సుధీర్ బావను చేసుకుంటే తనేం సుఖపడుతుంది ! పల్లెటూర్లో ఉండాలి. సుధీర్ వాళ్ళ నాన్న చిన్నప్పుడే పోయాడు. వాళ్ళకు బోల్డు వ్యవసాయముంది. సుధీర్ ఒక్కడే కొడుకు. సంసార బాధ్యతలన్నీ బావ నెత్తిమీదే పడ్డాయి. బి.ఏ.దాకా చదివినా ఉద్యోగం చెయ్యడానికి వీల్లేదు. పల్లెటూళ్ళో ఉండటం తనకేమాత్రం ఇష్టం లేదు. కానీ ఆ బావంటే ఇష్టం. అతనిలోని ఆ అమాయకత్వం, ఆ భోలాతనమంటే ఇష్టం. కల్మషంలేని అతని హృదయమంటే ఇష్టం.

"ఏమిటే అనలా! ఒక్కదానివే కూర్చుని ఏమిటే ఆలోచిస్తున్నావు ? సుధీర్ బావను గురించేనా ?" అంది సారిక.

"నేను సుధీర్ బావను గురించి ఆలోచిస్తున్నానని నీకెలా తెలుసే ?" —అనల.

"తెలుసు! అందరం ఒకే వయసులో ఉన్నవాళ్ళం. మన ఆలోచనలన్నీ ఒకే విధంగా ఉంటాయని నాకు తెలుసు"—సారిక.

"అంటే కొంపదీసి నువ్వు కూడా సుధీర్ బావను గురించే ఆలోచిస్తున్నావా ఏమిటి ?" — అనల బోల్డు భయపడి పోతూ.

"అంత భయపడిపోకే అనలా ! నీ బావను నేనేమీ గద్దలా తన్నుకుపోను" —సారిక.

"అయితే నువ్వెవర్ని గురించి ఆలోచిస్తున్నట్టు?"—అనల.

"నేను సందీప్ ఫ్రెండ్ రవికాంత్‌ను గురించి ఆలోచించకుండా ఉండలేక పోతున్నానే"—సారిక.

"అతనిలో ఏముందే అంతగా ఆలోచించడానికి ? ఆ గడ్డాలు, మీసాలు, నల్లగా, మొద్దులా ఉంటాడు. మనిషిలో చలనం లేదు. అతడో జడపదార్థంలా కనిపిస్తున్నాడు. అతనిలో ఏముందే పిచ్చిమొగమా?" — అనల.

"ఆర్ట్! హీ ఈజ్ ఎ గ్రేట్ ఆర్టిస్ట్! కొన్నిక్షణాల్లో ఉజ్వలక్కయ్య రూపాన్ని పెన్సిల్ గీతల్లో బంధించేశాడు. అతడు

చక్కగా పాడతాడట కూడా. అతని పాట వినాలని ఉందే!"—సారిక.

"నువ్వూ పాడతావుగా! ఇంకేం ఇద్దరూ కలిసి డ్యూయెట్లు పాడండి"—అనల వెటకారంగా.

"ఏమిటే అనలా! ఇల్లంతా బంధువులతో సందడిగా ఉంటే ఏమీ పనిలేనట్టు నువ్వూ, సారికా కబుర్లు చెప్పుకుంటున్నారు. వాళ్ళు స్నానాలు ముగించేశారు. మరోసారి వాళ్ళకు కాఫీలివ్వాలి పదండి"—అపర్ణ.

"సుధీర్ బావకూడా అప్పుడే స్నానం చేశాడా?"—అనల.

"సుధీర్ బావకూడా అప్పుడే స్నానం చేస్తే అటు సూర్యుడిటు ఉదయించాడన్న మాటే! ఆయన స్నానం ముగించేటప్పటికి మనందరం భోజనాలు చేసి హాయిగా నిద్రపోవచ్చు. ఛీఛీ! ఏం మనిషో! బాత్ రూంలో కెళ్ళాడంటే బయట కొంపలు అంటుకుపోతున్నా సరే బయటపడడు. పెళ్ళిల్లుకదా! ఎప్పుడూ ఎవరో ఒకరికి బాత్‌రూంతో పనుంటుందికదా! ఒక్కడే వెళ్ళి లోపల కూర్చుంటే బయటివాళ్ళు ఎంత ఇబ్బంది పడతారోనన్న దృష్టే లేకపోతే ఎలా?"—అపర్ణ.

"ఎందుకే అంత కోపగించుకొంటావు. ఎవరి అలవాట్లు వాళ్ళవి"—అనల.

"మన అలవాట్లు మరొకరికి ఇబ్బంది కలిగించకూడదన్న దృష్టి ఉండాలి. నిజమయిన సంస్కారమంటే అది! సందీప్ బావ గంటసేపట్నుంచీ ఎదురు చూస్తున్నాడు. ఈ దొరగారేమో బయట పడడు"—అపర్ణ విసుగ్గా.

"అసలు సంగతి అదన్నమాట! సందీప్ బావ ఇబ్బంది పడుతున్నాడని నువ్వు ఇబ్బంది పడిపోతున్నావు"—అనల రోషంగా.

"షటప్! ఇష్టమొచ్చినట్లు వాగావంటే పళ్ళు రాలగొడతాను జాగ్రత్త"—అపర్ణ రెచ్చిపోతూ.

"ఇప్పుడు ఏమన్నానని పళ్ళు రాలగొడతానంటున్నావు. నీ పళ్ళు రాలగొట్టే వాళ్ళు లేరనా?"—అనల. ఇదంతా చూస్తున్న వాళ్ళ తమ్ముడు గౌతమ్ వాళ్ళమ్మ దగ్గరికి పరిగెత్తాడు.

"అమ్మా! అమ్మా! చిన్నక్కయ్యలిద్దరూ పోట్లాడుకుంటున్నారే" అన్నాడు బంధువులందరికి ఏం కావాలో అందిస్తూ సతమతమౌతున్న రాజమ్మతో.

"పెళ్ళిరోజు కూడా వీళ్ళు పోట్లాడుకోకుండా ఉండలేరుకదా! రత్నా, నువ్వెళ్ళి కాస్త వాళ్ళిద్దర్నీ సముదాయించవే!" అంది రాజమ్మ రత్నమ్మతో. రత్నమ్మ వచ్చేటప్పటికి అనల ఏడుస్తోంది.

"మాటలనడం మొదలే.....ఏడుపూ మొదలే! ఇంటికొచ్చిన బంధువులందరి చేత నన్ను తిట్టించాలని..." అంటోంది అపర్ణ. వాళ్ళిద్దరిచుట్టూ సారిక, ఉమ మొదలైనవాళ్ళంతా చేరారు.

"ఏం జరిగిందే? ఇంటినిండా బంధువులు...మీరిలాగేనా పోట్లాడుకునేది? వాళ్ళు చూస్తే ఏమనుకుంటారు?"—రత్నమ్మ.

"నేనేమీ అనలేదు పిన్నీ! అదే పిచ్చి పిచ్చిగా వాగుతోంది"—అపర్ణ.

"నువ్వే పిచ్చి పిచ్చిగా వాగుతున్నావు"—అనల.

"సరేగానీ, ఇద్దరూ కాస్త నోరుముయ్యండి! కాలేజీల్లో చదువుతున్నారు. ఇంకా చిన్నపిల్లల్లా పోట్లాడుకుంటారా?"

అంది రత్నమ్మ. అపర్ణ మేడ మెట్లెక్కి పైకెళ్ళింది. అసల సారికతో కలిసి అక్కడే కూర్చుంది.

"ఏం జరిగిందే రత్నా?" వంటింట్లో కొస్తున్న రత్నమ్మను చూసి అడిగింది రాజమ్మ.

"ఏముందక్కయ్యా! పిల్లలే దో పోట్లాడు కుంటారు"— రత్నమ్మ. కూరగాయలు తరుగుతూ అక్కచెల్లె ళ్ళిద్దరూ మాట్లాడుకో సాగారు.

"వాళ్ళింకా పిల్లలేనా? వాళ్ళ పోట్లా టలతో వేగలేక పోతున్నానే! ఇద్దరికీ క్షణం పడదు. వాళ్ళిద్దరికీ పెళ్ళిళ్ళుచేసి అత్తవారింటికి ఎప్పుడు పంపిస్తానో కాని అప్పటి వరకు ఈ యింట్లో శాంతి లేదు. ఈ ఒక్కదాని పెళ్ళి చెయ్యటానికే రెండు మూడేళ్ళు కష్టపడాల్సి వచ్చింది. ఇక ఈ యిద్దరి పెళ్ళిళ్ళు చెయ్యటానికి ఎన్ని అవతారా లెత్తాలో!" అంది రాజమ్మ.

"మేనరికం ఉంది కదా! మీమ్మదాసు ఆడబిడ్డ కొడుక్కు అపర్ణనిస్తే సరిపో తుందిగా! అడిగారా?" అంది రత్నమ్మ.

"వాళ్ళు మన పిల్లల్నెక్కడ చేసు కుంటారే! వాళ్ళు చాలా గొప్పవాళ్ళు. అరుంధతిని చేసుకొమ్మనే అడిగాం... 'వాడిప్పుడు పెళ్ళొద్దంటున్నాడు. రెండో అమ్మాయి వరకూ చూద్దాంలేరా' అంది వాళ్ళక్కయ్య. వాళ్ళకు 50,60వేల రూపాయల కట్నం ఇస్తామని వచ్చే వాళ్ళున్నారు. మనమంత కట్నం ఇవ్వనూ లేమూ, వాళ్ళు చేసుకోనూ చేసుకోరు."

"అయినా ఒకసారి అడిగి చూడ టంలో తప్పేమీ లేదుగా! మన అపర్ణ అక్కురాడికి నచ్చవచ్చు! ఇష్టపడొచ్చు!"

"నిజమే! అపర్ణ కాస్త అందంగా, చలాకీగా ఉంటుంది, కాబట్టి ఆ అబ్బా యికి నచ్చి కట్నాన్ని లెక్కచేయ కుండా చేసుకుంటాడని అనుకుంటు న్నాను. దాని అదృష్టం ఎలా ఉందో చూడాలి. అసలు వాళ్ళు పెళ్ళికి వస్తారో, రారో అనుకున్నాము. వచ్చారంటేనే కాస్త ఆశ కల్గుతోంది."

"వెళ్ళేలోగా ఒకసారి అడిగి చూడండి"—

"అడగమని మీ బావగారికి చెప్పాలి. అపర్ణ పెళ్ళి నిర్ణయమయిందంటే అనల పెళ్ళి పెద్ద సమస్య కాదు. మా విమల మ్మొదినె కొడుక్కు చేసుకుంటారు. స్వంత చెల్లెలు కాకపోయినా ఆ విమల మ్మకు మా వారంటే చాలా అభిమానం. వాళ్ళకు కట్నం మీద కూడా పెద్ద ఆశ లేదు. ఆ అబ్బాయి కూడా మంచివాడే. బి.ఎ. చదివి ఇంటి దగ్గరే వ్యవసాయం చూసు కొంటున్నాడు."

"అన్నీ బాగానే ఉన్నాయిగానీ మన అనల పెళ్ళి ఆ పల్లెటూళ్ళో ఉంటుందా అని? చిన్నప్పట్నుంచి బస్తీ జీవితానికి అలవాటు పడ్డ వాళ్ళు పల్లెటూళ్ళో ఉండాలంటే కష్టంగా ఉండదూ?"

"ఎలాగో అలవాటు పడాలి. ఏం చేస్తామే?"

"ఎవరైనా బస్తీలో ఉద్యోగం చేసు కునే అబ్బాయైతే అనల సుఖ పడ్తుందేమో!"

"నిజమేనే! కానీ అందరికీ బస్తీలో ఉద్యోగాలు చేసుకునేవాళ్ళే దొరకాలంటే ఎలా? నీకో విషయం తెలియదు. ఆ అబ్బాయంటే మా అనలకూ ఇష్టమే!"

"అయితే ఇంకేముంది! కళ్ళు మూసు కొని చేసెయ్యొచ్చు!"





"మన సారిక కెక్కడన్నా సంబంధాలు చూస్తున్నారటే?"

"ఇంత వరకేమీ లేదక్కయ్యా! రెండు మూడు చూశాం గాని లాభం లేకపోయింది. ఎంతో అందచందాలున్న నీ కూతుళ్ళకే సంబంధాలు కుదరటం ఇంత కష్టమవుతుంటే ఇక మా సారిక సంగతడుగుతావా ?"

"సారిక కేమయ్యిందే? బంగారం లాంటి పిల్ల! చిన్న వయసులోనే దాని కళ్ళకా అద్దాలొచ్చి దాని రూపాన్ని మార్చేశాయి గాని దానికేం వంకుందే?"

వాళ్ళిద్దరూ తరిగిన వంకాయ ముక్కల్ని వంట మనిషి నరసింహచారి వచ్చి తీసుకెళ్ళాడు.

"కళ్ళద్దాలొకటేనా ? వాళ్ళ నాన్న గారిలాగ కాస్త నలుపు. ఇంకేం కావాలి? 'అమ్మాయి బాగుండదు' అని ముద్ర పడిపోయింది."

"బుద్ధిలేదు వెధవలకి. దానికి అందం లేకపోతేయేం ? దాని మనస్సెంత మంచిది! ఎంత బాగా పాడుతుంది! అంత శ్రావ్యమైన కంఠాన్ని పొందాలంటే ఎన్ని తపస్సులు చెయ్యాలే!"

"దాని కంఠం బాగుంటుందని చిన్నప్పటి నుంచి దానికి సంగీతం కూడా చెప్పించాము. దానికి డ్రాయింగ్, పెయింటింగ్ కూడా వచ్చు. కాని ఏం లాభం? మన పెళ్ళి కొడుకులకు అమ్మాయి చూడటానికి బాగుంటుందా? అన్నదే ముఖ్యం. ఆ అబ్బాయి తల్లిదండ్రులకేమో కట్నం ముఖ్యం! అమ్మాయి బాగా పాడుతుందనో, బొమ్మలు వేస్తుందనో చూసేదెవరే ఈ రోజుల్లో ? సారికకు సంగీతం ఎందుకు చెప్పించామా ? అని బాధపడు



తున్నాను."

"అదేమిటే! దాని కంఠం బాగుంటుంది. దానిక్కూడా చిన్న నాటినుంచి సంగీతమంటే ప్రాణం. అందుకే నేర్పించారు. బాధపడటం దేనికే?"

"దాన్ని చూడటానికొస్తున్న పెళ్ళికొడుకుల తరఫువాళ్ళు ఈమె సంగీతం పాడుతూ కూర్చుంటే ఇంటి పనులెవ్వరు చూసుకుంటారని అడుగుతున్నారు, పాడటం ఓ పెద్ద తప్పున్నట్టుగా" ఇంతలో అక్కడికి కృష్ణమూర్తి వచ్చాడు.

"నువ్విక్కడ కూరగాయలు తరుగుతూ కూర్చున్నావా? ప్రయాణంలో అక్కయ్య బాగా అలసి పోయిందట. చాలా తలనొప్పిగా ఉందిట. అమృతాంజనం ఎక్కడుందో చూడు" అన్నాడు కృష్ణమూర్తి.

"అలాగే చూస్తాను కానీ. మీ అక్కయ్య వెళ్ళేలోగా మన అపర్ణ పెళ్ళి విషయం ఆవిడగారితో కాస్త కదపండి." అంది రాజమ్మ.

"ఈ పెళ్ళి గొడవలో అదెక్కడ వీలవుతుందే? మరో సారెప్పుడైనా చూద్దాం!"— కృష్ణమూర్తి.

"మరోసారెప్పుడండీ! మద్రాసులో ఉంటున్నవాళ్ళు మనకు మళ్ళీ ఎంత కాలానికి కలుస్తారు? ఇప్పుడే అటో, ఇటో తేల్చేయండి. వాళ్ళు చేసుకోమంటే మనం మరో సంబంధమన్నా చూసుకోవచ్చు" --రాజమ్మ.

"చూద్దాంలే! నువ్వు త్వరగా తెములు"—కృష్ణమూర్తి.

"అయిపోవచ్చాయి లెండి!" --రాజమ్మ.

"ఈ కాస్త నేను చూసుకుంటాను గానీ, నువ్వెళ్ళవే అక్కయ్యా!" అంది రత్నమ్మ.

బీరువాలో ఉన్న అమృతాంజనం తీసుకొని రాజమ్మ లేచి రాధమ్మ పడుకున్న గదిలో కెళ్ళింది. ఆ గదిలో రాధమ్మ, రమణమ్మ మాట్లాడుకుంటున్నారు.

"తలనొప్పిగా ఉందా వదిన గారూ? అమృతాంజనం రాయమంటారా!" --రాజమ్మ.

"తల పగిలిపోతోంది. నేను రాసుకుంటాను గాని నువ్వెళ్ళు. నీకు బోల్డు పెళ్ళిపని. నాకు అమృతాంజనం రాస్తూ కూర్చుంటే ఎలా?" అంది రాధమ్మ.

"ఫరవాలేదు వదినగారూ! నే రాస్తానుండండి" అంటూ అమృతాంజనం తీసి రాధమ్మ కణతలకు రుద్దసాగింది రాజమ్మ.

"మద్రాసు నుండి ప్రయాణమంటే మాటలా! నాకు ఖమ్మంనుంచి ఇక్కడకొచ్చినందుకే ఒళ్ళంతా హూనం అయిపోయింది" అంది రమణమ్మ.

"ఔనమ్మా వదినగారూ! నాకసలు రైలుప్రయాణాలు, బస్సుప్రయాణాలు పడవు. అసలు మా వారు 'అంత దూరం ఏం వెళతావు? వచ్చి వారంరోజులు ఒళ్ళు నొప్పులంటావు' అన్నారు. వెళతానని నేనే పట్టుపడ్తే పంపించారు. వారినికూడా రమ్మన్నాను. ఆయన నా కంటే సున్నితం. పైగా ఆయనకీమధ్యన స్టూడియోల్లో బొత్తిగా తీరటం లేదు. నాలుగైదు సినిమాలకు ఒకేసారి ఒప్పుకున్నారు. రాత్రింబగళ్ళు తీరటంలేదు" --రాధమ్మ.

"ఇంటికి పెద్దాడబిడ్డవు. నువ్వు లేకపోతే ఈ పెళ్ళెలా జరుగుతుంది వదిన





గారూ?"--రమణమ్మ.

"అలా అనే వచ్చేశానుగా అష్ట కష్టాలు పడి"--రాధమ్మ.

"మీ సందీప్‌కు సంబంధాలేమన్నా చూస్తున్నారా?"--రమణమ్మ.

"ఈ కాలపు పిల్లలకు మనం సంబంధాలు చూసేట్టుగా ఉందా వదినగారూ? ఎంతోమంది వస్తున్నారు. వాడేమో అసలు పెళ్ళే చేసుకోనంటున్నాడు" --రాధమ్మ.

"మా అపర్ణను చేసుకోండి. బంగారు బొమ్మలా ఉంటుంది"--రమణమ్మ.

"మన కళ్ళకు బంగారు బొమ్మలాగే కన్పిస్తుంది. వాడికూడా అలా కన్పించి ఇష్టపడితే నా అభ్యంతర మేముంటుంది?"--రాధమ్మ.

"మీరు కూడా కాస్త చెబితే చేసుకుంటాడు"--రమణమ్మ.

"మీ పిచ్చిగాని ఈ కాలపు కుర్రవాళ్ళు మనం చెబితే వింటారా? అరుంధతి విషయంలో నేను వాడికి చెప్పబోయాను. 'నా పెళ్ళి విషయంలో ఎవరూ జోక్యం చేసుకోవద్దమ్మా! అది పూర్తిగా నా స్వంత విషయం' అని వాడు నిక్కచ్చిగా చెప్పేశాడు. వాళ్ళ నాన్నగారు కూడా 'వాడి కిష్టమొచ్చిన అమ్మాయిని చేసుకోనీ. వాడి పెళ్ళి విషయంలో మనం జోక్యం చేసుకోవద్దు. మేనరికం, గీనరికం లాంటి సెంటిమెంట్లు ఈ రోజుల్లో పనిచెయ్యవు'" అన్నారు--రాధమ్మ.

"ఇక చాలుగానీ, నువ్వెళ్ళి పని చూసుకోవే!"అంది రాధమ్మ రాజమ్మతో.

"పూర్వం నుంచీ వస్తున్న సంప్రదాయాల్ని అంత సులభంగా వదులుకుంటామా వదినగారూ?"--రమణమ్మ.

"మనం ఇలాగే అనుకుంటాం. కాని ప్రపంచం చాలా వేగంగా మారిపోతోందండీ వదినగారూ! అది సరేగానీ మీ పిల్లల కేమన్నా సంబంధాలు చూస్తున్నారా?"—రాధమ్మ.

"మా పెద్దమ్మాయి ఉజ్వలకు ఎం.ఎ. లో సీటు దొరికింది వదినగారూ! పెళ్ళి మాటెత్తినప్పుడల్లా అది కూడా మీ అబ్బాయిలాగే మాట్లాడుతుంది. 'పెళ్ళనేది పూర్తిగా నాస్వంత విషయం. నా కిష్టమొచ్చినపుడు నాకు నచ్చినవాడిని చేసుకుంటాను. మీ జోక్యం అనవసరం' అంటుంది. నోరు మూసుకొని ఊరుకుంటున్నాము. ఏం చేస్తాం చెప్పండి!" —రమణమ్మ.



## 6

"ఏం బావగారూ! స్నానపానాదులు ముగించారా ?" అంది అపర్ణ. అప్పుడే స్నానం చేసొచ్చి బట్టలేసుకుంటున్న సందీప్‌కేసి పావవశ్యంతో చూస్తూ. తెల్లగా మెరిసిపోతున్న లాల్చీ, పైజామా వేసుకున్నాడు. ముఖం మీద, భుజాల మీద, మెడమీద పౌడర్ చల్లుకున్నాడు. భుజాలదాకా వేలాడుతున్న ఉంగరాల జుట్టు దువ్వాడు. ఏ సినిమాల్లో యాక్ట్ చేసే హీరోలు కూడా ఇంత అందంగా ఉండరు అనుకుంది అపర్ణ.

"ఇవాళ, రేపు ఆడవాళ్ళకూ్కూడా అంత జుట్టుండటంలేదు బావా!" —అపర్ణ.

"ఇవాళ రేపు ఆడవాళ్ళకు లేనివి మగవాళ్ళకు చాలా ఉంటున్నాయిలే! ఏమిటి అపూ! అలా బిత్తరపోయి చూస్తున్నావు"—సందీప్.

"నీ అందాన్ని బావా! మగవాళ్ళింత అందంగా ఉంటారని అనుకోలేదు బావా! నిన్ను చూస్తే ఎక్కడో చూసిన గ్రీకు హీరోల శిల్పాలు గుర్తొస్తున్నాయి బావా!"—అపర్ణ.

"ఈజిట్! మీ ఆడవాళ్ళొక విషయాన్ని గుర్తించాలి. ఈ భూమ్మీద జీవిస్తున్న ప్రాణులన్నిటిలోనూ మగజాతే అందంగా ఉంటుంది"—సందీప్.

అప్పుడే అక్కడకు ఉజ్వల వచ్చింది.

"ఎగ్రీడ్! కానీ మన జాతిలోమాత్రం ఆడవాళ్ళే అందంగా ఉంటారన్న అభిప్రాయం ఉంది. స్త్రీ అందాన్ని గురించి రాయబడినంత మధురాతి మధురమైన కవిత్వం, పురుషుల అందాన్ని గురించి రాయబడలేదనుకుంటాను. కారణ మేమిటంటావు?"—అపర్ణ.

"నిజమే! ఈ సబ్జక్ట్ మీద ఎవరైనా రీసెర్చ్ చెయ్యాలి"—సందీప్.

"రీసెర్చ్ చెయ్యాల్సినంత మ్యాటర్ం కాదది. దానిక్కారణం నేను చెబుతాను"—ఉజ్వల.

"నిన్నెవరూ అడగలేదిప్పుడు"—అపర్ణ అసహనంగా.

"నువ్వడిగావని కాదు. టాపిక్కొచ్చింది కాబట్టి చెబుతానన్నాను". — ఉజ్వల




"చెప్పండి ! మీ యింటికొచ్చిన గెస్టలను ఇలాగేనా సన్మానించడం?"—సందీప్ అపర్ణను వారిస్తున్నట్టుగా.

"అది నాకు గెస్టేమిటి ? మేము చిన్నప్పట్నుంచి ఇలాగే పోట్లాడుకుంటు న్నాము"—అపర్ణ.

"నువ్వింకా ఆ బాల్యదశలోనే ఉన్నావే! ఎదిగే ప్రయత్నం చెయ్యటం లేదు"—ఉజ్వల.

"చాల్లేవే ! నువ్వు మహా ఎదిగినట్టు. మరోసారి కాఫీ తాగుతావా బావా ?"—అపర్ణ.

"బుద్ధున్నవాడెవడూ సాయంత్రం ఆరుగంటల తర్వాత కాఫీ తాగడని మా ఫ్రెండొకడు అంటుండేవాడు"—సందీప్ కొంటెగా చూస్తూ.

"కరెక్ట్ ! రాత్రిపూట కాఫీ తాగితే ఆ రాత్రంతా నిద్దరాదు"—అపర్ణ.

సందీప్ కొంచెం దూరంలో రూంలో పడుకొని వున్న రవికాంత్ కేసి చూశాడు. ఇద్దరూ గొల్లున నవ్వారు.

తను చాలా ఫూలిష్‌గా మాట్లాడానని గ్రహించింది అపర్ణ.

"ఎందుకలా ఇద్దరూ ఓ కే సారి నవ్వారు?"—అపర్ణ రోషంగా.

"కేవలం నీ అమాయకత్వం చూసే నవ్వాం బేబీ ! ఆరింటి తర్వాత కాఫీ తాగకూడదంటే నిద్ర రావటంకోసమని కాదు"—సందీప్.

"రాత్రిపూట కూడా టీ, కాఫీలాంటి లైట్ డ్రింక్స్ తీసుకోవటమేమిటి ? అని...ఏ విస్కీయో, బ్రాందీయో తీసు కోవటం పెద్దమనుషుల లక్షణమని. అంతేనా మిస్టర్ సందీప్ ?"—ఉజ్వల.

"సెంట్ పర్సెంట్ కరెక్ట్! మీ పేరే కాదు. మీరుకూడా రియల్లీ బ్రిలియంట్ గర్ల్!"—సందీప్.

"ఔను ! ఆమే చాలా తెలివైంది. నేనే తెలివితక్కువదాన్ని". కోపంతో అపర్ణ మొఖమంతా కందగడ్డలా ఎరు పెక్కింది. గిరుక్కున వెనక్కు తిరిగి చరచరా మెట్లుదిగి కిందకొచ్చేసింది.

ఛీ ! ఛీ ! ఈ ఉజ్వలకు సిగ్గులేదు. ఎక్కడా ఈ ఉజ్వలే! తనంత తెలివైంది లేదని ఫోజు. సందీప్ బావకు తన తెలివి నంతా, అందాన్నంతా చూపించి తనవైపు తిప్పుకోవాలని ప్రయత్నం. బావతో తనను మాట్లాడనీయకుండా ప్రతిక్షణం అడ్డు తగుల్తోంది. బావకు తనను దూరం చేస్తోంది. బావకూడా ఆమె అందాన్ని చూసి, ఆమె మాటలు విని మోసపో తున్నాడు. తనకు దూరమైపోతున్నాడు.

అయినా తనంటే బావకు ఏ మాత్రం కూడా ప్రేమలేదు. ఆ ఉజ్వలముందే తననో ఫూల్ని చేసి అలా నవ్వుతాడా?—తను కన్న కలలన్నీ కరిగిపోతున్నాయి.

నెల రోజులుగా బావకోసం ఎదురు చూసింది. తనూ, బావతీయగా కబుర్లు చెప్పుకొని ఏ దూరతీరాలకో చేరిపోవాలని ఉవ్విళ్ళూరింది

కానీ...బావ...తనకు దూరమయి పోతున్నాడు.

బావను తననుండి వేరుచెయ్యాలనే కుట్రతో సెలవులు లేకపోయినా ఉజ్వల ఈ పెళ్ళికొచ్చింది.

బావమీద ఉజ్వలకేం అధికారం ఉందని అతన్నలా రాసుకు తిరుగుతుంది? బావ తనవాడు. తన మేనత్త కొడుకు. అక్కయ్యకోసం అడిగినప్పుడు అత్తయ్యా సందీప్ బావకు తనను చేసుకుంటానని

మాటిచ్చింది. బావమీద అధికారం అంటూ ఉంటే అది తనకే ఉంటుంది. మరెవ్వరికీ లేదు. కానీ...బావ ఉజ్వలకున్న పైపై మెరుగుల్ని చూసి మోసపోతున్నాడు. తనకు దూరమయిపోతున్నాడు. అపర్ణకు కన్నీళ్ళు ఆగటం లేదు. ఎవరూలేని ఏకాంత ప్రదేశానికివెళ్ళి భోరున ఏడవాలనిపించింది. అప్పుడుగాని తన గుండెల భారం తీరదు.



## 7

"ఇందాకేదో చెబుతానన్నారు. ఇప్పుడు చెప్పండి!" —సందీప్.

"పాపం అపర్ణ చాలా హర్టయినట్టు ఉంది" — ఉజ్వల.

"ఫూలిష్ గర్ల్! మీరన్నట్టు ఆమింకా బాల్యదశలోనే ఉందనిపిస్తుంది. వట్టి పుణ్యానికే హర్టయ్యేవాళ్ళంటే నాకు అసహ్యం. అలాంటివాళ్ళను ఇంకా ఏడిపించాలనిపిస్తుంది" —సందీప్.

"దాన్నే స్సాడిజం అంటారు" — ఉజ్వల.

"ప్రతి పురుషుడిలో కొద్దో, గొప్పో స్సాడిజం, ప్రతి స్త్రీలో కొద్దో, గొప్పో మెసోకిజమ్ ఉంటుందని నా అభిప్రాయం. అందుకే స్సాడిస్టిక్ లక్షణాలు వున్న పురుషుల్నే, స్త్రీలు ఎక్కువగా లైక్ చేస్తారనుకుంటాను" —సందీప్ లైటర్‌తో సిగరెట్ వెలిగించుకుంటూ.

"అట్టర్ నాన్‌సెన్స్!" — ఉజ్వల.

"మీరలా అంటారని నాకు తెలుసు. కానీ లోతుగా వెళ్ళి విడమర్చి చెబితే నేనన్నది కరక్టేనని మీరొప్పుకుంటారు" —సందీప్.

"ఎంత లోతుగా వెళ్ళినా మీ మాటల్లో వాస్తవమేమీ కన్పించదు. స్త్రీలను అపఖ్యాతిపాలు చెయ్యటానికి మీలాంటి పురుష పుంగవులెవరో సృష్టించిన అతి నీచమయిన సిద్ధాంతమది".

"మీరు మరీ అంత తీవ్రపదాలు వాడకండి. నా మాటకూడా వినండి కొంచెం. సాధారణంగా ఆడవాళ్ళు బాగా వొడ్డూ పొడుగూ ఉండి, కాస్త మొరటుగా కన్పించే మొగవాళ్ళను లైక్ చేస్తారు. ఎందుకంటారు? టార్జాన్ కథలు, ఫాంటమ్ కథలు ఆడవాళ్ళను అంత ఎక్కువగా ఎందుకాకర్షిస్తాయంటారు? మన సినిమాల్లో హీరోను సూపర్‌మాన్‌గా చూపిస్తారు. ఒక్కడే వందల మందిని తంతాడు. అలాంటి హీరోలనే మనవాళ్ళు లైక్ చేస్తారు. కారణమేమిటంటారు? మేముంటున్న తమిళ దేశానికి ఓ సినిమా హీరో ముఖ్యమంత్రి. సినిమాలో అతడు చేసే సూపర్‌మాన్ ఫీట్సన్నీ నిజమేననుకుంటారు. తమిళ దేశంలో ప్రతి స్త్రీకి ఎం.జి.ఆర్. ఒక ఆదర్శపురుషుడు. మన తెలుగు దేశంలో కూడా అంతే. ఆంధ్రుల అభిమాన రచయిత్రుల నవలలన్నిటిలోను ఆరడుగుల ఎత్తు, విశాలమైన బంగళా, ఫారిన్ కారు మొదలైన హంగులన్నీ ఉండి తీరుతాయి. హీరోయిన్ను ప్రతీ క్షణం ఏడిపించేవాడే హీరో! ఆ నవలల్ని మన ఆడవాళ్ళు ఇంత పిచ్చిగా చదవటానికి కారణ మేమిటంటారు? ఈ నాటికీ కూడా మన సినిమాల్లో హీరోయిన్ చేత




హీరో కాప్కు పట్టించకుండా ఉండటం లేదు. హీరోయిన్ను హీరో తంతుంటే మన ఆడవాళ్ళ కందరకు కళ్ళలో నీళ్ళు తిరుగుతాయి. ఆ సినిమా వందరోజు లాడి తీరుతుంది. ఎప్పుడూ సిద్ధాంతాలు వల్లిస్తూ, స్త్రీలు- పురుషులు సమానమే నంటూ ఆడవాళ్ళను నెత్తి నెక్కించు కునే పురుషుల్ని స్త్రీ లైక్ చెయ్యదు. కారణ మేమిటంటారు ? దీనికంతటికీ ఒకటే కారణం. సహజంగానే స్త్రీలో మెసోకిస్టిక్ లక్షణాలు ఎక్కువగా ఉంటాయి" అన్నాడు సందీప్.

సందీప్ మాట్లాడుతుండగా అక్కడికి చాలామంది చేరారు. అనల, సారిక, సుధీర్, ఉమ మొదలైన వాళ్ళకు సందీప్ చెప్పే మాటలేమీ అర్థం కాక పోయినా అతన్ని మాత్రం కళ్ళప్పగించి చూడసాగారు.

"మనకందరకూ ఫ్యూడల్ సంస్కృతి బాగా వంటబట్టింది. కాబట్టి మీరలా వాదించడంలో ఆశ్చర్యం లేదు. ఒక సమాజంలోని ఆర్థిక సంబంధాలే ఆ సమాజం యొక్క నాగరికత, సంస్కృతుల్ని నిర్ణయిస్తాయన్న మార్క్స్ మాట చాలా కరెక్ట్. మన సమాజంలో డబ్బు సంపాదించేవాడు భర్త. అన్నిటికంటె డబ్బు సంపాదించడం ముఖ్యం కాబట్టి అన్ని అధికారాలు అతడికే సంక్రమించాయి. భర్త కష్టపడి సంపాదించి పెడితే భార్య ఇంట్లో కూర్చుని తింటుంది అన్న అభిప్రాయాన్ని మనమందరమూ ఏర్పరచుకున్నాము. స్త్రీ కూడా ఈ కారణంగానే తనలో ఇన్ఫీరియారిటి కాంప్లెక్స్‌ను డెవలప్ చేసుకుంది. స్త్రీలో ఏర్పడిన ఈ ఇన్ఫీరియారిటీకి కారణం మీరంటున్నట్టు ఆమెలో సహజంగా ఉండే మెసోకిస్టిక్ లక్షణాలు కాదు. ఆర్థిక స్వాతంత్ర్యం లేకపోవటంవల్ల. తనకు ఆర్థికంగా రక్షణ కల్పిస్తున్న ఒక పురుషుడ్ని ఆధారంగా చేసుకొని బ్రతకాల్సి వస్తుందన్న కారణం వల్లనే స్త్రీ పురుషుడికి అణిగి మణిగి ఉండాల్సి వస్తోంది. స్త్రీ కూడా ఆర్థికంగా తన కాళ్ళ మీద తాను నిలబడగల్గినపుడు ఆమెలో ఈ మెసోకిస్టిక్ లక్షణాలనబడేవి ఉండవు. ఇవ్వాళ ఉద్యోగాలు చేస్తున్న స్త్రీలను చూడండి. వాళ్ళలో మీరంటున్న మెసోకిస్టిక్ లక్షణాలు ఏ మాత్రం కన్పించవు. ఉద్యోగాలు చేస్తున్న స్త్రీల భర్తలు ఎలా ఉంటారో గమనించండి. మీరంటున్న ఆ మెసోకిస్టిక్ లక్షణాలు ఆ భర్తల్లోనే కనిపిస్తాయి. కాబట్టి స్త్రీ, పురుషుల సంబంధాల్ని, వాళ్ళ మనస్తత్వాల్ని—వాళ్ళు జీవిస్తున్న సమాజంలోని ఆర్థిక సంబంధాల్ని బట్టి అర్థం చేసుకోవాలి తప్ప ఫ్రాయిడ్ లాంటి మేధావులు ప్రచారం చేసిన అవాస్తవిక సిద్ధాంతాన్ని బట్టికాదు" —ఉజ్వల.

"మీరిద్దరూ తెలుగులోనే మాట్లాడుకుంటున్నారా? మాకేమీ అర్థం కావటం లేదు - అన్నయ్యగారూ! ఎందుకొచ్చిన గొడవ మనం చక్కగా పేకాడుకుందాం రండి" సుధీర్ జోక్యం చేసుకుంటూ.

సుధీర్ మాటను విన్పించుకోకుండానే సందీప్, "ఫ్రాయిడ్ సిద్ధాంతాలన్నీ అవాస్తవికమైనవే నంటారా?" అని రెట్టించాడు.

"ఫ్రాయిడ్ వ్యక్తుల్ని తప్ప సమాజాన్ని స్టడీ చెయ్యలేదు. ప్రతి వ్యక్తీ

సమాజంలోని భాగమేననీ, అతని వ్యక్తిత్వాన్ని, ఆలోచనాధోరణిని, నమ్మకాల్ని, ఒక్క మాటలో అతని జీవన విధానాన్ని అతడు నివసిస్తున్న సమాజం ప్రభావితం చేస్తుందనీ ఫ్రాయిడ్ గుర్తించలేదు. వ్యక్తినొక సంఘజీవిగా కాక వ్యక్తి మాత్రుడుగానే భావించాడు. గొప్ప మేధావి కావడం వల్ల, అతని సిద్ధాంతాల్లో గొప్ప ఇన్‌సైట్ ఉన్నప్పటికీ, అవన్నీ తప్పుడు సిద్ధాంతాలుగానే పరిణమించాయి."

"ఫ్రాయిడ్ సిద్ధాంతాల్ని తప్పుడు సిద్ధాంతాలే ననడం మీ కమ్యూనిష్టులు చేసే తప్పుడు ప్రచారం. ఎన్నో క్లిష్టమైన మానసిక అవలక్షణాలను పరిష్కరించడంలో ఫ్రాయిడ్ సిద్ధాంతాలు ఎంతో తోడ్పడ్డాయి"

మానవుని మేధస్సును ఫ్రాయిడ్ పరిశోధించినంత లోతుగా మరే ఇతర శాస్త్రజ్ఞుడు పరిశోధించలేదు. ప్రతి వ్యక్తినీ ఒక ప్రత్యేక వ్యక్తి మాత్రుడు గానే తీసుకోవటంలో తప్పేమీ లేద నుకుంటాను. ఏ మనిషీ మరో మనిషిలా ఉండడు. మనిషి పుట్టినప్పుడే...అంటే పురుషుడిలోంచి విడుదలయిన స్పెర్మ్, స్త్రీలోంచి విడుదలయ్యే ఎగ్ — ఇవి రెండూ కలుసుకొని ఒక క్రొత్త ప్రాణానికి రూపకల్పన జరిగే ఆ క్షణంలోనే ఆ పుట్టబోయే ప్రాణి ఎలా ఉంటాడో, వాడి మనస్తత్వం ఎలా ఉంటుదో నిర్ణయమై పోతుందని ఇవాళ జెనటిక్స్‌లో జరిగిన విప్లవాత్మక పరిశోధనా ఫలితాలు చెబుతున్నాయి. ఈ సోకాల్డ్ సమాజం, ఆర్థిక సంబంధాలు వీటి ప్రభావం పైపైనే ఉంటుందనీ, ఒక వ్యక్తి ఎలాంటివాడు? వాడి నమ్మకాలెలాంటివి? వాడి మనస్తత్వం ఎలాంటిది? అన్న విషయాల్ని వాడికి వాడి తల్లిదండ్రుల నుంచి సంక్రమించిన జీన్సే నిర్ణయిస్తాయనీ — జెనెటిక్స్ చెపుతోంది... అలా కాకపోతే సమాజమే వ్యక్తుల మనస్తత్వాల్ని, నమ్మకాల్ని నిర్ణయిస్తే ఆ సమాజంలో పుట్టి పెరిగిన అందరూ ఒకేలా అచ్చు గుద్దినట్టు ఉండాలి. అలా ఎందుకుండటం లేదు. ఇవాళ రష్యాలో, చైనాలో నివసిస్తున్న వాళ్ళంతా ఒకేలా ఉండి, ఒకేలా ఆలోచిస్తున్నారా? అబ్సర్డ్!" —సందీప్ ఆవేశంతో.

"రష్యాలో, చైనాలో నివసిస్తున్న ప్రజలంతా ప్రతి విషయంలోనూ ఒకేలా ఆలోచిస్తున్నారని నేనన్లేదే ! కానీ చాలా విషయాల్లో ముఖ్యంగా సమాజపరంగా వాళ్ళ ఆలోచనలు ఒకే విధంగా ఉంటాయను కుంటాను. వ్యక్తిగత ఆస్తి లేదు కాబట్టి మనలో ఉన్నంత ఆస్తి మీది మోజు వాళ్ళల్లో ఉండదు. మనలో ఉన్నంత స్వార్థం కూడా వాళ్ళల్లో ఉండదు. మనలో లాగ 'స్త్రీ అంటేనే పురుషుడికి శృంగార పరంగా ఉపయోగపడే ఒక సాధనంగా తప్ప ఆమె అస్తిత్వానికి మరో ప్రయోజనం లేదు.' అనే భావం కూడా వాళ్ళల్లో ఉండదు. ఈ విధంగా ఎన్నో విషయాల్లో, వాళ్ళ ఆలోచనల్లో సామ్యం కనిపిస్తుంది. ప్రతివాడి ఆలోచననూ, దృక్పధాన్నీ మీరన్నట్టు వాడికి సంక్రమించిన జీన్సే నిర్ణయిస్తే ఇలా ఎందుకు జరుగుతోందంటారు?" —ఉజ్వల.

"అక్కడి ప్రజల ఆలోచనల్ని,





నమ్మకాల్ని అధికారంలో ఉన్న పార్టీ నిర్ణయిస్తుంది. రేడియో, టెలివిజన్, పత్రికలు మొదలైన ప్రచార సాధనాలన్నీ ప్రభుత్వం చేతుల్లో ఉంటాయి. పైగా ప్రభుత్వం చేతిలో చాలా శక్తివంతమైన మిలటరీ ఉంటుంది. ప్రభుత్వానికి వ్యతిరేకంగా మనమేం చేసినా మన ప్రాణాలుండవనే భయం వల్లనే అక్కడి ప్రజలు అలా అణిగి, మణిగి ఉంటున్నారు. ఇవాళ రష్యాలో, చైనాలో కమ్యూనిస్టు పార్టీ డికేటర్‌షిప్ తీసెయ్యండి. మొత్తం కమ్యూనిజమంతా పేకమేడలా కూలిపోతుంది. కమ్యూనిజం కేవలం తుపాకీ మీద ఆధారపడే నిలబడగలుగుతోంది"— సందీప్ మరో సిగరెట్ వెలిగిస్తూ.

"అదంతా కమ్యూనిస్టు వ్యతిరేకులు సాగించే ప్రచారం. తుపాకీని నమ్ముకుని ఎన్ని రోజులు పరిపాలిస్తావు? ఎంత అమాయక ప్రజలైనా కొద్ది కాలమే తుపాకులు చూపించి భయపెట్టి మన ఆధీనంలో ఉంచుకోవచ్చు. కోట్లకొద్దీ ప్రజల్ని వాళ్ళ ఇష్టానికి వ్యతిరేకంగా యాభై, అరవై సంవత్సరాల వరకు తుపాకీ చూపించి భయపెట్టి పరిపాలించటమనేది అసంభవం."— ఉజ్వల

"వాదించటంలో నీ బుర్ర అమోఘమైందని అందరమూ ఒప్పుకుంటాంగాని నీ వాదనను కాస్త ఆపితే అందరూ భోజనాలకు లేస్తారు" అంటూ వచ్చింది. అపర్ణ.

"ఇంతకీ ఈ వాదనలో ఎవరు గెలిచినట్టు! ఎవరు ఓడినట్టు?"—సుధీర్.

"మా అక్కయ్యే గెలిచింది !" అన్నారు సారిక, ఉమ, అనల ఒకేసారి.

"అమ్మమ్మ ! అదేం లేదు. మా అన్నయ్యే గెలిచాడు 'ఏదో పాపం ఆడపిల్లలే అని వదిలేశాడు. ఎంతవాదిస్తే ఏం? రేపు మీ ఉజ్వలక్కయ్యే మాత్రం చేసుకున్నవాడికి వండిపెట్టదా ఏం ? మీ ఆడవాళ్ళంతా ఎంత గింజుకున్నా అదంతే ! ఆడవాళ్ళు చచ్చినట్టు వంట చెయ్యాల్సిందే! మగవాళ్ళు దర్జాగా కాలు మీద కాలేసుకుని భోంచెయ్యాల్సిందే ! బ్రహ్మదేవుడలా రాశాడు. ప్రతిఆడదాని నోసటిమీద వంట! వంట! వంట ! అని మూడుసార్లు రాస్తాట్ట!" అన్నాడు సుధీర్. అక్కడున్న ఆడవాళ్ళు, మొగవాళ్ళు అందరూ గొల్లున నవ్వారు.

"మూడుచోట్ల కాదు. నా నొసటి మీద ఒక్కచోట 'వంట' అన్న మాట చూపించండి బావగారూ! లక్ష రూపాయలిస్తాను" అంది అనల సుధీర్ దగ్గరకు వెళ్ళి.

"బ్రహ్మదేవుడు ఎంచక్కా నీకు, నాకు వచ్చే తెలుగు భాషలో రాశాడనుకున్నావా నీకు చూపించడానికి? బ్రహ్మదేవుడికి ఎన్ని భాషలొచ్చనుకున్నావు ! ఏ భాషలో రాశాడో ఏమో మనకెలా తెలుస్తుందే పిచ్చిమరదలా !" అన్నాడు సుధీర్. మళ్ళా అందరూ గొల్లున నవ్వారు. కిందనుండి 'అందరూ భోజనాలకు రండి' అన్న కృష్ణమూర్తి కేక విన్పించింది.

"బావగారూ ! భోజనానికి పదండి. మీరు కదిలితే అందరూ కదుల్తారు"అంది అపర్ణ సందీప్ నుద్దేశించి.

"అదేమిటి ? ఇందులో నాదేముంది?" అన్నాడు సందీప్.

"అందరి కళ్ళూ మీ మీదేగా! అందుకని" అంది అపర్ణ కసిగా.

"బావగార్కి దిష్టి తగుల్తుందేమో!" అంది సారిక.

"మామగారు కోపం చేస్తారు. కమాన్! లెటజ్ గో!" అన్నాడు సందీప్.

"లోపల మీ ఫ్రెండేదో చేస్తున్నాడు వారిని కూడా రమ్మనండి"—అపర్ణ.

"కమాన్ కాంత్! భోజనాలు రెడీ అట" సందీప్ కేకేశాడు.

నోట్లో వెలుగుతున్న సిగరెట్‌ను ఆర్పేసి లేచాడు రవికాంత్. అపర్ణ దగ్గర కొచ్చి "మీరేం అనుకోకుంటే ఇది తీసుకోండి" అంటూ అపర్ణ చేతికొక డ్రాయింగ్ పేపరిచ్చాడు. ఆ కాగితం మీదున్న పెన్సిల్ డ్రాయింగ్ తనదేనని గుర్తుపట్టడానికాట్టేసేపు పట్టలేదు అపర్ణకు. పట్టలేని ఆనందంతో అపర్ణ పొంగిపోయింది.

"ఏదీ ! నన్నుకూడా చూడనీ" ఆమె చేతిలో ఉన్న డ్రాయింగ్ పేపర్‌ను లాక్కున్నాడు సందీప్.

"బ్యూటిఫుల్! అపర్ణ నిజంగా ఇంత అందంగా ఉందా ! కొంచెం ఎక్కువ చేశావా?" అన్నాడు రవికాంత్ కేసి చూస్తూ.

"ఆమె సౌందర్యంలోని శతాంశా




నైనా నేనా బొమ్మలోకి తీసుకురాలేక పోయాను. ఏ ఆర్టిస్టైనా ఎన్నో సంవత్స రాలు శ్రమిస్తేగాని ఆమె అందానికి న్యాయం చెయ్యలేడు. ఆర్టిస్టులు కలలు గనే అందం ఆమెది" అన్నాడు రవి కాంత్ అపర్ణను ఆరాధనతో నిండిన కళ్ళతో చూస్తూ.

"ఏమిట్రోయ్! కొంపదీసి అపర్ణను ప్రేమించేశావా ఏమిటి? కవిత్వం వచ్చే స్తోంది. అదే నిజమైతే మీ పెళ్ళి కూడా ఈ పెళ్ళితోపాటే జరిపిస్తాను" అన్నాడు సందీప్.

తనగుండెలో కెవరో తుపాకిగుండును పంపించినట్టుగా విలవిల్లాడి పోయింది అపర్ణ. అకస్మాత్తుగా తననెవరో ఆ మేడమీదినుంచి కిందకు నెట్టేసినట్టుగా ఫీలయ్యింది. ఒక క్షణంలో బావ తనను ఎవరెస్టు శిఖరం ఎక్కిస్తాడు. మరుక్షణం పసిఫిక్ మహాసముద్రంలో ముంచేస్తాడు. బావ నిజంగా క్రూరుడు. తనను కత్తుల బోనులో ఇరికించి చిత్రవధ చేస్తే తప్ప అతనికి శాంతి లేదు. కళ్ళలో ఉబ్బొంగి వస్తున్న కన్నీళ్ళను ఆపుకోలేకపోయింది. గబగబా మేడమెట్లు దిగి కిందకు పరి గెత్తింది.

"అదేమిటన్నయ్యా! అలా అన్నావు. పాపం అపర్ణ ఎంత బాధ పడిపోయింది. అపర్ణ నిన్ను చేసుకోవాలని కలలు కంటోంది."—సుధీర్ బాధగా.

"కలలే కదా! ఫరవాలేదు. ఏదైనా కలలు కనటం వరకే బాగుంటుంది. ఆ కలల్ని నిజం చేసుకోవాలని ప్రయ త్నిస్తే వాటిలోని థ్రిల్లంతా పోతుంది. కలలు కేవలం కలగనటానికే అని గాఢంగా నమ్మేవాళ్ళలో నేనొకణ్ణి" అన్నాడు సందీప్.

"అదేమిటన్నయ్యా ఏదో ఫిలాసఫీ మాట్లాడేస్తున్నావు. నాకన్నా పెద్దవాడివి నువ్వున్నావని అపర్ణను నీ కొదిలేశాను. లేకపోతే అపర్ణలాంటి అందాల రాశిని నేనే జేసుకునేవాడిని. అపర్ణ ఎట్లాగూ నాకు దక్కదని నేనీ ఆఖరుదానితో తృప్తి పడదామనుకున్నాను" అన్నాడు సుధీర్ అనలను చూపిస్తూ.

"ఒరే సుధీర్! ఈ మేనరికం అనేది ఎంత శక్తివంతమైన సెంటిమెంటో నాకు తెలుసు. కానీ, నేను మేనరికానికి వ్యతి రేకిని. ఒకే రక్తం ఉన్న మనుష్యులు పెళ్ళిళ్ళు చేసుకోవటంవల్ల ఎన్నో అనర్థా లున్నాయని సైన్సు చెబుతోంది" అన్నాడు సందీప్.

"అంతా సైన్సు ప్రకారం చేస్తే ఇక జరిగినట్టే. వెనకటికెవడో అన్నట్టు శాస్త్ర ప్రకారం చేస్తే కుక్కపిల్లలు పుట్టాయట" అన్నాడు సుధీర్. ఒక్కసారే అందరూ బిగ్గరగా నవ్వారు.

"ఇంతకూ మీరివ్వాళ భోజనాలకు వస్తారా, రారా?" ఈసారి చాలా గట్టిగా కేకేశాడు కృష్ణమూర్తి. అందరూ భోజ నాలు చెయ్యడానికి కిందకెళ్ళారు.



## 8

భోజనాలు చేసి ఎవరికి కేటాయించ బడిన స్థానాల్లో వాళ్ళు పక్కల



పరచుకొని, దాదాపు అందరూ నిద్రకుపక్రమించారు. సందీప్, రవికాంత్, సుధీర్ మేడమీద రెండోగదిలో పడుకున్నారు. మేడమీది మొదటిగదిలో పెళ్ళికూతురు అరుంధతి, ఉజ్వల, ఉమ, సారిక పడుకున్నారు. అపర్ణ అనల క్రింది గదుల్లో సర్దుకున్నారు.

సందీప్ వాళ్ళు పడుకున్న గదిలోంచి రవికాంత్ 'సోజా రాజకుమారి సోజా' అన్న సైగల్ పాటను సన్నగా హమ్మింగ్ చెయ్యటం మొదలెట్టాడు. ఆ పాట అందరినీ ఎక్కడెక్కడికో తీసుకుపోయింది. 'అతనెంత బాగా పాడుతున్నాడు' అనుకుంది ఉజ్వల.

ఆర్టిస్టులకు గడ్డం పెంచడం ఫాషనేమో! చూడటానికతడు వికారంగా ఉంటాడు. కాని ఎంత బాగా పాడుతున్నాడు! ఎంత బాగా బొమ్మలు గీస్తాడు. ఎక్కువగా మాట్లాడడు. ఎప్పుడూ కళ్ళు మూసుకొని ఏదో ఆలోచిస్తూ ఉంటాడు. పుట్టటమే కళాకారునిగా పుట్టినట్లుంటాడు. కానీ ఈ పెళ్ళికొచ్చిన ఇంతమంది ఆడపిల్లల్లో ఏ ఆడపిల్లా అతనికేసి కన్నెత్తి చూడలేదు. అందరి కళ్ళు సందీప్‌మీదే! సందీప్ అందంగా ఉంటాడు. అందులో సందేహం లేదు. వయసులో వున్న ఆడపిల్లలందరికి పిచ్చెక్కించే అందం అతనిది. తను అందంగా ఉంటాననీ, ఆడపిల్లలు తనంటే పడిచస్తారనీ సందీప్ నమ్మకం. అపర్ణకు సందీప్‌ను చూసినప్పటినుంచి పిచ్చెత్తినట్టుగా ఉంది. సందీప్ తన మేనత్త కొడుకు కాబట్టి అతనిమీద తనకేదో అధికారం ఉన్నట్టు,

అప్పుడే సందీప్ తనవాడై పోయినట్టు ఫీలవుతుంది. కాని సందీప్ అపర్ణకు అందుతాడా ? సందీప్‌ను చూసినప్పటి నుంచి తనూ అతనివైపు ఆకర్షితురాలవు తోందా? నో!నో! అలా జరగటానికి వీల్లేదు. తనంత అందగాడు, తెలివైన వాడు ప్రపంచంలో లేడనీ, ఆడపిల్లల నందరినీ తనవైపు తిప్పుకోగలననీ, వాళ్ళను తన ఇష్టమొచ్చినట్టుగా వాడుకో గలననీ అతనికి విపరీతమైన గర్వం. అందరు ఆడపిల్లల్లాగా తనూ అతని గర్వాన్ని అధికం చెయ్యకూడదు.

'జబ్ దిల్ హీ టూటగయా...హమ్ జీకే క్యా కరేంగే' అన్న పాటను పాడు తున్నాడు రవికాంత్. అంతా సద్దుమణిగిన ఆ వాతావరణంలో అతని పాట మెల్లగా, హాయిగా, పిల్ల తెమ్మెరలా అందరి మనసుల్ని ఆహ్లాదపరిచింది.

"ఎవరే పాడేది ? కొత్త గొంతులా ఉంది!" ఉజ్వల పక్కనే పడుకున్న అరుంధతి అడిగింది.

"రవికాంత్ అని సందీప్ ఫ్రెండ్. మద్రాసునుండి వచ్చాడు. అతనికి సైగల్ పాటలంటే మరీ ఇష్టంలా ఉంది. సైగల్ లాగ ఇతని గొంతులో కూడా బాధను ఒలికించే ఆ జీర ఉంది. చక్కని కంఠం" అంది ఉజ్వల.

ఎందుకో ఆ పాట తనకు వినయ్‌ను గుర్తుకు తెస్తోంది. వినయ్ కూడా పాడే వాడు. కానీ ఇలాంటి విషాదపూరితంగా ఉండే పాటలు పాడేవాడు కాదు. లైట్‌గా వుండేపాటలంటే అతనికిష్టం. 'శివరంజని నవరాగిణి' పాట ఎంత బాగా పాడేవాడు. అతనితో ఎన్నోసార్లు ఆ పాటను కొసిరి కొసిరి పాడించుకుంది. అంత బాగా పాడే వినయ్ అందరిముందు పాడేవాడు కాదు. సిగ్గుపడిపోయేవాడు. ఒక్క తనముందే ఎంతో ఫ్రీగా పాడేవాడు.

"నీతో తప్ప ఎవరితోనూ ఇంత ఫ్రీగా, ఇంత హాయిగా ఉండలేను అరూ! నువ్వుతప్ప నన్నెవరూ అర్థం చేసుకో లేరనిపిస్తుంది. నాకు మరీ ఫాస్ట్‌గా, ఫాషనబుల్‌గా ప్రవర్తించే గర్ల్స్ అంటే భయం. ఈ ఆధునిక ప్రపంచంలో నేను ఇమడలేనేమోననిపిస్తుంది. నీలాగ ప్రశాంతంగా, నిదానంగా, స్లోగా ప్రవర్తించే గర్ల్స్ అంటే నాకిష్టం. ఎందు కంటే నేనూ అలాంటివాడినే" అనేవాడు వినయ్. అలాంటి వినయ్ ఏమైపోయాడు? తన జీవితంలోంచి శాశ్వతంగా వెళ్ళి పోయాడు. ఈ సృష్టిలోని ఏ చిన్న ప్రాణికైనా హాని తలపెట్టని వినయ్ తన హృదయానికింత గాయం ఎందుకు చేశాడు.

'జబ్ దిల్ హీ టూటగయా...హమ్ జీకే క్యా కరేంగే' అబ్బ ఆ కంఠంలో ఎంత బాధ! ఆ పాటలో ఎంత విషాదం! తన గుండెనిండా విషాదాన్ని నింపుతున్న ఆ పాట.. తన గుండె వెయ్యి వక్కలై పగిలిపోతే తనకెంత హాయిగా ఉండేదో! ఎవరైనా వెళ్ళి అతని గొంతు నొక్కేస్తే బావుండును. ఆ పాటను ఆపేస్తే బావుండును. తనది వట్టి పిచ్చి గుండె. ఆ పాటను ఈ పిచ్చిగుండె భరించలేదు.

"ఎప్పుడూ లైట్ సాంగ్సే పాడతా వెందుకు వినయ్?" అందోసారి తను.

"నాకు లైట్ సాంగ్సే ఇష్టం. బరువుగా, బాధగా వుండే పాటలు పాడ లేను. సైగల్ పాటలంటే భయం. ఆ పాటలనిండా దర్ద్....బాధ, సైగల్

వ్యక్తిగత జీవితంలో విపరీతంగా దెబ్బ తిన్నాడా అనిపిస్తుంది. లేకపోతే అతని కంఠంలో అంత బాధ ఎలా పలికింది? ఆ పాటలతో సైగల్ అంతగా ఎలా తాదాత్మ్యం పొందాడు ? తను నిజంగా అంత బాధను అనుభవించకపోతే ?..."

"అదంతా నాకనవసరం. నువ్వొక సైగల్ పాట పాడితే వినాలని ఉంది".

"అమ్మబాబోయ్! నేను సైగల్ పాట పాడటమే! రాజబాబు శ్రీరాముడి వేషం వేసినట్టుగా ఉంటుంది".

"నీకు బాధంటే భయం. బాధనుండి తప్పించుకోవాలనీ, పా రి పో వా ల నీ ప్రయత్నం చేస్తావు. అందుకే ఎంతో శ్రావ్యమైన కంఠం ఉండికూడా ట్రాజిక్ సాంగ్స్ పాడవు".

"నువ్వు చెప్పింది కరెక్టే. ఒక పాటతో తాదాత్మ్యం కాకుండా నేను పాడలేను. ట్రాజిక్ సాంగ్స్‌తో నేను తాదాత్మ్యం పొందలేను. నేను పిరికివాణ్ణి. బరువును భరించలేను. సమస్యల్ని ధైర్యంగా ఎదుర్కోలేను. వాటినుండి పారిపోవాలని ప్రయత్నిస్తాను" అనేవాడు వినయ్.

తన విషయంలోనూ అంతే చేశాడా? వాళ్ళమ్మకు తనను చేసుకోవటం ఇష్టం లేదేమో ! లేక వాళ్ళ నాన్నకో...ఆ విషయం ఎప్పుడూ సరిగ్గా చెప్పలేదు. తనతో ఏ విషయాన్ని గురించైనా గంటలకు గంటలు మాట్లాడేవాడు. కానీ తను పెళ్ళి విషయం తీసుకురాగానే సీరియస్ అయిపోయేవాడు. ఆ విషయాన్ని దాటవేసేవాడు.

"నిజంగా పెళ్ళి చేసుకోవడం అంత అవసరమా ? మనం ఇలాగే హాయిగా స్నేహితులుగా ఉండిపోతే....ఎప్పుడూ ఇలాగే హాయిగా చెట్లకింద మాట్లాడుకుంటూ కూర్చుండిపోతే ఎంత బావుంటుంది ! పెళ్ళి చేసుకోవాలి. కాపురం పెట్టాలి. చాలీచాలని జీతపురాళ్ళతో సంసారాన్ని వెళ్ళబుచ్చాలి. నామీద నువ్వు, నీమీద నేను విసుక్కోవాలి. పిల్లల్ని కనాలి. వాళ్ళను పెంచి పెద్ద చెయ్యాలి. ఈ రొంపిలోకి దిగాక మనిద్దరి మధ్య ఇప్పుడున్న ఈ ప్రేమ నిలుస్తుందా? ఈ మహత్తరమైన సంబంధాన్ని అంత మామూలుగా మార్చుకోవాలని ఎందుకంత తాపత్రయం ? ఇప్పుడు చూడు నిన్ను చూస్తే నాకు, నన్ను చూస్తే నీకు ఎంత హాయిగా, ఎంత మనోహరంగా, ఎంత అలౌకికంగా ఉంటోంది. ప్రతీక్షణం కొత్తగా, తియ్యగా, ప్రతీక్షణం దేనికదే అపూర్వంగా, మహత్తరంగా, మళ్ళీ రాదన్నట్టుగా ఉంటుంది. కానీ పెళ్ళి చేసుకుంటే? ఒకరికొకరం చాలా మామూలైపోతాము. అందరూ భార్యాభర్తల్లాగే మనం ఒకర్నొకరు తిట్టుకుంటాము. నొప్పించుకుంటాము. ఒక్కోసారి నేను నీకు రాక్షసుడిలా, నాకు నువ్వొక రాక్షసిగా కన్పిస్తాము. ఒకర్నొకరు ప్రాణంకంటే మిన్నగా ప్రేమించుకున్న వాళ్ళు పెళ్ళి చేసుకోవటమంటే ఆ ప్రేమను ఖూనీ చెయ్యటమన్న మాట. నిజమైన ప్రేమికులకు అంతకంటే క్రూరమయిన శిక్ష వేరొకటి లేదనుకుంటాను" అనేవాడు వినయ్.

చివరకు తన మాటను నిలుపుకొన్నాడు. సరిగ్గా ఈ కారణం వల్లనే తనను పెళ్ళిచేసుకోనన్నాడు.

మొదట అతని మాటల్ని తను సీరియస్‌గా తీసుకోలేదు. ఏదో భావకవి




త్వపు మోజులో అలా అంటున్నాడను కొంది.

కానీ వినయ్ తనను...నిజంగా ఈ కారణం వల్లనే తనను పెళ్ళి చేసుకో నంటాడని కలలో కూడా ఊహించ లేక పోయింది.

కానీ సరిగ్గా అదే జరిగింది.

వినయ్ మొండికేశాడు. ఎన్ని ఉత్త రాలు రాసినా అతడు మారలేదు.

ఆడపిల్లకంటే సుకుమారంగా కన్పించే వినయ్‌లో అంత మొండితనం ఉందని తను అనుకోలేదు. రూపాన్ని బట్టి వ్యక్తులెలాంటివాళ్ళో చెప్పటం ఎంత కష్టం!

కానీ తనకు వినయ్ మీద ఉజ్వల లాగా కోపం రావటం లేదు. అతడో రోగ్ అని తను అనుకోలేక పోతోంది. మోసం చేసే తత్వం అతనిలో ఏ కోశానా ఉన్నట్టు తనకు కన్పించ లేదు.

ఎన్నోసార్లు తనూ వినయ్ గంటల గంటలు ఒంటరిగా గడిపారు.

కానీ ఒక్కసారి కూడా వినయ్ తనతో హద్దుమీరి ప్రవర్తించ లేదు, తన అందాన్ని జుర్రుకోవాలని ప్రయ త్నించలేదు.

తనముందొక అందమైన యువతి ఉందన్న చైతన్యాన్నే అతడు ప్రద ర్శించేవాడు కాదు.

అంత మంచి వినయ్‌ను 'రోగ్' అని ఎలా అనగలదు?

తన పెళ్ళి నిర్ణయమయిందని తెలి శాక వినయ్ రాశాడు. "నీకు పెళ్ళయి నంత మాత్రాన నేను నిన్ను మరిచి పోతాననుకోకు. నేను బ్రతికున్నంత కాలం నువ్వు నాకు ఆరాధ్య దేవతవే. ఈ ప్రాపంచిక విలువలకు అతీతమైన సంబంధం మనది."

వినయ్ తనకలాంటి ఉత్తరాలు ఎన్నో రాశాడు. ఆ ఉత్తరాలు చదువు తోంటే తనకెంత హాయిగా ఉండేదో! స్లోమోషన్ పిక్చర్స్‌లాగా ఎక్కడెక్క డకో మెల్లగా వెళ్ళిపోతున్నట్టుగా, యేదో కలలో తానెన్నడూ చూడని ఒక వినూత్న వింత ప్రపంచాన్ని చూస్తున్న ట్టుగా ఉండేది.

"మైడియర్ అరూ,

నువ్వీ పాడు ప్రపంచంలో - ఉండా ల్సిన దానివి కాదు. ఈ ప్రపంచానికి దూరంగా వినీల విహాయసంలో అరుం ధతీ నక్షత్రంలా మిణుకు మిణుకు మంటూ శాశ్వతంగా నిలిచి పోవలసిన ఒక నక్షత్రానివి నువ్వు. అంత ఎత్తున నిల్చిపోయిన నిన్ను అందుకోవాలని అహో రాత్రాలు తపస్సు చేస్తూ పడి గాపులు పడిపోయే దీనుణ్ని నేను. ఏనాటికైనా నిన్ను అందుకోగలనా? ఆ ఆశే నన్ను బ్రతికిస్తోంది."

"డియరెస్ట్ అరుంధతి!

నా ఈ పిచ్చి గీతల్లో నీ అందాన్ని ఆరాధించాలని వెర్రి ప్రయత్నం చేస్తు న్నాను. కానీ నా ఈ ప్రయత్నం ఎలాంటిదంటె- గడ్డిపోచను ఆధారం చేసుకొని మహాసముద్రాన్ని ఈదాలను కోవటం లాంటిది. అప్పుడే విచ్చుకుం టున్న సిరిమల్లె పువ్వులోని స్వచ్ఛత. సంధ్యాకాశంలో క్షణక్షణానికీ మారే వర్ణసమ్మేళంలోని వినూత్నత. ఈ ప్రపంచంలో అప్పుడే కళ్ళు తెరచిన పసిపాపలోని అమాయకత్వం...ఇలా ఎంతని వర్ణించాను. నీ సౌందర్యాన్ని వర్ణించటం నాకొక తీరని దాహం!

ఎంత వర్ణిస్తే ఈ దాహం అంత ఎక్కువౌతుంది. ఇదొక పిచ్చి, దీన్నే ప్రేమంటారో? నాకు తెలీదు—

అరూ ! అరూ ! అరూ !

రాత్రి నిద్దర్లో సరిగ్గా ఇలా అరుస్తున్నాను. రాత్రి చాలా విచిత్రమయిన కల...మనిద్దరం ఒక అందమైన ఉద్యానవనంలోకూర్చునిఉన్నాము.అకస్మాత్తుగా అక్కడికెపడో రాక్షసుడి లాంటి మానవుడెవడో వచ్చాడు... నీ చెయ్యి పట్టుకున్నాడు... మనిద్దరం పెళ్ళిచేసుకుందాం అరుంధతి వీడితో యేమిటి నీకు? వీడొట్టి చవట... అంటూ నన్ను తిట్టాడు... మనిద్దరం పెళ్ళి చేసుకుందాంరా అరుంధతీ అంటూ నిన్ను గట్టిగా కౌగిలించు కున్నాడు... నువ్వు వెంటనే కెవ్వున కేక పెట్టావు... మరుక్షణంలో నిన్ను వాడు లాక్కుపోతున్నాడు. నేను అరూ ! అరూ ! అరూ అంటూ దిక్కులు పిక్కటిల్లేట్టు అరుస్తున్నాను... నా కేకలు విని నారూమ్ మేట్ లేపితే మెలకువ వచ్చింది...చాలా సేపు నాకొచ్చిన ఈ కలను గూర్చే ఆలోచించాను ... ఏమిటి ఈ కలకు అర్థం? కలలో వాడెవడో అన్నట్టు నేను నిజంగా వట్టి చవటనే... నీలాంటి దేవతను పెళ్ళి చేసుకునే అర్హత నాకు లేదనిపిస్తోంది"

"డియరెస్ట్!

తీవ్రంగా ఆలోచిస్తున్నాను... ఆలోచిస్తున్న కొద్దీ నాకేమని పిస్తోందంటే నిజంగా ప్రేమించుకున్న వాళ్ళు పెళ్ళి చేసుకోవటం కంటె ఘోరమైన పాపం మరొకటి లేదని. దేవదాసు పార్వతి పెళ్ళిచేసు కున్నారా? వాళ్ళిద్దరూ పెళ్ళి చేసుకుంటే ఒకరి కొకరు ఎంత మామూలై పోయేవాళ్ళో... వాళ్ళ ప్రేమనంతా సంసారం, పిల్లలు, చాలీ చాలని జీతం, రోగాలు, రొష్టులు మొదలైన తుచ్ఛ ప్రాపంచిక విలువలు పూర్తిగా తినేసేవి... వాళ్ళు పెళ్ళి చేసుకోక పోవటం వల్లనే ఇవ్వాల్టి వరకు ఆ ప్రేమజీవులు సజీవులుగా నిల్చిపోయారు... ముందు ముందు మన తల్లిదండ్రులు మనల్ని కూడా పెళ్ళి చేసుకోమని బలవంతం చేస్తారు... ఆ ప్రమాదం నుండి తప్పించు కోవటానికి మన సర్వశక్తుల్నీ ధారపోసి పోరాడాలి..."

ఈ ఉత్తరం చదివినప్పుడు ఇతడికేమన్నా పిచ్చెక్కిందా అనుకుంది తను.

"లేదు లేదు... నువ్వు కూడా ఇలా ఆలోచిస్తావని కలలో కూడా అనుకోలేదు అరూ ! నువ్వు పెళ్ళి చేసుకోకూడదు. నివ్వెవరికీ భార్యగా మారకూడదు. నిన్నెవరూ "ఒసే అరుంధతీ! నా చొక్కా ఎక్కడే! నా కళ్ళద్దాలెక్కడే... నా తాళపుచేతు లెక్కడే? అదిగో చూడు... ఆ చిన్నాడు దొడ్డి కూర్చున్నాడు... త్వరగా కడుగు... నీకు రోజురోజుకు మతి పోతోందే... ఏపనీ సరిగ్గా చెయ్యటం లేదు. వట్టి మొద్దు బుర్ర... ఎప్పుడూ చీవాట్లు తింటేగాని నీ బుర్ర పనిచెయ్యదు" అని అనకూడదు ... ఆ రాక్షస ఘడియ రాకూడదు...అందుకు నేనెంత త్యాగమైనా చేస్తాను...నువ్వేదో స్వచ్ఛంగా, పవిత్రంగా, దివ్యంగా, దేవకన్యగా, అమలిన ప్రేమకు, అనాఘ్రాణిత సౌందర్యానికి ప్రతీకగా నిలిచి పోవాలి..."

ఇలా ఎన్ని ఉత్తరాలు రాశాడో...





తన పెళ్ళయ్యాక్కూడా అతడి లాగే ఉత్తరాలు రాస్తాడా?

ఈ ఉత్తరాల్ని అతడు చూస్తే? తన జీవితం ఎంత నరకప్రాయమై పోతుంది.

వెంటనే ఆ ఉత్తరాన్ని చించేసింది.

'దయ చేసి ఇకముందెప్పుడూ ఇలాంటి ఉత్తరాలు రాయొద్ద'ని వినయ్‌కు రాసేసింది.

వినయ్ తనకు ఎన్నో ఉత్తరాలు రాశాడని అమ్మకు తెలుసు.

అమ్మకు అన్నీ తెలుసు. తను, వినయ్ ప్రేమించు కున్నారనీ, పెళ్ళి చేసుకో వాలను కున్నారనీ అమ్మకు తెలుసు.

వినయ్ అమ్మకు బాగా తెలుసు ఏదో దూరపు చుట్టరికం కూడా ఉంది.

అమ్మను వినయ్ 'అక్కయ్య!' అని ఎంతో ఆప్యాయంగా పిలిచేవాడు. అందుకే తను వినయ్‌తో తిరగటాన్ని అమ్మ ప్రోత్సహించింది.

వినయ్ తనమాట కాదనడని అమ్మకు నమ్మకం. నాన్నతో కూడా ఒకటి రెండుసార్లు తనకు, వినయ్‌కు పెళ్ళి అయిపోయినట్టుగా మాట్లాడింది.

వినయ్ పెళ్ళికి ఒప్పుకోవడం లేదని తను చెప్పినప్పుడు అమ్మ నమ్మలేక పోయింది. తనూ ఎన్నో విధాల చెప్పి చూసింది. కానీ వినయ్ చలించలేదు. ఇక వినయ్‌తో తన పెళ్ళి కాదని తెలిసిన మరుక్షణం నుండి అమ్మ నాన్నను నిద్రపోనీయ లేదు. సంబంధాల కోసం దేశమంతా తిప్పింది. మూడు నాల్గు సంబంధాలొచ్చాయి.ఏవో కారణాల వల్ల కుదరలేదు. చివరకీ సంబంధం కుదిరింది.

తనకు పెళ్ళి నిర్ణయం కాగానే



అమ్మొకసారి తన గదిలో కొచ్చి గుసగుసగా అడిగింది.

"వాడు రాసిన ఉత్తరాలన్నీ నీ దగ్గరే ఉన్నాయా?" అని

వెంటనే తన కర్థం కాలేదు.

"ఉత్తరాలేమిటి?" అంది తను అయోమయంగా.

"అవే! వినయ్ నీకు రాసిన ఉత్తరాలన్నీ ఏం చేశావు?"

"నా దగ్గరే ఉన్నాయి ఎందుకు?"

"అవన్నీ నాకిచ్చేసెయ్..."

"ఎందుకు?"

"ఎటు పోయి ఎటొస్తుందో! అవున్నంతకాలం ప్రమాదమే. పెళ్ళయ్యాక అవి నీ భర్త కళ్ళబడ్డాయో నీ కాపురం నాశనమైపోతుంది. అందుకని వాటిని ఇప్పుడే తీసుకెళ్ళి మన బాయిలర్‌లో వేస్తాను"

"అమ్మా!" అని తన హృదయం ఆక్రోశించింది. తన అంతరాంతరాల్లో ఎక్కడో కన్నీటి కట్టకు గండి పడింది. పొంగి పొరలి వస్తున్న కన్నీటిని ఆపుకో లేకపోయింది.

అతడు రాసిన ఉత్తరాలు తన కెంత హాయిని, ఆనందాన్ని మోసుకొచ్చేవో! అతడు రాసిన ప్రతీ అక్షరం తన హృదయాన్నెంత సున్నితంగా తడిమేదో అమ్మ ఊహించగలదా?

అతని ఉత్తరాల్లో ఎంత కవిత్వం! ఎంత భావుకత! ఎంత ఉద్వేగం! ఎంత సౌందర్యం! ఎంత అన్వేషణ! ఎంత ఆరాధన! ఎంత అలౌకికత్వం! ఎన్ని అనుభూతుల ధ్వాంతరలు! ఎంతటి అనుభవ సంపత్తి!.

ఆ ఉత్తరాలన్నీ తనకు కోట్లకొద్దీ రూపాయలకంటే విలువైనవి.

కానీ...కానీ అమ్మ వాటిని ఒక్క క్షణంలో అగ్నికి ఆహుతి చేసింది.

ఎర్రగా కాలి నల్లగా బూడిదై పోయాయవి.

తను తనకు తెలియకుండానే ఏడుస్తున్నానని గ్రహించింది అరుంధతి.

ఉబికివస్తున్న కన్నీళ్ళను తుడుచుకుంది. అంతా నిద్రపోతున్నారు. అతడు కూడా పాడి పాడి అలా పాడుతూనే నిద్రపోయినట్టున్నాడు. ఉజ్వల కూడా నిద్రపోయింది.

కానీ...తనకు నిద్రరాదు! ఈ పెళ్ళి నిర్ణయమైన క్షణంనుండి తను నిద్రాహారాలకు దూరమైపోయింది.

ఎప్పుడూ ఇలాంటి ఆలోచనలతో సతమతమై పోతున్న తనకు నిద్రెలా వస్తుంది?

చాలా రోజులక్రితం తన క్లాస్‌మేట్ మాధవి తను ప్రేమించిన యువకుడు మరెవర్నో పెళ్ళిచేసుకున్నాడని తెలిసి నిద్రమాత్రలు మింగి శాశ్వతంగా నిద్రపోయింది.

ఈ రోజు తెల్లారేలోగా తనూ అలా చేస్తే?

చావటానిక్కూడా చాలా సాహసం కావాలి. తనకంత సాహసం లేదు.

వినయ్ తనను చేసుకోనని చెప్పినపుడు "జీవితాంతం బ్రహ్మచారిగానే ఉండిపోతావా? ఎవరినైనా చేసుకుంటావా?" అని అడిగింది

"చెప్పలేను! కాని...ఒకమాట చెప్పగలను. పెళ్ళంటూ చేసుకుంటే అది నా కోసం కాదు"

"మరెవరి కోసం?"





"మా అమ్మకోసమో! నాన్నకోసమో! సంఘం కోసమో చేసుకుంటానేమో!"

"తలతిక్క సమాధానం!"

"ఏమిటే అరూ! కలవరిస్తున్నావా?" అంది ఉజ్వల.

తలతిక్క సమాధానమని తనుపైకే అందని గ్రహించింది అరుంధతి.

"నువ్వింకా నిద్రపోలేదా ఉజ్జీ?"

"ఎవరిదే తలతిక్క సమాధానం? మేలుకునే కలవరిస్తున్నావన్నమాట! ఇంకా ఆ వినయ్ గురించే ఆలోచిస్తున్నావా?"

"నా విషయం సరే! నువ్వెందుకు నిద్రపోలేదే ? సందీప్‌ను గూర్చి ఆలోచిస్తున్నావా ? లేక అతనితో వచ్చిన అతని ఫ్రెండ్ సైగల్‌సాబ్‌ను గూర్చి ఆలోచిస్తున్నావా ?"——అరుంధతి.

"నేనంత దద్దమ్మనేం కాను! సందీప్‌ను గురించి ఆలోచించటానికి. మన చెల్లెళ్ళు బోల్డుమందున్నారు. కానీ ఆ సైగల్‌సాబ్‌ను గురించి ఆలోచించే వాళ్ళెవరూ లేరు"

"ఎందుకే?"

"అతని పాట వినటానికెంత బాగుంటుందో అతను చూడటాని కంత వికారంగా ఉంటాడు"

"నిజంగా ! అతన్ని నేనింకా చూడలేదు కాబట్టి అంత అందంగా పాడుతున్న అతడు వికారంగా ఉంటాడని ఊహించలేకపోతున్నానే"

"అదే మన బలహీనత ; అందంగా ఉన్నదంతా అందంగానే ఉంటుందనుకుంటాము. ఒయటికి చూడటానికి అందంగా ఉన్న వాడి మనస్సు కూడా అందంగానే ఉన్నదనుకుంటాము తప్ప వికారంగా ఉంటుందని ఊహించలేం !

"ఈ ఫిలాసఫీ అంతా ఎందుకు ? ప్రస్తుతం నేనలాంటి నిరాశలో పడిపోయానని చెప్పడానికేనా?"

"నీ ఒక్కదాని విషయమే కాదు. మనలో చాలామంది నీలాంటివాళ్ళే. ఇప్పుడు నీ పెళ్ళికొచ్చిన ఆడపిల్లలందరూ సందీప్‌ను గురించి ఎంతో ఉన్నతంగా ఊహించుకుంటున్నారు. అతడెవరికీ అందడని తెలుసు. అయినా, అతన్నిగూర్చి కలలు కనకుండా ఉండలేరు".

"పాపం! మా అపర్ణ సందీప్‌ను పెళ్ళి చేసుకోవాలని ఎన్ని కలలు కంటోందో! సందీప్ తనను కాదంటే ఆ షాక్‌నుండి తేరుకోగలదా?"

"ఏ షాకైనా మనం ఊహించుకోవడంలోనే ఉంది."

అరుంధతికి ఆమె మాట నిజమేననిపించింది. వినయ్ తనను కాదన్న క్షణంలో తనేమైపోతానోనని హడలిపోయింది. కానీ, తనకేమీ కాలేదు. తనింకా బ్రతికే వుంది. రేపు మరొకర్ని పెళ్ళి చేసుకుంటుంది. అతనితో సంసారం చేస్తుంది. పిల్లల్ని కంటుంది. నా భర్త, నా పిల్లలు, నా ఆస్తి అని చెప్పుకుంటుంది. నిజంగా సృష్టి చాలా విచిత్రమైంది.



## 9

ఆ అమ్మాయిలో ఏముందని తను

వెంటనే 'అమ్మాయి నచ్చింది' అని చెప్పేశాడో గుర్తు చేసుకోడానికి ప్రయత్నించాడు పెళ్ళికొడుకు కిశోర్‌కుమార్.

అరుంధతి అందంగానే ఉంటుంది. కానీ ఆమె తనకు వెంటనే నచ్చటానికి ఆమె అందంగా ఉండటం మాత్రమే కారణం కాదనిపిస్తుంది. అంతకుముందు తను ఇద్దరు ముగ్గురు పెళ్ళికూతుర్లను చూశాడు. వాళ్ళూ అందంగానే ఉన్నారు. కానీ వాళ్ళు తనకు నచ్చలేదు. అందం కంటే స్త్రీలో తనకు నచ్చే ప్రత్యేకతేదో అరుంధతిలో వుంది. ఎందుకో అరుంధతి అందరి ఆడపిల్లలలాగా కన్పించలేదు. కాలేజీల్లో చదువుకున్న ఆడపిల్లల్లో ఉండే ఫోజు, అరుంధతిలో లేదు. అరుంధతి చాలా అమాయకంగా కన్పించింది. ఆమెను చూడగానే తను ఇంతకాలం వెతుకుతున్న అమ్మాయి ఈమేనేమోననిపించింది తనకు.

అమాయకంగా, ఒద్దికగా, వినయంగా ఉండే అమ్మాయిలంటే ఇష్టం. తమంత అందమయినవాళ్ళు ఈ ప్రపంచంలోనే లేరని ఫోజులుకొడుతూ, అన్ని రంగాలలోను ఆడవాళ్ళు మగాళ్ళతో సమానమేనంటూ వాదిస్తూ నిర్లక్ష్యంగా, గర్వంగా తిరిగే ఆడవాళ్ళంటే తనకసహ్యం. అలాంటివాళ్ళతో గిల్లికయ్యం పెట్టుకుని ఏడిపించాలనిపిస్తుంది. కాలేజీల్లో చదువుకునే రోజుల్లో అలాంటి ఆడపిల్లల్ని తెగ ఏడిపించేవాడు. వినయంగా వుండే ఆడపిల్లల్ని ఎంతో లైక్ చేసేవాడు. కాలేజీ వదిలి యూనివర్శిటీలో యం.యస్‌సి. చదివే రోజుల్లో కూడా తన అభిరుచులు మారలేదు.




ఆ రోజుల్లో నివేదిత అనే అమ్మాయి తనకెంతో నచ్చేది. అందంగా, అమాయకంగా, పెద్దపెద్ద కళ్ళతో, వినయంగా, ఒద్దికగా వుండే నివేదితను చూసినప్పుడల్లా తనెంతో హాయిగా ఫీలయ్యేవాడు. పలకరిస్తేతప్ప నివేదిత తనంతట తాను ఎవరితోనూ మాట్లాడేది కాదు. త్వరలోనే నివేదితతో పరిచయం ఏర్పడింది.తనంటే నివేదితక్కూడా లైకింగ్ ఏర్పడింది. కొద్దిగా మాట్లాడినా నివేదిత ఎంతో అందంగా మాట్లాడేది. సబ్జెక్టులో కూడా నివేదిత చాలా తెలివైంది. కానీ తాను తెలివిగలదాన్నన్న గర్వం ఆమెలో ఈషణ్మాత్రమైనా కన్పించేది కాదు. మిగతా ఆడపిల్లలెవరూ నివేదితలాగా నిండుగా చూడగానే మనస్సులో ఒక పవిత్రమయిన భావాన్ని ఉద్దీపింపచేసేలా ఉండేవాళ్ళు కారు. వచ్చీరాని ఇంగ్లీషులో ఎప్పుడూ గలగలమని మాట్లాడటం, ప్రొఫెసర్లను, లెక్చరర్లను కాకా పట్టడం, తమతో చదువుతున్న బాయ్స్ అందరూ తమంటే పడిచస్తారన్న నిర్లక్ష్యంతో కూడిన గర్వాన్ని ప్రదర్శించటం - ఇలాంటివాళ్ళమధ్య నివేదిత ఒక దేవతలా కన్పించేది. నివేదితంటే తనకున్న ఆరాధనా భావం రోజురోజుకూ పెరిగిపోసాగింది. ఏ రోజన్నా నివేదిత కాలేజీకి రాకపోతే తనకు పిచ్చెత్తినట్టుగా ఉండేది. నివేదిత రోజూ బస్సులో వస్తుండేది. తను హాస్టల్లో ఉండేవాడు. రోజూ ఒక అరగంట ముందుగానే తయారై బస్టాండ్‌కు వెళ్ళి నివేదితకోసం ఎదురుచూసేవాడు. ఆ రోజుల్లో నివేదిత కోసం అలా ఎదురుచూడటం తను ఈనాటికీ మరిచిపోలేదు. ఆ జ్ఞాపకం ఇప్పటికీ తనకెంతో థ్రిల్లింగా ఉంటుంది. ఆమె బస్సు దిగుతూ తనకేసి చూసి చిరునవ్వు నవ్వుతుండేది. ఇద్దరూ కలిసి ఫిజిక్స్ బిల్డింగ్ కేసి నడిచేవాళ్ళు.

ఓ ఫైన్ మార్నింగ్ తను నివేదితను ప్రేమిస్తున్నానని తెల్సుకున్నాడు.నివేదిత లేకుండా తను ఒక్క-క్షణం కూడా బతకలేనని నిర్ణయించుకున్నాడు. ఆ మర్నాడే నివేదితతో "యం.యస్సీ అయిపోగానే మనిద్దరం పెళ్ళి చేసుకుందామని" చెప్పేద్దామనుకున్నాడు. కానీ నివేదితనుండి తాను కలలోకూడా ఊహించలేని సమాధానం వచ్చింది.

ఈ ప్రేమా, పెళ్ళిళ్ళమీద తనకు నమ్మకం లేదంది నివేదిత. తన జీవితానినంతా ఫిజిక్స్‌కోసమే ధారపోస్తానంది. యం. యస్‌సి. అయిపోయాక రీసెర్చ్ చేస్తుందట. మేడమ్ క్యూరి, సి.వి.రామన్ మొదలైనవాళ్ళంతటి సైంటిస్ట్ కావాలని ఆమె జీవితాశయమట!

"దయచేసి మన స్నేహాన్ని ఇలాగే కొనసాగనివ్వండి. ప్రేమా, పెళ్ళి మొదలైనవాటితో దాన్నిముడిపెట్టకండి. రీసెర్చ్ చేసి పెద్ద సైంటిస్ట్‌ను కావాలనేదినా జీవితాశయం...... దయచేసి అపార్థం చేసుకోకండి" అంది నివేదిత.

అంతే! ఆనాటి నుంచీ తను నివేదితను గూర్చి కలలు కనటం మానేశాడు. ఇద్దరూ ఎమ్.ఎస్.సి. పూర్తి చేశారు. నివేదిత యూనివర్శిటీ ఫస్ట్ వచ్చింది. తను సెకండ్ క్లాస్‌లో పాసయ్యాడు. నివేదితకు టాటా ఫండమెంటల్ రీసెర్చ్ ఇన్‌స్టిట్యూట్‌లో రీసెర్చి స్కాలర్‌గా సెలక్షన్ వచ్చింది. ఆమె కలలు నిజమయ్యాయి.

రెండేళ్ళు వెయిట్ చేశాక తనకు జూనియర్ లెక్చరర్‌గా అపాయింట్ మెంట్ వచ్చింది. చదువైపోయింది. ఉద్యోగం దొరికింది.

ఇక పెళ్ళిచేసుకోవడానికి అభ్యంతర మేమిటో చెప్పమన్నారు బంధువులు. తనకు ఉద్యోగం దొరికిన క్షణంనుండి పెళ్ళివిషయంలో అమ్మానాన్నల వత్తిడి కూడా ఎక్కువైపోయింది. అమ్మాయి కోసం వేట ప్రారంభమైంది. పెళ్ళి చూపుల తతంగమంటే తన కసహ్యం. ఒకరొకరు పరస్పరం తెలుసుకోకుండా కనీసం ఓ గంటసేపైనా మాట్లాడుకో కుండా పెళ్ళి చేసుకోవటాని కంగీక రించటం కంటే పెద్ద నేరం మరొకటి లేదనిపిస్తుంది. బాగా చదువుకున్న వాళ్ళు. ఆధునిక ప్రపంచంతో సంబంధ మున్న వాళ్ళు కూడా ఈ అరేంజ్డ్ మారేజెస్‌కు ఒప్పుకుంటూనే ఉన్నారు. ఎంత చదువు కున్నా పెళ్ళివిషయంలో తల్లిదండ్రులను ధిక్కరించే సాహసాన్ని మన దేశపు యువతీ యువకులు ప్రదర్శించలేక పోతున్నారు. తనూ అలాంటి యువకుల్లో ఒకడు. నివేదిత విషయంలో దెబ్బతిన్న తను 'ఏ అమ్మాయైనా ఫరవాలేదు. ఎలాగోలా కాలం గడపటానికి' అన్న నిర్లిప్తతలో పడిపోయాడు. ఇద్దరు ముగ్గురు అమ్మాయిలను చూపించారు. వాళ్ళు నచ్చలేదు. వాళ్ళంతా ఎంతో ఆడంబరంగా కనిపించారు. మా అంత అందమైనవాళ్ళు ఈ ప్రపంచంలో ఎవరూ లేరన్న ఫోజు కూడా వాళ్ళలో కన్పిం చింది. తరువాత అరుంధతిని చూశాడు. నచ్చింది. ఆ అమ్మాయి నడక, చూపులు, కూర్చున్న పద్ధతి, ఒకే ఒకసారి తన కేసి చూసిన ఆ చూపు అన్నీ నచ్చాయి. అన్నింట్లోనూ ఎంతో నిరాడంబరత, సింప్లిసిటీ... ఎక్కడా ఎబ్బెట్టుగాగాని, కృత్రిమంగాగాని లేకపోవటం...ఎందుకో గాని అరుంధతి తనకు ఇదివరకే తెలిసి నట్టుగా, ఆమెకు తనకు ఇదివరకే ఏదో అవ్యక్తమైన, అలౌకికమైన సంబంధం ఉన్నట్టుగా ఫీలయ్యాడు. సరిగ్గా నివేది తను చూసినప్పుడు కూడా తనిలాగే ఫీలయ్యాడు. అరుంధతిలో నివేదిత పోలి కలు కన్పించాయా? ఏమో! అంత స్పష్టంగా చెప్పలేడు. ఒకటి మాత్రం నిజం. తన అంతరాంతరాల్లో నివేదిత రూపాన్ని శాశ్వతంగా ప్రతిష్ఠించు కున్నాడు. తనకు నచ్చే ప్రతి స్త్రీలో ఆమె రూపంలోని ఏదో ఒక ఛాయఉండి తీరుతుంది.

అరుంధతితో కాసేపు ఒంటరిగా మాట్లాడాలనుకున్నాడు. "నేనంటే మీ కిష్టమేనా ? నన్ను పెళ్ళి చేసుకోటానికి మీకేమన్నా అభ్యంతరమా? ఫ్రాంక్‌గా మీ అభిప్రాయం చెప్పండి"... అని అడుగుదామనుకున్నాడు. కాని వాళ్ళు తనకా అవకాశమే ఇవ్వలేదు. 'అమ్మాయి నచ్చింది' అనటమే తరువాయి వాళ్ళు మిగతా విషయాలన్నీ మాట్లాడుకోవటం మొదలుపెట్టారు. వరదక్షిణ విషయంలో ఏదో పేచీ వచ్చింది. నాన్నగారు చాలా ఎక్కువే అడిగారు. అంత మేమిచ్చుకోలే మని వాళ్ళన్నారు. 'ఈ విషయంలో పెద్ద రాద్ధాంతం చెయ్యటం నాకిష్టం లేదు' అని చెప్పేశాడు. ఆ విధంగా తన పెళ్ళి నిర్ణయమైంది. అరుంధతి తన నర్థం చేసు కొని తనను సుఖపెడ్తుందన్న నమ్మ కంతో తని పెళ్ళికి ఒప్పుకున్నాడు.




ఇంకో రెండుగంటల్లో అరుంధతి తన జీవిత భాగస్వామిని అయిపోతుంది.



## 10

విడిదిలో దిగిన మగపెళ్ళి వారందరిలోనూ రాత్రంతా ప్రయాణం చేసిన అలసట స్పష్టంగా కన్పిస్తోంది. సూర్యాపేటనుండి అర్ధరాత్రి పన్నెండు గంటలకు బయల్దేరి తెల్లవారేటప్పటికి హనుమకొండ చేరుకున్నారు. పెళ్ళివారింటికి దగ్గర్లోనే విడిది ఏర్పాటు చేశారు. బస్సు దిగిన వెంటనే ఒకరు కాఫీ కావాలన్నారు. ఇంకొకరు టూత్ పేస్ట్ కావాలన్నారు. మరొకరు సోప్ కావాలన్నారు. ఏడు గంటల్లోగా టిఫిన్ అందాలన్నారు. ఏవీ సరిగ్గా అందటంలేదని విసుక్కున్నారు. ఇంత చేతకానివాళ్ళు పెళ్ళెందుకుచెయ్యాలన్నారు.

"తొందర పడకండి! రెండు వందల మందికి అన్నీ క్షణాలమీద సరఫరా చెయ్యాలంటే మామూలు విషయంకాదు" అన్నాడు పెళ్ళికొడుకు తండ్రి రామచంద్రయ్య.

"మీరలాగే శాంతంగా ఉండండి బావగారూ! అవతల లగ్నం టైం దగ్గర పడ్తోంది. ఇంతవరకేమీ లేదు. వీళ్ళ వాలకం చూస్తే ఉదయం పదిన్నరకు జరగాల్సిన లగ్నాన్ని ఏ అర్థరాత్రికో గాని చేసేట్టు లేరు" అన్నాడు పెళ్ళికొడుకు మేనమామ రాఘవయ్య.

"ఆ! అర్ధరాత్రికే చేస్తారో! మళ్ళీ తెల్లారాకే చేస్తారో! ఆ దేవుడికే తెలియాలి. మామయ్యా! వచ్చినప్పటినుంచి చెబుతున్నాము వేన్నీళ్ళు కావాలని. రాత్రంతా ప్రయాణంచేసి దుమ్మంతా పడి బట్టలన్నీ అసహ్యంగా తయారయ్యాయి. స్నానం చేసి బట్టలు మార్చుకుంటే తప్ప కాఫీ తాగలేం. రాగానే కాఫీ పంపించారు. దుమ్ము కొట్టుకున్న ముఖాల్తో కాఫీ ఎలా తాగుతారో?" అంది పెళ్ళికొడుకు అక్కయ్య సుజాత.

"వచ్చినప్పటినుంచి పాలు పాలని చంటిపిల్ల ఏడుస్తున్నారు. మా వాడికి పొద్దున్నే బోర్నవిటా తాగించకపోతే ఇల్లు పీకి పందిరేస్తాడు. ఇంతవరకూ పాలు లేవు పాడు లేవు! వీళ్ళ వాలకం చూస్తే ఎన్నడైనా పిల్లలకు పాలు తాగించిన మొహాలేనా అనిపిస్తుంది?" అంది శ్రీదేవి పెళ్ళికొడుకు రెండో అక్కయ్య.

"ఏమిట్రా పెళ్ళికొడుకా! ఇంత గొడవౌతున్నా బెల్లంకొట్టిన రాయిలా ఉలక్కుండా పలక్కుండా ఉన్నావేం?" అన్నాడు ప్రదీప్ పెళ్ళికొడుకు పెద్దమ్మ కొడుకు.

"ఏం చెయ్యమంటావురా? వాళ్ళూ మనుష్యులేగా! ఏదో తంటాలు పడ్తూనే ఉన్నారు.మనం బస్సు దిగగానే అందరూ మొహాలు కడుక్కోడానికి టూత్ పేస్ట్లు, సబ్బులు, నీళ్ళు అందించారా? తర్వాత కాఫీ ఇచ్చారా? అదిగో వేడినీళ్ళు కూడా వచ్చాయి" అన్నాడు పెళ్ళికొడుకు.

"చూశావా అక్కయ్యా! అన్నయ్య అప్పుడే అత్తగార్ని ఎలా వెనకేసుకొస్తున్నాడో! ఇంకో నాల్గురోజులు పోతే మన

ముఖం చూస్తాడో లేదో ?" అంది సునీత — పెళ్ళికొడుకు చెల్లెలు.

"వాడేకాదు ! అందరూ అంతేలేవే ! పెళ్ళి కాగానే ఆ పెళ్ళాం ఏం మత్తు మందు చల్లుతుందో ఏమో ! పూర్తిగా మారిపోతారు. పెళ్ళాం, పెళ్ళాం తరపు వాళ్ళు తప్ప-తల్లీ, తండ్రి, అక్కలూ, చెల్లెళ్ళు, అన్నలు, తమ్ముళ్ళు అందరూ పరాయి వాళ్ళలాగే కన్పిస్తారు" అన్నాడు రాఘవయ్య.

"పెళ్ళి కాగానే నువ్వు కూడా అలాగే మారి పోయావా మామయ్యా ?" అన్నాడు పెళ్ళి కొడుకు.

"ఔనా ! నలుగురితో పాటు నారాయణా ! పెళ్ళయిన క్షణం నుండి మీ అత్తయ్య కొంగు పట్టుకొని తిరుగుతున్నాను" అన్నాడు రాఘవయ్య. అందరూ నవ్వారు.

"ఔను పాపం ! నా కొంగు పట్టుకునే తిరుగుతున్నారు. ఎంత అమాయకులు" అంది సుగుణమ్మ - రాఘవయ్య భార్య. రాఘవయ్యకు వాళ్ళ ఊరిలోనే మరో స్త్రీతో సంబంధం ఉందని బంధువర్గాని కంతకూ తెలుసు.

"ఆయనకు బాగా తల నొప్పిగా ఉందిట. లోపల బాగా ఉక్కపోతగా ఉంది. ఓ ఫ్యాన్ లేదు... పాడు లేదు. వెంటనే తన గదిలో టేబుల్ ఫ్యాన్ అరేంజ్ చేయమంటున్నారు. ఐదు నిమిషాల్లో రాకపోతే వారికి చాలా కోపమొచ్చేస్తుంది నాన్న !" అంది లోపల్నించి వస్తూ సుజాత రామచంద్రయ్యతో.

"అలాగే నమ్మా ! వెంటనే ఫ్యాన్ తెప్పిస్తాను. అల్లుడిగారికి కోపమొచ్చిందంటే ఇంకేమన్నా ఉందా ? అరేయ్ రాములూ ! వెంటనే పెళ్ళి వాళ్ళింటికి వెళ్ళి ఓ టేబిల్ ఫ్యాన్ కావాలని చెప్పు !" అన్నాడు రామచంద్రయ్య.

"నాన్నా ! నాన్నా ! మావారి గదిలో కూడ ఫ్యాన్ లేదు. వారు కూడా బాగా చిరాగ్గా ఉన్నారు. వారిగదిలో కూడా ఫ్యాన్ పెట్టించకపోతే వెంటనే విజయవాడ వెళ్ళిపోదా మంటున్నారు" హడావుడిగా పరిగెత్తుకొచ్చి చెప్పింది శ్రీదేవి.

"ఒరే రాములూ ! వెంటనే రెండు ఫ్యాన్లు పంపించాలని చెప్పు!" అన్నాడు రామచంద్రయ్య. రాములు 'అలాగే నండయ్యగారూ !' అంటూ బయలుదేరాడు.

"వెంటనే పిల్లలకు పాలు, స్నానాలకు వేన్నీళ్ళు పంపించమని చెప్పండి" అంది కాంతమ్మ పెళ్ళి కొడుకు తల్లి.

"వేన్నీళ్ళు పెట్టలేదటండీ ; ఎండాకాలమేగా చన్నీళ్ళు చెయ్యమన్నారండీ!" అన్నాడు పెళ్ళి వాళ్ళింటి నుంచి వచ్చిన నారాయణ.

"అయ్యో ! అయ్యో ! ఇంత న్యాయమా ? మగ పెళ్ళి వాళ్ళంటే ఇంత నిర్లక్ష్యమా ? ఎంత ఎండాకాలమయినా నేను వేన్నీళ్ళతో తప్ప స్నానం చెయ్యలేను. వెంటనే జలుబు చేస్తుంది" అంది వజ్రమ్మ-పెళ్ళికొడుకు మేనత్త.

"నాక్కూడా అంతే! చన్నీళ్ళతో స్నానం చేశానంటే చాలు ! జలుబు చేస్తుంది. ఈ పెళ్ళివాళ్ళు మనందర్నీ సరాసరి హాస్పిటల్ కు పంపించేట్టున్నారు" అంది సుజాత.

"ఎలాగోలా ఈ ఒక్కరోజుకు సరిపెట్టుకోండి. ఏం చేస్తాం ! అందరూ





త్వర త్వరగా స్నానాలు చేసేయ్యండి. అదుగో పాలు తెస్తున్నాడు. పిల్లలందరికీ పాలు పోసెయ్యండి" అన్నాడు రామచంద్రయ్య.

"ఏం నాయనా! పాలు తెచ్చావా? ఈ పాలల్లో నీళ్ళెన్ని? పాలెన్ని? నీళ్ళలో పాలు పోశారా? లేక పాలల్లో నీళ్ళు పోశారా? చక్కెర అదీ వేశారా? లేక చప్పిడి పాలే మా మొహాన కొట్టారా?" అంది వజ్రమ్మ పనిమనిషి తెచ్చిన పాలను పరీక్షిస్తూ.

"ఏదో లేవే! త్వరగా కానివ్వండి. అవతల టైమై పోతుంది" అన్నాడు రామచంద్రయ్య.

"ఏమిట్రా ప్రదీప్! ప్రతిదానికీ మన వాళ్ళింత రాద్ధాంతం చేస్తున్నారేమిటి? ఒక్కరోజుకు కాస్త సర్దుకోలేరు?" అన్నాడు కిశోర్.

"సర్దుకోలేరని కాదు. మగ పెళ్ళివాళ్ళమనగానే మనవాళ్ళ సైకాలజీ మారిపోతుంది. ఒక రకమైన సుపీరియారిటీ ఫీలింగ్ వచ్చేస్తుంది. ఏదో రకంగా ఆడపెళ్ళి వారిని అవమానం చేసి పోవాలని పిస్తుంది. ఇది తరతరాలుగా వస్తున్న సాంప్రదాయం. మన వాళ్ళు ఇప్పుడింత గొడవ చేస్తున్నారా?

రేపు మీ సిస్టర్ పెళ్ళప్పుడు చూడు! అణిగి మణిగి ఉంటారు అదంతే!" అన్నాడు ప్రదీప్.

"ఏరా కిశోర్! స్నానం చేస్తావా? మీ మామగారు కనీసం నీ కోసమయినా వేణ్నీళ్ళు పంపించలేదు. ఏం మనుషులో ఏమో! వట్టి అడివిమనుషుల్లా ఉన్నారు. చన్నీళ్ళతో స్నానం చేస్తారని ఎలా అనుకున్నారో?" అంది సుజాత పెళ్ళికొడుకు దగ్గరకొచ్చి.

"ఎండా కాలమేగా! ఎలాగో సర్దుకుందాం లేవే!" అన్నాడు కిశోర్.

"నువ్విలాగే వాళ్ళను వెనుకేసుకురారా! వాళ్ళు కనీసం మనకింత తిండి కూడా పెట్టరు. వీడిప్పుడే అత్తవారి మీద ఇంత ప్రేమ ఒలక బోస్తున్నాడు. ముందు ముందు వీడసలు మన మొహం చూస్తాడా?" అంది సుజాత అక్కడే ఉన్న శ్రీదేవితో.

"వాడే కావమ్మా! ప్రపంచమంతా అంతే!" అన్నాడు రాఘవయ్య.

"ఇంత చదువుకున్నవాడు. అన్నీ తెలిసినవాడు మన కిశోర్ కూడా అలాగే అయిపోతాడంటావా మామయ్యా!" అన్నాడు ప్రదీప్.

"చదువుకున్నవాడికంటే చాకలాడు నయమని... ఈ చదువుకున్న వాళ్ళే త్వరగా పెళ్ళాలకు దాసులైపోతున్నారు"! అన్నాడు రాఘవయ్య.

అందరూ నవ్వారు.

"మా ఊళ్ళో గోవిందయ్యని ఒక పేదవాడు... అతడు పాపం అష్టకష్టాలూ పడి కొడుకుని డాక్టర్ కోర్సు చదివించాడు. ఆ కొడుకేం చేశాడో తెలుసా? తనతోపాటు చదువుకుంటున్న అమ్మాయినొకదాన్ని పెళ్ళి చేసుకొని తల్లిదండ్రులతో సంబంధాన్ని పూర్తిగా తెగతెంపులు చేసుకున్నాడు. వాడు డాక్టర్ కోర్సు చదివాడు కదా! ఏం లాభం? పెళ్ళానికి బానిస! అది గీసిన గీటు దాటడట!" అన్నాడు నాగభూషణం— పెళ్ళికొడుకు పెదనాన్న.

"మా ఊళ్ళో కూడా అలాంటి వాడొకడున్నాడు"... అంటూ మొదలు పెట్టాడు గోపాలరావు పెళ్ళికొడుకు బంధువర్గంలోని మరో పెద్ద మనిషి.

"కబుర్లు తగ్గించి త్వరగా తెమలండి. మీరంతా స్నానాలుచేసి టిఫిన్‌లు ముగించేటప్పటికి లగ్నం టైం దాటిపోతుంది" అన్నాడు రామచంద్రయ్య.



## 11

"వెంటనే వాళ్ళకు రెండు టేబిల్ ఫ్యాన్లు కావాలట. లేకపోతే వెంటనే వెళ్ళిపోతారుట" విడదినుండి పరిగెత్తుకొచ్చిన రాములు కృష్ణమూర్తికి చెప్పాడు.

"ఇంట్లో రెడీగా ఒక ఫ్యానుంది. అది తీసుకెళ్ళు" అన్నాడు కృష్ణమూర్తి.

"ఏది, మేడమీది రెండోగదిలోదా?" అన్నాడు రాములు.

"ఔను! అదే! వెంటనే తీసుకెళ్ళు" అన్నాడు కృష్ణమూర్తి.

"మేడమీది గదిలోంచి ఆ ఫ్యాన్ తీసేస్తే సందీప్ బావకెలా?... ఫ్యాన్




లేకుండా బావ ఆ రూమ్‌లో ఒక్క క్షణ మైనా ఉంటాడా?" అంటి అక్కడే ఉన్న అపర్ణ.

"మనతరపువాళ్ళు ఈ ఒక్కరోజుకు ఎలాగోలా సర్దుకోవాలి. మగ పెళ్ళి వాళ్ళకు కావాల్సిందివ్వకపోతే వాళ్ళూరు కుంటారా?" అన్నాడు కృష్ణమూర్తి.

"ఊరుకోక ఏం చేస్తారేమిటి?" —అపర్ణ.

"ఏం చేస్తారా? పెళ్ళి జరక్కుండా పెళ్ళికొడుకును తీసుకొని వెళ్ళిపోతారు" —కృష్ణమూర్తి.

"వెళ్ళి పోనివ్వండి! ఈ మాత్రం సంబంధం ఇక దొరకదా ఏమిటి?" —అపర్ణ.

"ఇష్టమొచ్చినట్టుగా వాగటం మానేసి ఇక్కణ్ణుంచి వెళ్ళిపోతావాలేదా?" గట్టిగా అరిచాడు కృష్ణమూర్తి. అపర్ణ కళ్ళలో నీళ్ళు తిరిగాయి.

మేడమీది నుండి ఫ్యాన్ తీసుకొచ్చిన రాములు "ఇంకోటి కావాలి గదండీ!" అన్నాడు.

"మన పక్కింటి రామారావింటికెళ్ళి నేనిమ్మన్నానని చెప్పి వాళ్ళ ఫ్యాన్ తీసుకెళ్ళు" అన్నాడు కృష్ణమూర్తి.

"వాళ్ళ స్నానాలకు వేన్నీళ్ళు కావాల టండీ!" అంటూ వచ్చింది మంగమ్మ.

"రెండువందల మందికి వేణ్ణీళ్ళు ఎక్కడొస్తాయిలే! చన్నీళ్ళతో సర్దు కోమనిచెప్పు! వెళ్ళు!" అన్నాడు కృష్ణమూర్తి.

* * *

"ఇలాంటి పెళ్ళివాళ్ళను జన్మలో చూడలేదక్కయ్యా! బస్సు దిగారో లేదో కాఫీ కావాలన్నారు. నీళ్ళు కావాల న్నారు సబ్బులు కావాలన్నారు. కొబ్బరి నూనె కావాలన్నారు. పౌడర్లు కావాల న్నారు. ఫ్యాన్‌లు కావాలన్నారు. వేన్నీళ్ళు కావాలన్నారు" అంది రత్నమ్మ.

"మా వరంగల్‌లో ఎండా కాలం వచ్చిందంటే తాగటానికి నీళ్ళు దొరకవని ఆ పెళ్ళి వాళ్ళకెవరు చెప్పాలి? అయినా ఒకళ్ళు చెప్పేదేమిటి? వీళ్ళ సలు న్యూస్‌పేపర్లు చదవరా?" అంది అనల.

"న్యూస్‌పేపర్లకు, మీ ఊళ్ళో నీళ్ళు దొరకటానికి సంబంధం ఏమిటే?" అంది సారిక.

"నీ దొడ్డి మొద్దు బుర్రలా ఉందే? ఈ మాత్రం అర్థం చేసుకోలేవూ? మా వరంగల్‌లో ఐదారేళ్ళుగా నీళ్ళు దొరకటంలేదని పత్రికలు ఘోషిస్తున్నాయి. ఎక్కడో కరీంనగర్ దగ్గర్లో ఉన్న మానేర్ నీళ్ళను ఇక్కడకు తరలిస్తే గాని మాకు మంచినీళ్ళు పుట్టవుట" అంది అనల.

"మగపెళ్ళి వాళ్ళకు ఇవన్నీ ఎక్క డర్థమౌతాయ్? వాళ్ల ఏదడిగితే మన మది తెచ్చిపెట్టాలి. కొండమీది కోతి కావాలన్నా అప్పటికప్పుడు తెచ్చి పెట్టా ల్సిందే!" అంది రత్నమ్మ.

"కొండమీది కోతే ఎందుకే? కొండ కింది కోతి పనికిరాదా?" అంది —సారిక. అక్కడున్న ఆడవాళ్ళంతా నవ్వారు.

"ఆడపెళ్ళి వాళ్ళంటే ఆడుకు తినేవాడి కూడా అలుసే. ఏంచేస్తాం!" అంది రాజమ్మ.

"వాళ్ళంతా స్నానాలు ముగించారు.

వాళ్ళకు వెంటనే టిఫిన్లు పంపించాలి. టిఫిన్ రెడీ అయ్యిందా ?" అంటూ వచ్చాడు కృష్ణమూర్తి.

"ఎప్పుడో రెడీ అయ్యింది" అంది రాజమ్మ.

"అయితే త్వరగా పంపించండి !" అంటూ వెళ్ళిపోయాడు కృష్ణమూర్తి.

* * *

"ఏమే అనలా ! పెళ్ళి కొడుకును నువ్వుచూశావా ? ఎలా ఉంటాడే ?" అంది సారిక మల్లెపూలు మాలకడ్తూ.

కాస్సేపైతే నువ్వూ చూస్తావుగా ! తినబోతూరుచి అడగటందేనికే ?" అంది అనల.

"ముసలి దానిలా బోడి సామెతలు నువ్వూనూ ! కాస్త చెబితే నీ సోమ్మేం పోయిందే ?" —సారిక.

"నన్ను ముసలి దానిలా అంటావా ? ఇంతంతలావు కళ్ళద్దాలు పెట్టుకొని నువ్వే ముసిలి దానిలా ఉంటావు పోవే!" అంది అనల

"పోతానుగాని నీక్కాబోయే శ్రీవారు గారొస్తున్నారు" అంది సారిక హడా విడిగా, వాళ్ళవైపే వస్తున్న సుధీర్‌ను చూపిస్తూ.

"అనలా ! అనలా ! నేను వెంటనే స్నానం చెయ్యాలి. బాత్‌రూంలో నీళ్లు రావటంలేదు. నువ్వే రక్షించాలి" అన్నాడు సుధీర్.

"ఈ రోజు మీకు నీళ్ళు దొరకవు బావగారూ! ఈ ఊళ్ళో దొరుకుతున్న నీళ్ళన్నీ విడిదికే తరలించేశారు. ఈ ఒక్కరోజుకు మీ ముద్దుల శరీరాన్ని ఓదార్చాలి." అంద అనల

"అమ్మబాబోయ్! నా సంగతి నీకు తెలుసుగా? తిండి లేకుండానైనా ఉండ గలను గాని స్నానం చెయ్యకుండా ఒక్కరోజైనా ఉండలేను. అనలా! అనలా! నువ్వే ఎలాగైనా..."—సుధీర్.

"ఎలాగైనా అంటే ఏమిటి బావా? మా అక్కయ్యను పాతివ్రత్య మహాత్యం చూపించి మీ స్నానానికి నీళ్ళు సృష్టించ మంటారా? పెళ్ళి చేసుకోక ముందే ఇంత పెత్తనం చెలాయిస్తున్నారు. ఇక పెళ్ళి చేసుకున్నాక..." — సారిక.

"పెళ్ళి చేసుకోక ముందే నా పెత్తనం. పెళ్ళయ్యాక అంతా దాందే!" అన్నాడు సుధీర్. అందరూ గొల్లున నవ్వారు.

"ఈ పల్లెటూరి బావను మా అక్కయ్యేం చేసుకోదు. అలాంటి ఆశ లేం పెట్టుకోకండి బావగారూ!" అంది సారిక.

"మా అక్కయ్యచేసుకోదుగాని నేను చేసుకుంటా నంటావేమిటి కొంపదీసి! అలాంటి ఆశలేం పెట్టుకోకు మరదలా!" అన్నాడు సుధీర్. మళ్ళీ అక్కడున్న వాళ్ళంతా నవ్వారు.

"చేసుకోక చేసుకోక నిన్నే చేసుకోవాలి." అంది సారిక.

"ఏం! నాకేం తక్కువ? ఏ సినిమా హీరో నాకంటే అందంగా ఉంటాడు చెప్పు!"— సుధీర్.

"ఔనౌను! రోజూ సబ్బు అరగదీసి పదిసార్లు ముఖం కడుక్కుని, నాలుగు సార్లు స్నానం చేసి అంగుళం మందం స్నోపౌడర్లద్దితే అందరూ అందంగానే ఉంటారు. వెనక జన్మలో నువ్వు ఓ ఆడదానివై ఉంటావు బావా! మా అక్కయ్య ప్రాణం తియ్యటానికి పొర పాటున ఈ జన్మలో మగవాడివై పుట్టావు" అంది సారిక.

"ఇంకా మాలలు కట్టడం పూర్తి కాలేదా ? త్వరగా తీసుకు రమ్మం టున్నారు. అక్కయ్యను పెళ్ళికూతుర్ని చెయ్యాలట" అంది అప్పుడే అక్కడ కొచ్చిన అపర్ణ.

"అపర్ణా! అపర్ణా! ఎంతసేపు సందీ పన్నయ్యనే గాని నా ముఖం చూడవా? వాళ్ళిద్దరి స్నానాలకు నీళ్ళు తెప్పించి పెట్టావు. నాకు కాసిన్ని ప్రసాదించి పుణ్యం కట్టుకోవూ! చచ్చి నీ కడుపున పుడతాను" అన్నాడు సుధీర్.

"నువ్వు చావటమే ఒక పెద్ద ప్రమాదం: ఇక మా అక్కయ్య కడుపులో పుట్టటమంటే హీరోషిమా మీద అటంబాంబు పడ్డంత ప్రమాదం. ఆ పని మాత్రం చెయ్యబోకండి బావగారూ !" అంది సారిక.

"ఎప్పుడూ నిద్రమొహంతోజోగుతూ ఉండే సారిక ఈరోజు అకస్మాత్తుగా ఇంత హుషారై పోయిందేమిటి?" అన్నాడు సుధీర్.

"ఆ హుషారుకు కారణం ఉందిలే బావా!" అంది అనల మేడమీదికి చూపిస్తూ.

"ఏమిటా కారణం? కాస్త చెప్పి పుణ్యం కట్టుకోవూ?"— సుధీర్.

"చచ్చి నీ కడుపున పుడతాడు" వెంటనే అంది సారిక అందరూ నవ్వారు.

"ఈ కబుర్లేనా? పనేమన్నా చేస్తారా? ఆ పూలన్నీ నాకిచ్చే సేయండి" అంది అపర్ణ.

"కాస్త ఓపిక పట్టవే తల్లీ! నీ దంతా

స్పీడు! యమస్పీడు!" అంది సారిక.

"మల్లెపూల మాల సారికే బాగా కడ్తుందే! దాన్నే కట్టనియ్యి!" అంది ఉమ.

"ఇంతకూ నా స్నానం సంగతేం జేశారు బాలలూ?"— సుధీర్.

"ఈ రోజు మీరు స్నానం మానెయ్యండి బావలూ!" అంది అపర్ణ వెటకారంగా.

"ఎంతైనా ఇంత పక్షపాతం కూడదు. నీ కిష్టమైన వాడికేమో అన్ని సదుపాయాలూ సమకూర్చావు. నాలాంటి పల్లెటూరి వాడికేమో ఇంతన్యాయం చేస్తావా అపర్ణా? ఈ పాపం తగలకుండా పోతుందా?" — సుధీర్.

"ఎందుకింత బాధపడ్తావు బావా? మీ స్నానానికి నీళ్ళు నేను పెడ్తాను పద!" అంటూ లేచింది అనల.

"థ్యాంక్యూ బేబీ! థ్యాంక్యూ... సకాలంలో నన్నాదుకున్న నిన్ను తప్ప ఈ జన్మలో వేరొకర్ని పెళ్ళిచేసుకోనని ఇదే ప్రతిజ్ఞ చేయుచున్నాడను" —సుధీర్.

"అన్నీ ఇప్పటి ప్రతిజ్ఞలే! ఎవరన్నా ఓ యాభైవేలు వరదక్షిణ ఇస్తామని వస్తే వాళ్ళమ్మాయినే చేసుకుంటావు. మీ మగవాళ్ళను నమ్మి దాగుపడిందెవర్లే?" —సారిక.

"ఈ మగవాడు అందరి మగవాళ్ళ వంటివాడు కాదని త్వరలోనే తెలుసుకుంటావు మగువా! నా కసలు వరదక్షిణ అవసరం లేదు. అసలు మా అత్తయ్యకి, మామయ్యకు అభ్యంతరం లేకపోతే ఈ పెళ్ళిలోనే మా అనల మెడలో తాళి కట్టేస్తాను" అన్నాడు సుధీర్.

*  *  *

"ఓ అమ్మాయి, అబ్బాయి పెళ్ళి చేసుకోవటానికి ఇంత హంగామా ఇంత హడావుడి, ఇంత డబ్బు అవసరమంటారా? పెళ్ళి అనేది ఆ పెళ్ళి చేసుకునే ఇద్దరు వ్యక్తులకు సంబంధించిన వ్యవహారం. ఆ విషయాన్ని పూర్తిగా వారికే వదిలివేయకుండా ఇంతమంది జోక్యం చేసుకోవటం నాకు చాలా ప్రిమిటివ్‌గా కన్పిస్తుంది" అంది ఉజ్వల.

"పెళ్ళనేది పూర్తిగా ఆ పెళ్ళి చేసుకునే వ్యక్తులకు సంబంధించిన వ్యవహారం కాదనుకుంటాను. ప్రతీ పెళ్ళితో సంఘానికి సంబంధం ఉంది. పెళ్ళిని సంఘమే జరిపించాలి. వాళ్ళిద్దరూ పెళ్ళి చేసుకున్నట్టు సంఘానికి తెలియాలి. భార్యాభర్తలుగా వాళ్ళ సంబంధం స్థిరంగా ఉండేట్లు చూసే బాధ్యత కూడా సంఘానిదే. సంఘం ప్రమేయం లేకుండా పెళ్ళిళ్ళు జరిగాయనుకోండి. అలా జరిగిన పెళ్ళిళ్ళు చాలాకాలం నిలవవు. యువతీ యువకులు తాత్కాలిక ఆకర్షణలకు లొంగిపోయి ఇష్టమొచ్చినట్టుగా పెళ్ళిళ్ళు చేసుకొని ఆ ఆకర్షణ కాస్త తగ్గగానే విడిపోతారు. ఇలా వివాహవ్యవస్థ విచ్ఛిన్నమైపోతే మన సమాజంలో స్థిరత్వం ఉండదు. సాంఘిక వ్యవస్థ ఛిన్నాభిన్నమైపోతుంది. అందుకే పెళ్ళి విషయంలో సంఘం ఇంతగా పట్టించుకుంటుంది. అది చాలా సహజం" అన్నాడు సందీప్.

"ఛిన్నాభిన్నమై పోనివ్వండి. ఏమౌతుంది? ముక్కూ మొహం తెలియని ఇద్దరు స్త్రీ పురుషుల్ని భార్యాభర్తలుగా మార్చేస్తుంది సంఘం. వాళ్ళిద్దరి మధ్య





పరస్పర అవగాహన, ప్రేమ, గౌరవం ఇవేవీ లేకపోయినా జీవితాంతం వాళ్ళు కలిసి ఉండాల్సిందేనని శాసిస్తుంది సంఘం. ఒకరి నొకరు అసహ్యించుకుంటూ, ద్వేషించుకుంటూ-అయినా సరే విడిపోడానికి వీల్లేదన్న నిస్సహాయతను ప్రదర్శిస్తూ ఇదేదో కర్మ అనో, శాపమనో, జైలు జీవితం లాంటి కాపురం చెయ్యటం కంటె హాయిగా విడిపోతే ఏం? అలాంటి వివాహ వ్యవస్థ భగ్నమై పోతుందని మనం గుండెలు బాదుకోవడం దేనికి?" అంది ఉజ్వల.

"సరే! విడిపోతారు. విడిపోయాక? వాట్ నెక్స్ట్?"

"తర్వాతేమిటో వాళ్ళే నిర్ణయించుకుంటారు. ఇష్టమైతే మళ్ళీ వేరే పెళ్ళి చేసుకుంటారు"—ఉజ్వల.

"ఆ పెళ్ళి మాత్రం నిలుస్తుందని నమ్మక మేమిటి ? మళ్ళా విడిపోతారు. దెన్ వాట్ నెక్స్ట్ ? మళ్ళీ పెళ్ళి చేసుకుంటారు. మళ్ళా విడిపోతారు. ఇక దీనికి అంతమెక్కడ? ఇలా స్త్రీ పురుషులు పెళ్ళి చేసుకుంటూ, మళ్ళీ విడిపోతూ, ఇలా జీవితాంతం పెళ్ళిళ్ళు, విడాకులతో కాలం గడిపితే పిల్లల గతేమిటి? పిల్లల్నెవరు పెంచి పోషించాలి? స్థిరంగా ఉండే ఒక కుటుంబం, ప్రేమగా చూసే తల్లిదండ్రులు లేకపోతే పిల్లలు పెద్దయ్యాక పరమ క్రూరులుగానో లేక వట్టి పిరికి వాళ్ళుగానో తయారవుతారని మానసిక శాస్త్రం చెబుతోంది"—సందీప్.

"ఇప్పుడేమో మనం పిల్లల్ని చక్కగా పెంచి పోషిస్తున్నట్టు! నన్నడిగితే ఈ దేశంలో ఏ తల్లిదండ్రుల కూడా పిల్లల్ని సైంటిఫిగ్గా పెంచడం చాతకాదంటాను. చాలా చిన్నతనంలోనే మనకున్న సర్వరోగాల్ని పిల్లలకంటించి వాళ్ళను పాడు చేస్తున్నారు. ఐమీన్ రోగాలంటే శారీరక రోగాలు కాదు. నా ఉద్దేశం మోసం, కపటం, లౌక్యం, స్వార్థం, హిపోక్రసీ, అబద్ధం, అహంకారం మొదలైనవన్నీ రోగాలనే నా ఉద్దేశం. పిల్లల్ని పుట్టగానే తల్లిదండ్రులనుంచి వేరుచేసి వాళ్ళను స్పెషల్ చిల్డ్రెన్ హౌసెస్‌లో పిల్లల పెంపకం విషయంలో సుశిక్షితులైనవాళ్ల పెంచితేతప్ప ఈ దేశమే కాదు ఏ దేశమూ కూడా బాగుపడదు. అందుకే పిల్లల్ని పెంచే బాధ్యత పూర్తిగా స్టేట్ తీసుకోవాలంటాను"—ఉజ్వల.

"మిమ్మల్నడిగితే అన్నీ స్టేటే తీసుకోవాలంటారు. వ్యక్తి స్వాతంత్ర్యాన్ని హరించేసి వ్యక్తినొక దద్దమ్మను చేసే వ్యవస్థ కావాలంటారు. స్టేట్ చేతిలో వ్యక్తి ఒక కీలుబొమ్మ కావాలంటారు. ఐ హేట్ డిక్టేటర్ షిప్. తిండి, బట్టా లేకపోయినా సరే ! మనిషికి స్వేచ్ఛ కావాలి"—సందీప్.

"కడుపు నిండిన ప్రతి పెద్దమనిషి ఇలాగే మాట్లాడతాడు. ఫ్రీడమ్ ఫర్ హోమ్ ? అండ్ ఫ్రీడమ్ ఫర్ వాట్ ? బాగా డబ్బున్నవాడికి ఫ్రీడమ్ కావాలి. ఆ డబ్బును రెట్టింపు చేసుకోడానికి ఫ్రీడమ్ కావాలి. ఓ వందరూపాయలు అప్పిచ్చి డబ్బున్నవాడు డబ్బులేనివాడిని జీవితాంతం తనకు బానిసను చేసుకుంటున్నాడు. ఫ్రీడమ్ అంటే ఇదేనా ? డబ్బున్నవాడు డబ్బులేనివాడిని ఎన్నో విధాలుగా దోచుకుంటున్నాడు. ఈ

దోపిడీనే ఫ్రీడమ్ అంటారా? మీ డిక్షనరీలో ఫ్రీడమ్‌కు ఇదే అర్థమనుకుంటాను"—ఉజ్వల.

"వీళ్ళిద్దరూఎప్పుడూ ఇలా వేడివేడిగా వాదించుకోవటం తప్ప మామూలుగా మాట్లాడుకోలేరా రవికాంత్ గారూ?" అన్నాడు అప్పుడే స్నానం చేసొచ్చి ముఖానికి స్నో రాసుకుంటూ సుధీర్.

"వాళ్ళకదే సరదా! మీరు కూడా స్నానం చేసినట్టున్నారే?" అన్నాడు రవికాంత్.

"ఎలాగో తంటాలుపడి స్నానం అయిందనిపించాను. మీ మద్రాసులో ఇలాంటి నీళ్ళకొరత ఉండదనుకుంటాను. నాకోసారి మద్రాసు రావాలని ఉందండీ. వస్తే నాకు స్టూడియో చూపిస్తారా? నాకోసారి సినిమా షూటింగు చూడాలని ఉందండీ" అన్నాడు సుధీర్.

"మద్రాసు వచ్చాక సినిమా షూటింగు చూశ్శేరా? సందీప్‌వాళ్ళ నాన్నగారు స్టూడియోలోనేగా పనిచేసేది. మీరు ఈజీగా చూడొచ్చు"—రవికాంత్.

"స్టూడియోలోనే పనిచేస్తారు ఆర్ట్ డైరెక్టర్‌గా. ఏం లాభం? ఏ డైరెక్టరుగానో పనిచేస్తే నాలాంటివాడికి సినిమా ఛాన్స్ వచ్చేది"—సుధీర్.

"మీకు సినిమాల్లో యాక్ట్ చెయ్యాలని ఉందా?"—రవికాంత్.

"ఔనండీ! చెయ్యలేనంటారా? ఇప్పుడు యాక్ట్ చేస్తున్నవాళ్ళకు నాకంటే మంచి పర్సనాలిటీ ఉందంటారా? కాలేజీలో చదువుకునేరోజుల్లో నన్నందరూ 'మిస్టర్ కాలేజీ' అనేవాళ్ళు. ఆడవాళ్ళంతా నాకేసి అదేపనిగా చూసేవాళ్ళు. ఈమధ్య ఇంటి దగ్గరుండి సరిగ్గా ఎక్సర్‌సైజ్ చెయ్యక కొంచెం లావెక్కాగానీ లేకపోతే నేనెంత అందంగా ఉండేవాడిననుకున్నారండీ. నన్నసలు ఏ సినిమా డైరెక్టరు చూడలేదుకాని చూస్తేనా? నన్నే బతిమాలి సినిమా ఛాన్స్ ఇచ్చేవాడు. ఔనూ! మిమ్మల్నొక విషయం అడుగుదామని మరిచిపోయాను. రాత్రి మీపాట విన్నాను. ఎంత బాగా పాడారండీ! సినిమాల్లో ప్లే బ్యాక్ చెయ్యలేకపొయ్యారా?" అన్నాడు సుధీర్.

"సినిమా పాటలంటే నాకసహ్యం!" —రవికాంత్.

"ఎందుకండీ?"

"నాకు క్లాసికల్ మ్యూజికంటే ఇష్టం!"

"లాభం లేదండీ! ఈ రోజుల్లో క్లాసికల్ మ్యూజిక్ ఎవరిక్కావాలి?"

"అందరూ త్వరగా టిఫిన్లూ, కాఫీలు ముగించండి. అవతల పెళ్ళివారొచ్చేస్తున్నారు. లగ్నం అయ్యేటప్పటికి ఏ ఒంటిగంటో, రెండో అవుతుంది. అప్పటివరకూ భోజనాలు పెట్టరు" అంది హడావుడిగా అక్కడికొచ్చిన అపర్ణ.

"అమ్మబాబోయ్! రెండింటి దాకా భోజనాలు పెట్టరా? ఇప్పుడే మనకు ఆకలి దంచేస్తోంది" —సుధీర్.

"మనకు ఆకలి దంచేయందెప్పుడని? కమాన్ బావగారూ! అందరూ కూర్చోండి. లడ్డూ లొడ్డించేస్తాను" —అపర్ణ.

"లడ్డూలాంటమ్మాయి లడ్డూలొడ్డిస్తే ఎంత తియ్యగా ఉంటాయో!" —సందీప్.

"ఇప్పటి మీ మాటెంత తీయగా ఉందో అంత తియ్యగా" —ఉజ్వల.




"నా మాట అంత తీయగా ఉందా?" —సందీప్.

"ఉండేవాళ్ళ కుంటుంది"—ఉజ్వల.

"ఆ ఉండేవాళ్ళలో మీరు లేరా ?" —సందీప్.

"నేసుంటానని మీరనుకున్నారా ?" —ఉజ్వల.

"బాబోయ్ ! వీళ్ళు మళ్ళీ వాదనలో పడ్తున్నారు. అపర్ణా! త్వరగా లడ్డూ లొడ్డించేసెయ్! నే నాగలేక పోతు న్నాను" —సుధీర్.

అపర్ణ అక్కడున్న వాళ్ళందరికీ లడ్డూలొడ్డించింది.

"లడ్డూలెలా ఉన్నాయి బావా ?" —అపర్ణ

"నువ్వే చేశావా ?" —సందీప్.

"లడ్డూల రుచి చెప్పటానికి అవి చేసిందెవరో తెలుసుకోవటం అవసరమా?" —ఉజ్వల.

"బావ మాట్లాడిన ప్రతి మాటకూ నువ్వు జోక్యం చేసుకోవటం అవసరమా ?" అపర్ణ కోపంగా.

"ఔను! నీకేమన్నా అభ్యంతరమా?" —ఉజ్వల.

"చాలా అభ్యంతరం ! ప్రతిమాటను చిలువలు పలువలు చేసి బావ దగ్గర నీ

తెలివంతా చూపించుకోవాల్సిన అవసరం లేదు" —అపర్ణ.

"పెళ్ళి కొచ్చిన ఆడవాళ్ళు ఎవరి కున్నది వాళ్లు చూపించు కోకుండా ఉండలేరు అపూ! ఉజ్వలకు తెలివుంది. నీకు అందముంది. డోన్ట్ వర్రీ!" —సందీప్.

"ఉజ్వలకు అందం లేవంటావా?" —రవికాంత్.

"ఉజ్వలకు అందం లేదని నేనటం లేదు. కానీ ఒక్కొక్కరిలో ఒక్కొక్క ప్రత్యేకత ఉంటుంది. కొందరిలో ఎన్నో ఉన్నా వాళ్ళల్లో ఏదో ఒక అంశం మాత్రమే వాళ్ళను డామినేట్ చేస్తుంది. ఉజ్వల అందంగా ఉంటుంది. నోడౌట్. కానీ ఆమె తెలివి ఆమె అందాన్ని కని పించనీయకుండా చేస్తుంది" —సందీప్.

బయటనుంచి బ్యాండ్ చప్పుడు విని పించింది.

"అదుగో పెళ్ళి వాళ్ళు బయలుదేర తున్నారు త్వరగా కానివ్వండి. అక్క య్యను పెళ్ళి కూతుర్ని చెయ్యటం ఇంకా పూర్తయిందో లేదో?" అంటూ దిగ్గున లేచి కిందకు పరుగెత్తింది అపర్ణ.

అపర్ణకు అంతా అద్భుతంగా ఉంది. బావ తనను ఉజ్వల కంటే అందమైన దానిగా గుర్తించాడు. బావ తనను ప్రేమిస్తున్నాడు. సందేహం లేదు. తన కలలు నిజమవుతాయి. తన జీవితం నందన వనమౌతుంది. ఆకాశమంత ఎత్తున్న బావ తనకు అందడనుకుంది. కానీ తన సౌందర్యంతో బావను గెల్చింది. ఆనందంతో ఉరకలు వేస్తున్న ఆమె మనస్సు ఎక్కడెక్కడో తేలి పోతుంది. ఆమె కేమేమో చెయ్యాలని పిస్తోంది. ఈ పెళ్ళి అక్కయ్యకాక తనకే అయితే? తననే పెళ్ళికూతుర్ని చేస్తే తన మెళ్ళో బావ తాళి కట్టేస్తే? బావతో తను మద్రాసు వెళ్ళిపోతే! చిన్నప్పు డెప్పుడో బావా, తనూ మొగుడూ పెళ్ళా లాట ఆడుకోవటం గుర్తు కొచ్చింది. కల్లా కపటం తెలియని అంత చిన్న వయసులోనే తను సందీప్ బావను మాత్రమే భర్తగా స్వీకరించింది. ఉత్తు త్తిగానైనాసరే తను మరొకర్ని భర్తగా ఒప్పుకునేది కాదు ఒకసారి సందీప్‌బావ లేనప్పుడు సుధీర్ బావ తనతో మొగుడు పెళ్ళాలాట ఆడమన్నాడు. తను నసేమిరా అని మొండికేసింది. పాపం సుధీర్ బావ ఎంతో బతిమాలాడు. ఇప్పటికీ సుధీర్ బావ తనంటే పడిచస్తాడు. కానీ తనకెందుకో సుధీర్ బావంటే ఇష్టం లేదు. మరీ మొరటు వాడిలా కని పిస్తాడు.

బ్యాండువాళ్ళు 'యాదోంకి బారాత్ నికలీ హై' అన్న పాట రాగాన్ని ఎంతో శ్రావ్యంగా వాయిస్తున్నారు. అపర్ణకు తనకా పాటంటే ఎంతో ఇష్టమని గుర్తొ చ్చింది. తన పెళ్ళినాడు కూడా ఆ పాట వాయిస్తారా? ఎంత థ్రిల్లింగ్‌గా ఉంటుందో!

"అబ్బ! ఎంత ముద్దొస్తున్నావే అక్కయ్యా! నిన్ను చేసుకోబోతున్న ఆ బావ ఎంత అదృష్టవంతుడో!" అంది సారిక పెళ్ళి కూతురుగా ముస్తాబైన అరుంధతిని చూసి.

"నువ్వే ఇంత ఆగలేకపోతున్నావు. పాపం ఆ పెళ్ళి కొడుకును తల్చుకుంటే జాలేస్తోందే!" —ఉమ.

"ఎందుకే?" —సారిక.

"ఈ రోజు అర్ధరాత్రి దాకా ఎలా ఆగుతాడా అని?" —ఉమ.

అరుంధతి ఉమ నెత్తిమీద గట్టిగా మొట్టికాయ వేసింది.

"పెళ్ళి కూతురు ముస్తాబు పూర్తయిందా? వాళ్ళొచ్చేస్తున్నారు!" అంది అపర్ణ.

"ఆఁ పూర్తయినట్టే!" అంది రత్నమ్మ అరుంధతి తల్లోని మల్లె పూలను సరిచేస్తూ.

"త్వరగా కానివ్వండి!" 'యాదోంకి బారత్ నికిలీహై' అని పాడుకుంటూ అక్కణ్నుంచి కొత్తగా ఎవరెవరొచ్చారో చూద్దామని పెళ్ళి పందిట్లో కొచ్చింది అపర్ణ.



## 12

కొన్ని క్షణాల్లో తన జీవితంలో ఒక మహత్తరమైన సంఘటన జరగబోతుందన్న థ్రిల్లేదీ తనలో కలుగక పోవటం అరుంధతికి ఆశ్చర్యంగా ఉంది. తను ఫీలయ్యే శక్తిని కోల్పోయిందా? పది పదిహేను రోజులుగా ప్రతిరోజూ ఈ రోజును గూర్చే ఆలోచించింది. కానీ తీరా, ఆరోజొచ్చేశాక తన బుర్రంతా ఖాళీగా ఉంది. పరీక్ష కోసం రాత్రిం బవళ్ళు చదివి, చదివి అలసిపోయిన విద్యార్థి పరీక్షరోజు తను చదువు కున్నదేదీ జ్ఞాపకం లేనట్టుగా, తన బుర్రంతా ఖాళీ అయిపోయినట్టుగా ఫీలౌతాడు. ఇప్పటి తన మానసిక పరిస్థితి సరిగ్గా అలా ఉంది. అంతా తన ప్రమేయం లేకుండా జరిగిపోతోంది. బ్యాండు వాళ్ళు బ్యాండువాయిస్తున్నారు. వంటమనుషులు వంట చేస్తున్నారు. బంధువులంతాఎవరం తట వాళ్ళొచ్చేస్తున్నారు. ఎవరోవచ్చి తనను పెళ్ళి కూతుర్ని చేస్తున్నారు. పట్టుచీర కట్టిస్తున్నారు. పట్టు జాకెట్ తొడిగిస్తున్నారు. జడలేసి మల్లెపూలు తురుము తున్నారు. తన కాళ్ళకు పారాణి రాస్తున్నారు అంతా క్షణాల మీద!... యాంత్రికంగా... ఏదో అదృశ్య శక్తి శాసిస్తే జరుగుతున్నట్టుగా ఉంది. తన పెళ్ళి నిప్పుడు ఎవరూ ఆపలేరు. తను కూడ ఆపలేదు ఈ భూనభోంతరాళాల్లో ఏ శక్తీ తన పెళ్ళిని ఆపలేదు. అకస్మాత్తుగా సినిమాల్లో లాగ ఇక్కడకు వినయ్ వచ్చేసి "అరుంధతిని నేనే చేసుకుంటాను. నన్నూ, అరుంధతిని ఈ ప్రపంచంలో ఏ శక్తీ విడదీయలేదు'' అంటే! అప్పుడీ పెళ్ళి ఆగిపోతుందా?

"అక్కయ్యా! అక్కయా! నీకో గుడ్‌న్యూస్ చెప్పనా?'' అంటూ పరిగెత్తు కొచ్చింది అపర్ణ.

"ఎవరికే గుడ్‌న్యూస్?'' అంది రత్నమ్మ.

"పెళ్ళి కూతురికె!... అక్కయ్యా! వినయ్ వచ్చాడు!'' అంది అపర్ణ స్వరం కొంచెం తగ్గించి.

ఆ మాట వినగానే తన గుండెల్లో పిడుగు పడ్డట్టుగా కొన్ని క్షణాలసేపు తనీ ప్రపంచలోంచి మాయమైపోయి, ఎక్కడో మరో ప్రపంచంలో కళ్ళు తెరిచినట్టుగా ఫీలయింది అరుంధతి.

"అపర్ణా!" రత్నమ్మ అపర్ణకేసి తీక్షణంగా చూసింది. "పిల్లకాయ వేషాలు వేశావంటే బాగుండదు" అంది.

"ఇప్పుడు నేనేమన్నాను పిన్నీ!" —అపర్ణ.

"ఏమీ అన్లేదు! ఏమీ అనొద్దు! తెల్సిందా ?"

అక్కడున్న వాళ్ళంతా ఒకరి మొహాలొకరు చూసుకున్నారు.

వినయ్ నిజంగా వచ్చాడా? ఎందుకొచ్చాడు? తననింకా ఏడిపించటానికా? అతను పలకరిస్తే తను మాట్లాడాలా? తమ బంధుల్లో ఎవరైనా తనూ, వినయ్ ప్రేమించుకున్నట్టు, ఉత్తరాలు రాసుకున్నట్టు, కలిసి తిరిగినట్టు, వినయ్ తనను చేసుకోవటానికి నిరాకరించటం వల్లనే తనకీ పెళ్ళి చేస్తున్నట్టు ఆ మగపెళ్ళి వాళ్ళకు చెబితే? ఈ పెళ్ళి ఆగిపోతుందా? కనీసం అప్పుడైనా తన కారణంగానే ఈ పెళ్ళి ఆగిపోయిందన్న జాలితోనన్నా వినయ్ తనను పెళ్ళి చేసుకుంటాడా? ఛీ ఛీ! తను పిచ్చిగా ఆలోచిస్తోంది. తనది వట్టి పిచ్చిగుండె. వినయ్ మీది ప్రేమతో తను పిచ్చిదైపోయింది.

"అరూ! ఏమిటే ఆలోచిస్తున్నావు?" —రత్నమ్మ.

"ఏమీ లేదు పిన్నీ!"—అరుంధతి.

"నువ్వేం ఆలోచిస్తున్నావో నాకు తెలుసు. జరిగిందంతా మర్చిపో! జరగబోతున్న దాన్ని గురించి ఆలోచించు. ఇంకా నువ్వు చిన్న పిల్లవు కాదు. తెల్సిందా?" — రత్నమ్మ.

'తెల్సిందన్నట్టు'గా తలూపింది




అరుంధతి.

*  *  *

పెళ్ళికొడుకు ఊరేగింపు పెళ్ళి కూతురు ఇంటిని సమీపించింది. మల్లె పూల దండలతో అలంకరించిన జీపులో పెళ్ళి కొడుకు కూర్చున్నాడు. పెళ్ళి కొడుకు కిశోర్‌కు జీప్‌లో కూర్చొని రోడ్డుమీద ఊరేగటం ఇబ్బందిగా ఉంది. రోడ్డుమీది జనమంతా తననే చూడటం... ఈ దేశంలో పెళ్ళి చేసుకోవటం కూడా ఒక ఘనకార్యమేనా? పెళ్ళిచేసు కుంటు న్నట్టు అందరికీ తెలియాలి. రోడ్డుమీద ఊరేగాలి. అందరూ తననో హీరోలా చూడాలి. ఇదేదో చాలా గొప్పవాళ్ళ పెళ్ళని అనుకోవాలి. ఇలాంటి వాటిని ఎంతో అసహ్యించుకునే తను కూడా అందరి లాగే ఈ తంతులో పాల్గొంటు న్నాడు. రాజీ...జీవితంలో ప్రతి క్షణం రాజీ పడటమే... అమ్మకోసం, నాన్న కోసం, బంధువుల కోసం, సంప్ర దాయాల కోసం, సంఘంకోసం సర్దుకు పోవటం. అరుంధతి కివన్నీ ఇష్టమేనా?

అరుంధతిని వెంటనే కలుసుకోవాలని పించింది. 'ఇవన్నీ నీ కిష్టమేనా? అసలు నేనంటే నీ కిష్టమేనా?' అని అడగాలని పించింది. అరుంధతిని మొదటి సారి పెళ్ళి చూపుల రోజు చూసినప్పుడే ఆమెతో మాట్లాడాలని పించింది. కాని అరుంధతి తనతో మాట్లాడుతుందా? ఎంత సిగ్గుపడి పోతుందో! ఆ కళ్ళల్లో ఎంత అమాయకత్వం! ఈ ప్రపంచంలో అప్పుడే కళ్ళు తెరిచిన పసిపాపలా, ఆమె తనకేసి కళ్ళెత్తి చూసిన ఆ రెండు మూడు క్షణాలు తను జన్మలో మరచి పోలేడు. ఆ రెండు మూడు క్షణాలే తననూ, ఆమెనూ శాశ్వతంగా కలిపేశాయి. తనను మొదటిసారి చూసినప్పుడు అరుంధతి తనలాగే ఫీలయ్యిందా? తనామెకు వెంటనే నచ్చాడా? ఆమెను చూడగానే తనకు తన ఫస్ట్ లవ్—నివేదిత గుర్తుకొచ్చింది. అరుంధతికూ్కడా తనను చూసినప్పుడు ఆమె కిష్టమయిన వాళ్ళెవరన్నా గుర్తు కొచ్చారా? కాలేజీలో చదువుకునే రోజుల్లో అరుంధతి ఎవర్నయినా ప్రేమించిందా? ఇంపాజిబుల్! అంత అమాయకంగా అంత ముగ్ధ మనోహరంగా, అంత నిండుగా కన్పించే అరుంధతి పర పురు షుణ్ని ప్రేమించ గల్గుతుందన్న భావం తన మనస్సులోకి రావటమే ఎంతో పాపం!

కిశోర్ నవ్వుకున్నాడు.

అమాయకంగా కన్పించినంత మాత్రాన ప్రేమించకూడదని ఎక్క డన్నా ఉందా? వాళ్ళల్లో మాత్రం హృదయం లేదూ? పురుషుడు ప్రేమిస్తే తప్పులేదు. స్త్రీ ప్రేమించటం తనకు పాపంగా కన్పిస్తుంది. తను నివేదితను ప్రేమించలేదూ? అలాగే అరుంధతికూడ ఎవరినైనా ప్రేమించి ఉంటుంది. అందులో తప్పేముంది? నో! నో!నో! ఇంపాజిబుల్! అలా జరగడానికి వీల్లేదు. మరెవర్నో ప్రేమించిన స్త్రీని తను పెళ్ళి చేసుకోకూడదు. ఎంగిలి కూటికి తను ఆశపడకూడదు.

కిశోర్‌కు తను చాలా పిచ్చిగా ఆలో చిస్తున్నా ననిపించింది. తన బుర్రలోకి ఇలాంటి పిచ్చి పిచ్చి ఆలోచనలు రాకుండా ఉండాలంటే ఏం చెయ్యాలి? ఈ జీపు త్వరగా అరుంధతి వాళ్ళింటికి

వెళ్ళి, తను త్వరగా అరుంధతిని పెళ్ళాడేస్తే! తన కిలాంటి పిచ్చిపిచ్చి ఆలోచనలు రావు. అప్పుడే విచ్చుకుంటున్న స్వచ్ఛమైన గులాబీ పువ్వులాంటి అరుంధతిని గూర్చి తనెంత పిచ్చిగా ఆలోచించాడు! జీపు పెళ్ళివారింటిని సమీపించింది.

కృష్ణమూర్తి ఇంటిముందు కాంపౌండులో రెండు షామియానాలు వేసి వాటికింద కుర్చీలు వేశారు. రెండు మూడు వందలమంది దాకా బంధువులు, స్నేహితులు ఆ కుర్చీల్లో కూర్చొని పెళ్ళి పందిరికేసి చూస్తున్నారు. జీపు దిగిన పెళ్ళికొడుకును పెళ్ళి పందిట్లోకి తీసుకెళ్ళారు.

పురోహితుడు గుక్క తిప్పుకోకుండా మంత్రాలు చదువుతున్నాడు. కృష్ణమూర్తి, రాజమ్మ అల్లుడి కాళ్ళుకడిగారు. 'పెళ్ళికూతుర్ని తీసుకురండ'ని పురోహితుడు కేకేశాడు. కృష్ణమూర్తి వెళ్ళి అరుంధతిని పెళ్ళిపందిట్లోకి తీసుకువచ్చాడు.

పురోహితుడింకా హుషారుగా, వేగంగా మంత్రాలు చదవసాగాడు. పెళ్ళికొడుకు తల మీద జీలకర్ర, బెల్లం అద్దాడు. పెళ్ళికూతురు మెళ్ళో మంగళసూత్రం కట్టాడు. అందరూ అక్షింతలు చల్లారు. పెళ్ళి కూతురు తలమీద పెళ్లి కొడుకు; పెళ్లికొడుకు తలమీద పెళ్లికూతురు తలంబ్రాలు పోసుకున్నారు. కెమేరాలు క్లిక్‌మన్నాయి. క్లిక్, అరుంధతి భార్యాభర్తలై పోయారు.







## 13

తను అరుంధతిని ప్రేమించాడు.

కానీ అరుంధతిని భార్యగా ఊహించలేకపోయాడు.

ఏ శాపం వల్లనో భూమ్మీద జన్మించిన దేవకన్య అరుంధతి.

సంధ్యాకాశంలోని రంగుల్లా క్షణక్షణానికీ వినూత్న సౌందర్యంతో తేజరిల్లే తేజస్విని అరుంధతి.

ఈ ప్రపంచంలోని కృత్రిమ ఆచ్ఛాదనలేవీ అంటని అప్పుడే కళ్ళు తెరిచిన పసిపాపలాంటి స్వచ్ఛమైన మనసు అరుంధతిది.

ఈ ప్రపంచానికి దూరంగా ఎక్కడో వినీలాకాశంలో ప్రశాంతంగా ప్రకాశిస్తూ ఉండిపోవలసిన నక్షత్రం లాంటిది అరుంధతి.

అలాంటి అరుంధతిని పెళ్ళి చేసుకొని భార్యగా మార్చి సంసారమనే ఊబిలోకి త్రోసి పిల్లల తల్లిని చేసి, కొట్టి, తిట్టి, చిత్రహింస చేసి అందరిలాగా ఒక మామూలు స్త్రీని చేయటమంటే అందాన్ని హత్యచేయటం... పసిపాప గొంతు నులిమెయ్యటం...

థ్యాంగ్‌గాడ్! తను అంత పాపాన్ని చెయ్యలేదు ... అరుంధతిని ప్రేమించాడు... ప్రేమిస్తున్నాడు... తన కంఠంలో ప్రాణమున్నంతసేపు ప్రేమిస్తూనే ఉంటాడు... కానీ అరుంధతినిగ

తన ప్రేమను ఈ ప్రపంచం అర్థం చేసుకోలేదు... అరుంధతే అర్థం చేసుకో లేదు. ఇక ప్రపంచమేం అర్థం చేసు కుంటుంది?

ఈ ప్రపంచానికి ప్రేమించుకోవటమంటే కామించుకోవటం...వీళ్ళదృష్టిలో ప్రేమంటే సెక్స్... సెక్స్... సెక్స్... సెక్సంటే తన కసహ్యం... ఈ ప్రపంచంలో అన్నిటి కంటే పవిత్రమైంది ప్రేమ. అలాంటి ప్రేమను కామంతో ముడి పెట్టటమా ? హిమాలయాల్లాంటి ఉన్నత శిఖరాలమీద ప్రవహించే ప్రేమ వాహినిని దుర్గంధపూరితమైన మురికి కాలువల్లోకి మళ్ళించటం లాంటిది కాదూ?

అరుంధతి తనను పెళ్ళిచేసుకోమని అడిగినప్పుడు తను వణికిపోయాడు. అరుంధతితో సెక్స్ సంబంధాన్ని తను కలలో కూడా ఊహించుకోలేక పోయాడు. అరుంధతిని పెళ్ళి చేసుకోవటమంటే... అరుంధతితో సంసారం చెయ్యాలి. పిల్లల్ని కనాలి. ప్రేమంటే ఇదేనా? తనను అరుంధతి ఇంత పిచ్చిగా అర్థం చేసుకుందా? ప్రేమించడం పెళ్ళి చేసుకోవటం కోసమేనా? ఇలా తప్ప ఈ ప్రపంచం ప్రేమను మరోలా అర్థం చేసుకోలేదా?

"హల్లో వినయ్!నువ్వెప్పుడొచ్చావు?" దూరంనుండి వినయ్‌ను చూసి అక్కడి కొచ్చిన సుధీర్ అన్నాడు.

"నే నొచ్చి చాలాసేపయింది మీ రెప్పుడొచ్చారు?"

"మేము నిన్ననే వచ్చాము. అయితే నువ్వుకూడా అరుంధతి పెళ్ళి కొచ్చా వన్నమాట!"

"ఏం? రాకూడదా?"

"రాకూడదని కాదు. నువ్వు రావడం ఆశ్చర్యం!"

"నేను చేసే ప్రతి పనీ, ఈ ప్రపంచానికి ఆశ్చర్యంగా ఉంటుంది. ప్రపంచం చేసే ప్రతి పనీ నా కాశ్చర్యంగా ఉంటుంది" —వినయ్.

"అందర్నీ భోజనాలకు రమ్మంటు న్నారు. కమాన్!" అంటూ అపర్ణ వచ్చింది. వినయ్‌ను చూసి "హల్లో మామయ్యా! హౌడుయూడూ?" అంది.

"ఏం అపర్ణా! నేను బ్రతికుండడం కూడా ఆశ్చర్యంగానే ఉందా?" —వినయ్.

"బ్రతికి ఉండడం ఆశ్చర్యంగా లేదు. నువ్వు అక్కయ్య పెళ్ళికి రావడం ఆశ్చర్యంగా ఉంది" —అపర్ణ.

"ఓ! వినయ్! నువ్వేనా!" అంది అప్పుడే అక్కడి కొచ్చిన ఉజ్వల.

"ఔను! మిమ్మల్నెక్కడో చూసి నట్టున్నాను" —వినయ్.

"వెనుక జన్మలోమాత్రం కాదు. ఈ జన్మలోనే ఏదో పెళ్ళిలో కలిశాము" —ఉజ్వల.

"వెనుక జన్మమీద మీకు నమ్మకం లేదా?" —వినయ్.

"బొత్తిగా లేదు. మీకుందా?" —ఉజ్వల,

"ఉందని చెప్పలేను! లేదని చెప్ప లేను. తెలియదు అని మాత్రం చెప్ప గలను" —వినయ్.

"ముందు ముందు తెలిసే అవకాశం ఏమన్నా ఉందా?" —ఉజ్వల.

"లేదని ఎలా చెప్పగలం?" -వినయ్.

"మీ గురించి అరుంధతి చెప్పింది

కరక్టే"—ఉజ్వల.

"ఏమని చెప్పింది?"—వినయ్.

"తను చెప్పింది మీకు చెప్పమని మాత్రం చెప్పలేదు"—ఉజ్వల.

"వినయ్! అందరూ భోజనాల కెళుత్నారు, మీరొస్తారా? నన్నెళ్ళమంటారా?" అన్నాడు సుధీర్.

"ఎందుకంత తొందర? మొదట మగపెళ్ళివాళ్ళను చెయ్యనివ్వండి. తర్వాత మన మెళ్ళవచ్చు"—వినయ్.

"ఈ నీతులన్నీ నా దగ్గర సాగవు. మా గురువుగారెప్పుడో చెప్పారు. భోజనానికి ముందు, యుద్ధానికి వెనకా ఉండాలని"—సుధీర్.

"ఈ దేశాన్ని రక్షించారు సుధీర్ గారూ!"—ఉజ్వల.

"అకస్మాత్తుగా మీరు నాకింత క్రెడిటిచ్చారు ఎందుకో?"—సుధీర్.

"మీలాంటి వాళ్ళంతా మిలటరీలో జాయినయితే ఈ దేశం గతేమయ్యేదో? మీరు మిలటరీలో జాయిన్ కాకుండా ఉండటం ఈ దేశాన్ని రక్షించడం కాదూ?"—ఉజ్వల.

"జోక్ బావుంది గాని ఇప్పుడు నవ్వే శక్తి లేదు. భోజనం చేసొచ్చాక నవ్వుతాను" అంటూ సుధీర్ భోజనాల శాలవైపు కదిలాడు.

"చాలాసేపట్నుంచి మీ సందీప న్నయ్య కన్పించడంలేదు. ఏమయ్యాడు?"—ఉజ్వల.

"బాగా తలనొప్పిగా ఉందని మేడ మీద పడుకున్నాడు. భోజనానిక్కూడా రానన్నాడు. నే, వెడ్తున్నాను" సుధీర్ అక్కణ్ణుంచి వెళ్ళిపోయాడు.





"మనిషికి రోజూ ఈ తిండి తినటం అనే అవసరం లేకపోతే ఎంత బాగుండును!"—వినయ్.

"అసలు మనిషనేవాడు పుట్టకుండా ఉంటే ఎంత బావుండును! ఈ భూగోళం అనేది పుట్టకుండా ఉంటే ఎంత బావుండును! ఈ సూర్యచంద్రులు, ఈ గ్రహాలు, ఈ నక్షత్రాలు, ఈ సమస్త విశ్వం లేకుండా ఉంటే ఎంత బావుండును!" అంది ఉజ్వల.

"అసలు మనిషనేవాడు లేనప్పుడు 'ఇవన్నీ లేకుండా ఉంటే ఎంత బావుండును' అని అనుకోవటానికెవరుంటారు? కాబట్టి మనిషనే వాడుండాలి"—వినయ్.

"మనిషనే వాడున్నప్పుడు ఆకలుంటుంది. ఆ ఆకల్ని తీర్చుకోవటానికి పరిశ్రమ చెయ్యాల్సి ఉంటుంది. ఆ పరిశ్రమలోంచే ఈ ప్రపంచం, ఈ నాగరికత, ఈ పెళ్ళిళ్ళు పేరంటాలు పుడ్తున్నాయి. కాబట్టి ఆకలి లేకపోతే ఎంత బావుండును అని కలలు కనడం వృధాప్రయాసే అవుతుంది" —ఉజ్వల

"ఈ ఆకలనేది లేకపోతే మనిషిలో ఇంత స్వార్థం, ఇంత కుత్సితం ఇంత లౌక్యం, ఇంత క్రౌర్యం ఉండేవి కావేమో! రోజూ హాయిగా ఈ సృష్టిలోని అందాన్నంతా ఆస్వాదిస్తూ ఎవడి లోకంలో వాడు ఏ చీకూ, చింతా లేకుండా కాలం గడిపేవాడనుకుంటాను. ఏ శాస్త్రజ్ఞుడైనా ఆకల్ని జయించే ఔషధ మేదన్నా కనుక్కుంటే బావుండును" —వినయ్.

"ఎవరో ఎందుకు? మీరే ట్రై చెయ్యకూడదూ!" —ఉజ్వల.

* * *

అందరూ ఉన్నారుగాని బావెక్కడా

కన్పించడం లేదేమిటి? భోజనాలకు వెళ్తున్నవారందర్నీ పరీక్షించి చూసింది అపర్ణ. వాళ్ళలో సందీప్ కన్పించలేదు. ఈ పెళ్ళి సందడిలో బోరైపోయి ఇద్దరూ మేడమీద కెళ్ళిపోయుంటార్రు. అపర్ణ చకచకా అందర్నీ తప్పించుకొని మేడమెట్లెక్కసాగింది. అప్పుడే రవికాంత్ కిందకు దిగుతున్నాడు.

"గదిలో బావున్నాడా?"

"ఉన్నాడు. వాడికి బాగా తలనొప్పిగా ఉందట. భోజనం కూడా చేసే మూడ్ లేదు. నన్ను వెళ్ళి తిని రమ్మన్నాడు" అంటూ మెట్లుదిగి వెళ్ళిపోయాడు రవికాంత్.

'అయ్యో! బావకు తలనొప్పిగా ఉందా?' ఏదో జరక్కూడని ప్రమాదం జరిగినట్టుగా అపర్ణ మనస్సు చివుక్కుమంది. తనేదైనా మ్యాజిక్ చేసి, వెంటనే బావ తలనొప్పి పోగొడితే ఎంత బావుండును! పరిగెత్తుతున్నట్లుగా మెట్లు ఎక్కి సందీప్ వున్న గదిలోకెళ్ళింది అపర్ణ. 'అమ్మయ్య! ఎంత కాలానికి బావను ఒంటరిగా కలుసుకోగల్గాను' అనుకుంది.

బెడ్ మీద పడుకొని ఇంగ్లీషు పత్రిక తిరగేస్తున్నాడు సందీప్.

"తలనొప్పిగా ఉందా బావా! అమృతాంజనం తెమ్మంటావా? సారిడాన్ వేసుకుంటావా? స్ట్రాంగ్ కాఫీ తీసుకురానా? త్వరగా చెప్పు బావా!"

"ఏమీ అక్కర్లేదు. నువ్వొచ్చావుగా తలనొప్పి పోతుంది. నువ్వు నా పక్కన వున్నంతసేపు తలనొప్పి రాదు".

"నిజంగానా బావా! అయితే నేను ఎప్పుడూ నీ పక్కనే ఉండిపోతాను".

"పక్కనే ఉండిపోతే ఏం లాభం? ఇలా పక్కలో ఉండిపోవాలి". వెంటనే అపర్ణను తనమీదకు లాక్కొని ఆమె పెదవుల మీద గట్టిగా ముద్దు పెట్టుకున్నాడు సందీప్.

"ఛీ! కొంటె బావా!" మరుక్షణంలో అతన్ని తప్పించుకొని లేచి నిలబడింది.

"అప్పుడే లేచిపోతావా?"

"ఆ మూడుముళ్ళూ వేసెయ్ బావా! ఎప్పుడూ నీ దగ్గరే ఉండిపోతాను".

"నువ్వు అసలు సిసలు భారతీయ బాలికవు అపూ! బయటి ఆధునిక ప్రపంచం గురించి నీకేమీ తెలియనట్టు వుంది"

"అంటే?"

"అమెరికాలో, ఇంగ్లాండ్‌లో, ఫ్రాన్స్‌లో అమ్మాయిలు, అబ్బాయిలు మొదట ప్రేమించుకుని తర్వాత పెళ్ళి చేసుకుంటారు".

"మనమూ ప్రేమించుకున్నాంగా! నా చిన్నప్పటినుంచీ నిన్ను ప్రేమిస్తున్నాను బావా!"

"ఛ! ప్రేమించడమంటే అదికాదు. ఇది".

సందీప్ మళ్ళీ అపర్ణను తనమీదకు లాక్కొని తన గుండెలకు అదుముకొని మెడను ముద్దు పెట్టుకున్నాడు.

"ఏమిటీ సాహసం బావా! ఎవరైనా చూస్తే... పెళ్ళి కాకుండా మనమిలా..." అతన్ని తప్పించుకొని బయటపడటానికి ప్రయత్నించింది.

"పెళ్ళి కాకుండా ఇలా ఉండటమే ప్రేమించుకోవటమంటే... పెళ్ళయ్యాక ఏముంది. అదో సంసారపు బాదరబందీయేగా. నువ్వు నిజంగా నన్ను ప్రేమిస్తున్నావా చెప్పు!"




"నీకోసం నా ప్రాణమయినా ఇస్తాను బావా!"

"అలా అయితే నేనిప్పుడు చేస్తున్న పనికి అభ్యంతరం చెప్పకూడదు". సందీప్ అపర్ణ జాకెట్ హుక్స్ తొలగించ బోయాడు. మరుక్షణంలో లేడిపిల్లలా ఆ పక్కమీంచి చెంగున గెంతింది అపర్ణ.

"పెళ్ళి కాకుండా ఆదేంపని బావా? నువ్వింత కొంటెవాడివనుకోలేదు. అంత తొందరెందుకు బావా? పెళ్ళయ్యాక నేను నీదాన్నేగా!"

"పెళ్ళి కాకపోతే నువ్వు నా దానివి కావన్నమాట...ఇంతకుముందే నీకోసం నా ప్రాణమైనా ఇస్తానన్నావు. లైస్... అందుకే అంటారు అవసరాన్నిబట్టి అబద్ధాలాడటం ఆడదానికి వెన్నతోపెట్టిన విద్య అని"—సందీప్.

"నేనిప్పుడు అబద్ధమాడానా బావా! ఎందుకంత నిర్దాక్షిణ్యంగా మాట్లాడ తావు" — ఉబికివస్తున్న కన్నీళ్ళను ఆపుకోవటానికి ప్రయత్నిస్తూ అపర్ణ.

"ప్రాణమిస్తానన్న దానివి జాకెట్ మీద చెయ్యివేయగానే అలా పరిగెత్తా వేమిటి? సినిమాల్లో విలన్ చేతుల్లో చిక్కుకున్న హీరోయిన్‌లాగా. నేను నిన్నేమీ రేప్ చెయ్యాలని ప్రయత్నించ లేదే...జస్ట్ ఐ వాంటెడ్ సమ్ ఫన్ విత్ యూ. అంత మాత్రానికే అంత బెదిరి పోయావెందుకు? మీ కంట్రీగర్ల్స్‌తో ఇదే సమస్య. మోడరన్ ప్రపంచంతో మీకు సంబంధం లేదు. బూజుపట్టిన సంప్రదాయాలు, బూజుపట్టిన అలవాట్లు, ఒకపక్కన ప్రేమించామంటారు. కానీ పెళ్ళయ్యేదాకా వాడి చెయ్యికూడా తగలొద్దంటారు. ప్రేమించటం అంటే ఇదా? ప్రేమంటే నీకింకా ఎ.బి.సి.డిలు కూడా తెలీదు. నీకంటే నీ కజిన్ ఆ ఉజ్వల బోల్డు ఎడ్వాన్స్‌డ్‌గాకనిపిస్తోంది"—సందీప్.

"కోపమొచ్చిందా బావా! ఈ పిచ్చి దాన్ని క్షమించు బావా...నీ ఇష్టం, నన్ను ఏమయినా చేసుకో బావా".

అపర్ణ సందీప్‌కు దగ్గరగావచ్చి అతని మీదకు వాలిపోబోయింది–

"ఎక్స్‌క్యూజ్ మీ...నేను మిమ్మల్ని డిస్టర్బ్ చెయ్యడం లేదుకదా!"—అప్పుడే ఆ గదిలోకి అడుగుపెట్టిన ఉజ్వల.

"డిస్టర్బ్ చెయ్యటం లేదుకదా అంటూ డిస్టర్బ్ చెయ్యడం సంస్కారం కాబోలు" —అపర్ణ.

"సంస్కారమంటే ఏమిటో తర్వాత నీదగ్గర నింపాదిగా నేర్చుకుంటానుగాని బాబాయిగారు-సందీప్ భోజనం చెయ్య లేదు, ఎక్కడ వున్నాడో చూడమంటే వెతుక్కుంటూ ఇలా వచ్చాను. మీ ఏకాంతానికి భంగం కలిగిస్తాననుకో లేదు"—ఉజ్వల

"టేకిట్ ఈజీ ఉజ్వలా! తలనొప్పిగా ఉంటే కొంచెం రిలాక్సవుదామని పడు కున్నాను. బ్యాండువాళ్ళ చప్పుడు, మైక్‌లో ఎడతెరిపి లేకుండా మ్రోగుతున్న సినిమా సంగీతం, చంటిపిల్లల ఏడుపులు, అమ్మలక్కల కేకలు వీటితో తలనొప్పి వచ్చేసింది. నీలాగే అపూ కూడా నన్ను వెతుక్కుంటూ వచ్చింది"—సందీప్.

"అమృతాంజనం తెమ్మంటావా బావా?"—అపర్ణ.

"అక్కరలేదు. అమృతాంజనంతో నా తలనొప్పి తగ్గదు"—సందీప్.

"మరెలా తగ్గుతుంది?"—అపర్ణ.

"ఒక పెగ్ మాక్‌డొవెల్ విస్కీతో. అది సంపాదించగలవా?"—సందీప్.

"అమ్మబాబోయ్! అయామ్ సారీ! నావల్ల కాదు"—అపర్ణ.

"డోన్ట్‌వర్రీ! ఊరకే అన్నాను. జస్ట్ ఫర్ ఫన్..."—సందీప్.

"బాబాయిగారికి మీరు భోజనానికి రావడంలేదని చెప్పాలా?"—ఉజ్వల.

"కిందకొచ్చి ఆ జనంమధ్య నేను భోంచెయ్యలేను. ఇఫ్ యూ డోన్ట్ మైండ్ ఆ భోజనమేదో ఇక్కడికే తీసుకురండి"

"నేను తెస్తాను బావా!" అపర్ణ గబగబా మెట్లుదిగి కిందవెళ్ళింది.

"పెళ్ళి కాకుండా స్త్రీ పురుషులమధ్య సెక్సువల్ రిలేషన్స్ ఉండకూడదు అనే అభిప్రాయంతో మీరేకభవిస్తారా?"—సందీప్.

"సెక్స్ విషయంలో మన సమాజం పురుషుడికొక నీతిని, స్త్రీకొక నీతిని నిర్ణయించింది పెళ్ళికిముందు పురుషుడికి ఎంతమంది స్త్రీలతో సెక్సు సంబంధాలు వున్నా ఫరవాలేదు. అదే స్త్రీకి అలాంటి సంబంధమున్నట్టే దాన్ని క్షమించరాని నేరంగా ఎందుకు చిత్రించాలి? ఇద్దరు స్త్రీ పురుషులకు ఒకరిమీదొకరికి బలమైన ఆకర్షణ జనించొచ్చు. ఆ ఆకర్షణే వాళ్ళను సెక్సువల్‌గా కలుసుకునేటట్టు చెయ్యొచ్చు. కానీ ఏవో కారణాలవల్ల వాళ్ళకు పెళ్ళి జరక్కపోవచ్చు. అంత మాత్రాన మన సమాజం ఆ స్త్రీ శీలాన్ని కోల్పోయిందని కండెమ్న్ చెయ్యాల్సిన అవసరంలేదు. పురుషుడిలాగే స్త్రీని కూడా గౌరవనీయంగా బతకనీయాలి."

"చాలామంది ఇండియన్ గర్ల్స్‌లా కాకుండా మీరు చాలా ఎడ్వాన్స్‌డ్‌గా ఆలోచిస్తున్నారు. మీరు మీ తరంవారి కన్నా చాలా ముందున్నారు. మిమ్మల్నభినందించకుండా ఉండలేకపోతున్నాను"

"ఎందుకురా ఆమెను కంగ్రాట్యులేట్ చేస్తానంటున్నావు?" అంటూ వచ్చాడు రవికాంత్.

"ఏరా! మీల్స్ చేశావా?"

"అరవ్వాళ్ళ తిండి తినితిని జిహ్వ చచ్చిపోయింది. నీ పుణ్యమా అని రెండు రోజులు తెలుగువాళ్ళ తిండి తింటున్నాను. థ్యాంక్యూ వెరీమచ్".

"అది సరేగాని మీరీరోజు మీ పాటలు వినిపించాలి రవికాంత్‌గారు"—ఉజ్వల.

"నాకు నేను పాడుకోవటమేగాని వేరేవాళ్ళకు వినిపించడం నాకలవాటు లేదండి"—రవికాంత్.

"మనలో వున్న టాలెంట్‌ను పదిమందికి ఉపయోగపడేలా వినియోగించుకున్నప్పుడే మన టాలెంటుకొక సార్థకత" —ఉజ్వల.

"మీరనేది నిజమేగానీ, నాకసలే సిగ్గు. పదిమంది ముందు నేను పాడలేను. ఇదివరకు రెండు మూడు సార్లు ప్రయత్నించి ఫెయిలయ్యాను"— రవికాంత్.

"మీ సిగ్గును నేను పోగొడ్తాను. రాత్రి సైగల్ పాటను ఎంతద్భుతంగా పాడారండీ! మళ్ళీ ఆ సైగలే దిగొచ్చి పాడుతున్నాడా అనిపించింది"—ఉజ్వల.

"ఇంత కాలానికి సైగల్ పాటల్ని మెచ్చుకున్నవారు మీరు కన్పించారు. వీడెప్పుడూ అంత హెవీ స్టఫ్ వద్దురా లైట్‌గా ఏదన్నా పాడ మంటాడు. కానీ నాకు సైగల్ పాటలంటే ప్రాణం" —రవికాంత్.

"నాక్కూడా! రోజూ మూడు నిమిషాలు తక్కువ ఎనిమిదింటికి రేడియో సిలోన్ తప్పకుండా వింటాను. సైగల్ పాటకోసం."— ఉజ్వల

"ఈ జనరేషన్ వాళ్ళల్లో సైగల్ అభిమానుల్ని మీ ఇద్దర్నే చూశాను. ఇంతకు ముందే మీతో చెప్పిన నా అభిప్రాయాన్ని మార్చుకోవాల్సి వస్తుంది"— సందీప్.

"నిరభ్యంతరంగా మార్చుకోండి. ఈ రోజు అందరూ భోజనాలు చేశాక మీ పాట కచేరీ అరేంజ్ చేద్దాం మా కజిన్ సిస్టర్ సారిక కూడా బాగా పాడుతుంది"— ఉజ్వల.

"ఉజ్వల గారి ధోరణి చూస్తుంటే నీ కిక్కడ పెద్ద సన్మాన సభ ఏర్పాటు చేయించేలా ఉంది. నిన్నసలు మద్రాసు వెళ్ళి పోకుండాఇక్కడే ఉండి పొమ్మంటుందేమో!" —సందీప్.

"వారుండి పోతానంటే అది తెలుగు వాళ్ళ అదృష్టంగా భావించాలి"—ఉజ్వల.

"మీ అదృష్టంగా భావించరా?"— సందీప్

"సమాజపరంగా తప్ప వ్యక్తిపరంగా నేనెప్పుడూ ఆలోచించను"— ఉజ్వల.

"ట్రూ రెవల్యూషనరీ!" —సందీప్ కంఠంలో వెటకారం ధ్వనించింది.

తను రవికాంత్‌కు దగ్గరౌతున్నానని సందీప్‌కు ఈర్ష్యగా ఉందని ఉజ్వల గ్రహించింది. "మీ పొగడ్తలు నాకక్కర లేదు" —ఉజ్వల.

"అదికూడా ట్రూ రెవల్యూషనరీ లక్షణమనుకుంటాను"— సందీప్.

"మీలాంటి వాళ్ళకు రెవల్యూషనరీ లక్షణాలు తెలియటం విశేషమే!"

ఉజ్వల.

"భోజనం చేసెయ్యండి బావా!" అంటూ పనిమనిషితో భోజనం పెట్టించు కొని వచ్చిందక్కడకు అపర్ణ, అపర్ణతో పాటు సారిక కూడా వచ్చింది.

"అక్కయ్యా ! నువ్వింకా భోజనం చెయ్యలేదుట. ఆడవాళ్ళంతా భోజనాలకు కూర్చుంటున్నారు. నిన్ను తీసుకు రమ్మన్నారు" అంది సారిక.

"సారికంటే ఇదే! చాలా బాగా పాడుతుంది. సంగీతం కూడా నేర్చు తుంది. అప్పుడప్పుడూ కచ్చేరీల్లో కూడా పాల్గొంటుంది" ఉజ్వల సారికను రవి కాంత్‌కు పరిచయం చేసింది.

"గ్లాడ్ టు మీట్ యూ" అన్నాడు రవికాంత్.

"మీరెంత బాగా పాడ్తారండీ!"— సారిక.

"ఇంతసేపు పొగడటం అక్కయ్య వంతైంది. ఇక చెల్లెలు వంతు... —" సందీప్.

"మీరూ బాగా పాడ్తారని విన్నాను" —రవికాంత్.

"మీ అంత బాగా పాడలేను."

"మీ ఇద్దరికీ సంగీతంపోటీ ఏర్పాటు చేస్తాం. ఓడిపోయిన వాళ్ళు గెలిచిన వాళ్ళను పెళ్ళి చేసుకోవాలి సరేనా?"— సందీప్ సారికను సూటిగా చూస్తూ అన్నాడు. సారిక నిలువెల్లా పులకించి పోయింది.

"డోన్ట్‌బీ సిల్లీ దీపూ!"--రవికాంత్.

"కమాన్ బావా! అన్నీ వడ్డించాను. భోంచెయ్యండి!"—అపర్ణ

"మేమూ భోజనానికెడ్తున్నాము. భోజనాలయ్యాక మీ పాటల ప్రోగ్రాం ఉంటుంది. మరచి పోవద్దు"— ఉజ్వల.

"నిజంగానా అక్కయ్యా! రవికాంత్ గారు పాడతారా!"—సారిక.

"ఔను!" ఉజ్వల.

"సారిక కూడా పాడతానంటేనే నేనూ పాడతాను"—రవికాంత్.

"అమ్మబాబోయ్! మీ పాటలు విన్నాక జనం నా పాటలు వింటారా? మీదెంత గొప్ప కంఠమండీ! నిజంగా నాకు అసూయగా ఉంది" —సారిక.

"నీతో పదేళ్ళు ఫ్రెండ్‌షిప్ చేస్తున్నా ఆడ పిల్లలు నువ్వంటే ఇంత పడి చస్తారని ఈ రోజే తెలుసుకున్నానురా! మద్రాసులో అయితే వీడి గడ్డాలు, మీసాలు చూసి ఏ ఆడపిల్లా వీడి దరి దాపుల్లోకి వచ్చేదికాదు."— సందీప్

"నిజంగా బావా ! మీ ఫ్రెండ్‌ను చూసినప్పుడు నేను కూడా భయపడి పోయాను. ఈ సాధువుగారెవరు ? మా ఇంట్లో కొస్తున్నాడెందుకు? అను కున్నాను"—అపర్ణ.

"ఉజ్వలా ! సారికా! త్వరగా భోజ నాలకు రండే !" కిందనుంచి రత్నమ్మ కేక వినిపించడంతో ఉజ్వల, సారిక కిందకు దిగారు.

కొందరు మనుషుల మనస్తత్వాన్ని చదవటం ఎంత కష్టం? ఎంతో అందంగా, ఎంతో సంస్కారవంతుడిగా కనిపించే సందీప్‌లో ఎంత ఈర్ష్య! అందరూ తననే పొగడాలి. అందరూ తన చుట్టే తిర గాలి. ఎంతో వికారంగా కన్పించే రవి కాంత్ ఎంతో సంస్కారవంతంగా కన్పి స్తున్నాడు. సందీప్‌ను తను ఎంత తప్పుగా అంచనా వేసిందో! అతనో మాట్లాడాలని, అతనికి దగ్గర కావాలని




ప్రయత్నం చేసింది. తనను తను ఎంత కంట్రోల్ చేసుకోవాలని ప్రయత్నించినా తనూ ఒక్కోసారి చాలామంది ఆడపిల్లల్లాగే పై మెరుగులు చూసి భ్రమ పడిపోతుంది. సందీప్‌లాంటి సంస్కార హీనుడికి దగ్గర కావాలని ప్రయత్నించినందుకు తనను తను క్షమించుకోలేననిపించింది ఉజ్వలకు.

"సందీప్ చూడటానికంత అందంగా ఉంటాడుగాని చాలా మొరటుగా మాట్లాడుతాడు కదక్కయ్యా!"

ఉజ్వల ఉలిక్కిపడింది. సారిక కూడా సందీప్‌ను గురించే ఆలోచిస్తోందా?

"ఔను!"

"అతనికంటే ఆ రవికాంతే ఎంతో సంస్కారవంతుడిలా కన్పిస్తున్నాడు కదక్కయ్యా!"

"ఔను!"

"ఎంత బాగా పాడతాడు! ఎంత బాగా బొమ్మలు గీస్తాడు. అతని అణువణువులోనూ ఆర్టే! ఐ రియల్లీ లవ్ హిమ్!" అంది సారిక తనను తాను మరిచిపోయి.

సారిక కేసి తీక్షణంగా చూసింది ఉజ్వల. "రేపీపాటికి అతడెక్కడో మనమెక్కడో! మళ్ళీ మనం జన్మలో మరోసారి కలుసుకోకపోవచ్చు! ఇంతలోనే మన మనసుల్నిలా పారేసుకోవాలా?"

ఉజ్వలకు తన మాటలు తనకే ఆశ్చర్యంగా ధ్వనించాయి. ఆ మాటలు తను సారికకు చెప్పిందా? లేక తనకు తానే చెప్పుకుందా?

ఎలాగైనా ఒకసారి ఉజ్వలతో ఏకాంతంగా మాట్లాడితే బావుండును అనుకున్నాడు రవికాంత్ మేడమీదినించి కిందకు చూస్తూ.

అప్పుడే భోజనాలు చేసి బయట కొస్తున్న ఆడవాళ్ళ గుంపులో ఉజ్వలను చూశాడు. ఎవరో మహాశిల్పి మలచిన పాలరాతి బొమ్మలా ఉంటుంది ఉజ్వల. ఉజ్వల సౌందర్యాన్ని ఓ తైలవర్ణ చిత్రంగా మలచే అదృష్టం తనకు దక్కితే? ఉజ్వలకు తన పాటలు నచ్చాయి... ఉజ్వల పాడమంటే ఎప్పుడూ పాడుతూ ఉండిపోవాలనిపిస్తుంది... తన గొంతులో శక్తి ఉన్నంతవరకు పాడుతూనే ఉండిపోవాలనిపిస్తుంది... ఉజ్వల తన పక్కనుంటే?... ఉజ్వల తన జీవితంలో ప్రవేశిస్తే? తన జీవితంలో ఎంత వెలుగు! ఎంత బలం! ఎంత ఆత్మవిశ్వాసం! కానీ ఉజ్వలెక్కడ? తనెక్కడ? తనకేమయ్యింది? తనెందుకిలా ఆలోచిస్తున్నాడు? కొన్ని గంటల్లో ఎక్కడివాళ్ళమక్కడకు విడిపోతాము...కానీ...కానీ ఈ మనస్సు నిలవదు... అదిగో ఉజ్వల తనకేసే చూస్తోంది... తనను కిందకు రమ్మన్నట్టుగా చూస్తోంది...ఆమెనిజంగా అలా చూసిందా? లేక తనే అలా ఊహించుకున్నాడా? అదిగో...ఉజ్వల మళ్ళీ తనకేసి చూసింది.

రవికాంత్ గబాగబా మెట్లుదిగి కింద కొచ్చాడు-తను కిందకు రావటం చూసిన ఉజ్వల ఆడవాళ్ళ గుంపులోంచి బయటకొచ్చింది-

"యేమండి! భోజనమైందా?" —రవికాంత్.

"ఆc! అయిపోయింది.."—ఉజ్వల.

"కాస్సేపలా దూరంగా వెళ్ళి కూర్చుందాం రండి... ఎందుకో మీతో

ఏకాంతంగా మాట్లాడాలని పిస్తోంది—"
—రవికాంత్.

"ఎందుకో తెలియదా ?" అంది ఉజ్వల 'ఎందుకో' అన్నమాటను ఎత్తి పలుకుతూ.

"ఈ 'ఎందుకో' అనేమాటను మనం ఎందుకో పదేపదే యూజ్ చేస్తుంటాం.. మనకు మనకే అస్పష్టంగా ఉండే భావాన్ని వ్యక్తం చెయ్యటానికనుకుంటాను"—రవికాంత్.

ఇద్దరూ వెళ్ళి షామియానా చివరి భాగంలో ఖాళీ కుర్చీల్లో కూర్చున్నారు-

"చెప్పండి... కాదు... ఓ మంచి పాట పాడండి..." —ఉజ్వల.

"మీరు పాడమంటే ఎన్ని పాటలైనా పాడతాను..." —రవికాంత్

"నేను పాడమంటేనే పాడ్తారా ? నాలో ప్రత్యేకత ఏమిటి ?" —ఉజ్వల.

"అదే చెప్పలేను... మీతో ఎంతో చెప్పాలనుకున్నాను. కానీ ఏమీ చెప్పలేక పోతున్నాను" —రవికాంత్.

"ఎందుచేత ?" —ఉజ్వల.

"భయం కావచ్చు...లేక..."

"నేనంత భయంకరంగా ఉన్నానా?"

"నో నో... నన్ను మీరు సరిగ్గా అర్థం చేసుకోలేదు..."

"ఇంకా నయం... 'నన్ను మీరు అపార్థం చేసుకున్నారు' అని చాలా బరువుగా అంటారేమోనని భయపడ్డాను..."

"మనస్సు మారుమూలల్లో మెదిలే కొన్ని అనుభూతుల పరంపరల్ని భాషలోకి అనువదించటం ఎంత కష్టం."

"ఇంత చక్కని తెలుగు మాట్లాడుతున్నారు ! మీకే అంతకష్టమైతే భాష అంతగా రాని మాలాంటి వాళ్ళ గతేమిటి ?"

"మీకు భాష అంతగా రాదా ? ఏభాష ?"

"తెలుగు భాషే !"

"మీకు తెలుగు భాష రాకపోవటమేమిటి ?"

ఇద్దరి మధ్య క్షణం సేపు నిశ్శబ్దం-

"మీరేదో చెబుతానన్నారు..."
—ఉజ్వల.

"ఔను...మరచేపోయాను" —రవికాంత్.

"అప్పుడే మరచి పోయారా ?"

"ఏం చెప్పాలో మరచి పోలేదు... కాని ఎలా చెప్పాలో మరచిపోయాను.."

"మీలాంటి ఆర్టిస్టులు ఇలా మరచి పోతే ఎలా ?"

"ఆర్టిస్టులు మాత్రం మనుష్యులు కారంటారా ?"

"మనుష్యుల కంటె ఎక్కువ. అందుకే మామూలో మనుష్యుల్లో ఉండే మరుపు ఆర్టిస్టుల్లో కూడా ఉంటుందా అని ఆశ్చర్యపడ్డాను."

"మీ రొకసారి మా మద్రాసు రాకూడదూ ?"

"ఎందుకూ ?"

"ఆ ప్రశ్నకు స్పష్టమైన సమాధానం చెప్పగల్గితే మీతో ఇంతసేపు ఇంత సంభాషణ అవసరమయ్యేది కాదనుకుంటాను..."

ఇద్దరి మధ్య మళ్ళీ కొన్నిక్షణాలు నిశ్శబ్దం—

"వస్తాను" - కాస్సేపు ఆలోచించాక ఉజ్వల.

"నిజంగా వస్తారా ?"




"మీరు నిజంగా రమ్మంటున్నారా"

"నిజంగా... నాలోని అణువణువూ మిమ్మల్ని రమ్మని ఆహ్వానిస్తోంది..."

"నేనూ నిజంగానే వస్తానంటున్నాను. ఈ క్షణంలో మీరు నిజంగా రమ్మంటున్నారు... నాకూ నిజంగానే రావాలనిపిస్తోంది... కానీ ఈ క్షణం ఎప్పుడూ ఉండదుగా! ఈ క్షణంలో ఇప్పటి మన ఆలోచనలు కూడా మరుక్షణంలో ఇలాగే ఉంటాయని నమ్మకమేముంది ?"

"మీరు చాలా విచిత్రంగా మాట్లాడుతున్నారు."

"నేను విచిత్రంగా మాట్లాడటం కాదు... ఈ జీవితం... ఈ ఫీలింగ్స్.. ఈ మనసులు... ఈ క్షణాలు... ఇవన్నీ చాలా విచిత్రమైనవి..."

"మీరుచెప్పేది నిజమేనేమో! మీలాంటి గ్రేట్ లేడీతో పరిచయం చేసుకునే అవకాశం కల్పించిన మా సందీప్‌ను థాంక్ చెయ్యకుండా ఉండలేను"

"నాలో గొప్పతనం ఏమీ లేదు......మీ ఫ్రెండ్ సందీప్‌ను గూర్చి మీ అభిప్రాయం ?"

"మనుషుల్ని అర్థం చేసుకోవటంలో నేనంత సమర్థుణ్ని కాదు—మీ అభిప్రాయం చెప్పండి-వింటాను"



"మీ క్లోజ్ ఫ్రెండ్‌ను గూర్చి మీరే చెప్పలేకపోతే కొన్ని గంటల పరిచయంతో అతన్ని గూర్చి నేనెలా చెప్పగలను..."

"మీలాంటి బ్రిలియెంట్ పీపుల్‌కు అదేమంత అసాధ్యంకాదు."

"నన్ను మీరు మరీ పొగిడేస్తున్నారు..."

"పచ్చి యథార్థం! పొగడ్తలా ధ్వనిస్తే నేనేం చెయ్యను?"

"ఇంతకూ మీ ఫ్రెండ్‌ను గూర్చి యేమీ చెప్పనే లేదు..."

"చెప్పటానికేముంది ... వాడిలో స్వాతిశయం కొంచెం ఎక్కువే... వాడు అందంగా ఉంటాడు... నో డౌట్ ఎబౌటిట్ ... అందుకని అందమైన ఆడపిల్లలంతా తనంటే పడిచస్తారని వాడి నమ్మకం. అఫ్‌కోర్స్ ... కొందరు ఆడపిల్లలు వాడికానమ్మకాన్ని కల్గించారనుకోండి..."

"అంటే..."

"మద్రాసులో ఇద్దరు ముగ్గురమ్మాయిలు ఎప్పుడూ వాడిచుట్టూ తిరుగుతుంటారు... పెద్ద కంపెనీలో ఉద్యోగం.. అందగాడు... తెలివిగా మాట్లాడగలడు కాబట్టి ఆడ పిల్లలు వాడిచుట్టూ తిరగటంలో ఆశ్చర్యం లేదనుకుంటాను..."

"కరెక్ట్... కాని మీ ఫ్రెండ్‌లో అసూయ కూడా కొంచెం ఎక్కువేననుకుంటాను..."

"ఔను... చిన్నప్పట్నించి వాడలా పెరిగాడు... ఎప్పుడూ వాడే రంగం మీదుండాలి... అందరూ వాడిచుట్టే మూగాలి... అందరూ వాడినే పొగడాలి ముఖ్యంగా ఆడపిల్లలు. వాడి స్థానాన్ని మరెవరో ఆక్రమించుకుంటున్నారన్న ఫీలింగ్‌ను వాడు సహించలేడు..."

"ఐ రియల్లీ హేట్ సచ్ ఫెల్లోస్"

"ఏమిటే అక్కయ్యా ... ఎవర్నీ హేట్ చేస్తానంటున్నావు?" అంటూ వచ్చింది సారిక.

"నిన్నుమాత్రం కాదే" అంది ఉజ్వల.

అకస్మాత్తుగా ఈ అమ్మాయి ఇక్కడ కెందుకొచ్చింది? ఇంకాస్సేపు తనను ఉజ్వలతో మాట్లాడుకోనిస్తే ఎంత బావుండును?

"మరెవర్నే?"—సారిక.

"హేట్ చెయ్యటానికి ఈ ప్రపంచంలో చాలా ఉన్నాయిలే... అందరూ భోజనాలు చేసేశారా?"—ఉజ్వల.

"ఆఁ! ఇంకా చేస్తూనే ఉన్నారు. ఇంతకు ముందు మన పెళ్ళివాళ్ళు భోజనాలు చేస్తున్నప్పుడు పెద్ద గొడవ అయిందట తెలుసా?"—సారిక.

"ఏమిటే అది? ఎవరైనా అలిగారా యేమిటి?"—ఉజ్వల.

"ఔనక్కయ్యా! నెయ్యి వాసనేస్తోందని పెళ్ళికొడుకుగారి బావగారు బంతిమీదినుంచి లేచిపోయారట...ఆయన లేచాడని ఆయన్తో పాటు కూర్చున్న మిగతావాళ్ళంతా లేచారుట...అది తెలిసి పెదనాన్నగారెళ్ళి అందర్నీ బతిమాలి మళ్ళీ కూర్చొబెట్టారట. ఆలోపలే మా వారికి వాసననెయ్యి పోశారని ఆయన భార్య సుజాత ... పెళ్ళికొడుకుగారి అక్కయ్య అలిగింది. నేను భోజనం చెయ్యనని విడిదిలో కెళ్ళి పడకేసింది. మా అమ్మా, పెద్దమ్మా వెళ్ళి ఆమెనో గంటసేపు బతిమాలి భోజనానికి తీసుకొచ్చారు..."—సారిక.

"మీళ్ళు వెళ్ళేలోగా ఇంకా ఎన్నిసార్లు బతిమాలించుకుంటారో !..."—ఉజ్వల.

"అది సరేగాని రవికాంత్‌గారూ! మీ రెప్పుడు మీ పాటలు వినిపిస్తారు...!" —సారిక.

"మీరు మీ పాటలు వినిపించాకి నేను నా పాటలు వినిపిస్తాను..." ...రవికాంత్.

"నెక్ట్స్ ప్రోగ్రాం మీపాటకే పదండి" —ఉజ్వల.

ముగ్గురూ లేచారు.



## 14

ఇంతసేపటిగ్గాని అతన్ని స్పష్టంగా చూసే అవకాశం కలగలేదు. వినయ్‌కు ఇతనికి ఎంత తేడా! ఇతడు ఎత్తుగా, లావుగా, గంభీరంగా, మొరటుగా ఇతడు, పక్కనుంటే మన కేమీ భయం లేదన్నట్టుగా... వినయ్ సున్నితంగా, సన్నగా, తెల్లగా, పసి పిల్లాడిలా అతనికే మన రక్షణ అవసర మౌతుందన్నట్టుగా! విశాలమైన నుదురు, ఎదుటి వ్యక్తిని సూటిగా చూస్తూ ఆత్మ విశ్వాసంతో తొణికిసలాడే పెద్దకళ్ళు, అతనికి కళ్ళద్దాలు లేవు. కళ్ళద్దా లున్నాయా లేవా? అని గుర్తు తెచ్చుకో డానికి తన బుర్ర ఎంత స్ట్రగులైందో! నల్లగా, గుబురుగా పెరిగిన మీసాలు... అబ్బ! అంతేంత మీసాలెందుకు పెంచాడో? కానీ ఆ మీసాలే అతనికా గంభీరతను, మొరటుతనంతో కూడిన ఒక విచిత్ర మైన ఆకర్షణను ఆపాదిస్తున్నాయి. వినయ్ మొఖంమీద తను మీసాలెన్నడూ చూడ లేదు. వినయ్ ఈ పెళ్ళి కొచ్చాడని చెప్పింది అపర్ణ. ఎక్కడా కన్పించ దేం? ఏమైపోయాడు? అప్పుడే వెళ్ళిపోయాడా? అతడున్నా, వెళ్ళిపోయినా, ఏమైపోయినా అతడితో తనకిక సంబంధం లేదు. ఇక నుండి ఇతడితోనే తన సంబంధమంతా! ఇతడే తన ప్రపంచం: తన సర్వస్వం, తన కలలు, కన్నీళ్ళు, తన బాధలు, గాథలు అన్నీ ఇతడే.

అందరూ భోజనాలు చేస్తున్నారు. ఎవరి పనుల్లో వాళ్ళు మునిగిపోయారు. తామిద్దరే ఒంటరిగా. అతడు అతని ఫ్రెండ్సందరినీ తనకుపరిచయంచేశాడు. తనుతనఫ్రెండ్సందరినీ అతనికిపరిచయం చేసింది. వాళ్ళలో కొందరు తమఫోటోలు తీశారు కొందరు ఏవేవో ప్రజంటేషన్స్ ఇచ్చారు. అందరూ వెళ్ళిపోయి తామిద్దరే కాసేపు ఏకాంతంగా గడపగల్గితే ఎంత బావుండును! అతడెప్పుడూ తననే చూస్తు న్నాడు. ఆ కళ్ళలో ఎంత ఆరాధన! ఎంత అనురాగం! ఎంత ఆత్రుత' చుట్టు పక్కలెవరూ లేకపోతే ఏం చేసేవాడో?

"ఏమిటి ఆలోచిస్తున్నావు?" అతడు మాట్లాడాడు. ఔను! చుట్టుపక్కలెవరూ లేరు. అతడు తననే అడుగుతున్నాడు.

"ఏమిటి ఆలోచిస్తున్నావు ?" కిశోర్ రెట్టించాడు.

"ఏమీలేదు"

"అమ్మయ్య! ఎంత సేపటికి మనిద్దర్నీ ఇలా వదిలేశారు. ఇలాంటి అవకాశం దొరగ్గానే నిన్ను నేనో ప్రశ్న అడగా లనుకున్నాను"—కిశోర్.

"ఏమిటది ?"

"నేను నీకు నచ్చానా ?"

ఇప్పుడా అడగటం. నచ్చలేదంటే ఏం చేస్తాడో ? తనలో తను నవ్వుకొంది అరుంధతి.

"నిజం చెప్పాలి. నేను నీకు నచ్చానా?" రెట్టించాడు.

"నేను మీకు నచ్చానా?"

"నచ్చకపోతే నిన్ను చేసుకుంటానా?"

"నా సమాధానం కూడా అదే!"

"ప్రశ్నా సమాధానం రెండూ నాచేత చెప్పించావన్నమాట. చాలా అమాయకురాలివనుకున్నాను. కానీ చాలా తెలివైనదానివే"

"పెళ్ళికొడుకుగారూ! పెళ్ళికూతురు గారూ! ఇద్దరికీ భోజనాలు పెట్టారు. రమ్మంటున్నారు"—అపర్ణ.

"నువ్వెప్పుడు పిలుస్తావా అని చూస్తున్నాను. మీ అక్కయ్య సంగతి తెలియదుగాని నాకు మాత్రం ఆకలి దంచేస్తోంది"—కిశోర్.

"మిమ్మల్ని చూసినప్పటినుంచి మిమ్మల్ని పెళ్ళి చేసుకునేవరకూ నిద్ర, ఆహారం, నీళ్ళు తనకక్కర్లేదంది మా అక్కయ్య. కన్ను మూసినా, తెరిచినా మా అక్కయ్యకు మీ రూపమే గుర్తు వచ్చేది"—అపర్ణ.

"నిజంగా !" అన్నాడు కిశోర్ ఆనందంతో నిండిన ఆసక్తితో.

"నిజం బావగారూ! 'లవ్ ఎట్ ఫస్ట్ సైట్!' మా అక్కయ్య మిమ్మల్ని చూడగానే ప్రేమించేసింది" — అపర్ణ.

కిశోర్ హాయిగా నవ్వాడు.

"అపర్ణా కాస్త నోరు మూస్తావా?"—





అరుంధతి.

"బావగారూ! మా అక్కయ్య మాట మాటకీ నన్ను నోరు ముయ్యమంటుంది. ఈ దేశంలో ప్రస్తుతం ఎమర్జెన్సీ ఏం లేదుగా! వాక్ స్వాతంత్ర్యం ఉందా? లేదా? మీరే చెప్పాలి"—అపర్ణ.

"హార్టీకంగ్రాచ్యులేషన్స్ అరుంధతీ!"

అరుంధతి ఉలిక్కిపడి చూసింది. వెనుకనుండి వినయ్! కొన్ని క్షణాల వరకు అతనికేం జవాబు చెప్పాలో తెలీలేదు.

"యూ ఆర్ టూ లేట్ మామయ్యా! కంగ్రాచ్యులేషన్స్, ప్రజంటేషన్స్ అన్నీ ఎప్పుడో అయిపోయాయి. ప్రస్తుతం భోజనాల ఘట్టంలో ఉన్నాము. నువ్వు ఎప్పుడూ లేటే మామయ్యా! ఇంత స్లోగా వుంటే....ప్రపంచం చాలా వేగంగా వెళ్ళిపోతుంది. బైదిబై నిన్ను పెళ్ళి కొడుక్కి పరిచయం చెయ్యలేదుకదూ! వీరు మా మామయ్యగారు. ప్రస్తుతం యం. ఏ. ఫిలాసఫీ ఫైనల్ ఇయర్‌లో ఉన్నారు. వీరు మంచి కవిత్వం కూడా రాస్తారు"—అపర్ణ.

"అన్నీ బాగానే ఉన్నాయిగాని వారి పేరు చెప్పటం మరిచిపోయావు అపర్ణా!" —కిశోర్.

"వారిపేరా! వారినిచూస్తే తెలియటం లేదూ?"—అపర్ణ.

"కొంపదీసి మీపేరు వినయ్‌కుమార్ కాదుగదా?"—కిశోర్.

"మీరన్నది నిజమే బావగారూ! వెంటనే మీతో షేక్‌హాండ్ తీసుకోవాలసి ఉంది. కానీ....ఏం లాభం? మీరు మగవాళ్ళు.—.నేను ఆడదాన్ని అయిపోయాము"—అపర్ణ. కిశోర్ గొల్లున నవ్వాడు.

"నువ్వు నాకు నచ్చావు అపర్ణా!"—కిశోర్.

"అప్పుడే అంత ప్రమాదం జరిగిపోయిందా బావగారూ! మీకు అక్కయ్య నచ్చింది. అది చాలు. కొంత కాలంవరకు మీకెవరూ నచ్చకూడదు. ముఖ్యంగా ఆడపిల్లలు"—అపర్ణ.

"కొంతకాలం తర్వాతైతే ఫరవా లేదంటావా?"—కిశోర్.

"పొరపాటు. కొంతకాలం తర్వాత కూడా వద్దు. ఇదేమిటి? భోజనాలకని లేచి అలాగే నిల్చున్నాము. పదండి బావగారూ! అప్పుడే ఆకలి దంచేస్తుంది అన్నారు. కాస్సేపాగితే మనల్నందర్నీ తినేస్తాడు"—అపర్ణ.

"అపర్ణా! పెళ్ళికొడుకును, పెళ్ళి కూతురును పిల్చుకురమ్మంటే కబుర్లు చెబుతూ కూర్చున్నావా?"—రత్నమ్మ కేకేసింది.

"వస్తున్నా పిన్నీ! త్వరగా వచ్చేయండి" అంటూ అపర్ణ ఇంట్లోకి పరుగెత్తింది.

"మీరు భోజనం చేశారా?" అన్నాడు కిశోర్ వినయ్‌తో.

"చేశాను. థ్యాంక్స్"

"స్సారీ! మీ కవిత్వం నేనేమీ చదవలేదు"

"ఫరవాలేదు. నేను కవిత్వం రాసేది ఎవరో చదువుతారని కాదు. నా గుండెల భారాన్ని తీర్చుకోవడానికి"

"ఓహో అలాగా! భోజనం చేసొచ్చాక తీరిగ్గా మాట్లాడుకుందాం".

"అంతవరకు నేనుండను. వెళ్ళిపోతున్నా".

"అప్పుడే వెళ్ళిపోతారా?"

"పెళ్ళయిపోయిందిగా! అరుంధతిని పెళ్ళికూతురుగా చూడాలనుకున్నాను. చూశాను. వెళ్ళేముందు మీతో ఒక్క మాట".

అరుంధతి గుండెలు భయంకరంగా కొట్టుకున్నాయి. శక్తినంతా కూడదీసుకొని వాటినదుపులో పెట్టుకోవడానికి ప్రయత్నించింది.

"నా పేరు వినయ్‌కుమార్ అని మీరు ఎలా తెలుసుకున్నారు?"

ఎవరికీ తెలియకుండా అరుంధతి ఒక దీర్ఘమైన నిట్టూర్పు వదిలింది. కిశోర్ గలగలా నవ్వాడు.

"మీ రూపాన్ని చూసి ఊరికే తమాషాకన్నాను. దాన్ని సీరియస్‌గా దీసుకోకండి. మీకేమన్నా బాధకలిగించి వుంటే క్షమించండి".

"నాటెటాల్...మిమ్మల్ని చూశాక, మీతో మాట్లాడాక నాకు చాలా హేపీగా ఉంది".

"ఎందుకు ?"

"మీరు మా అరుంధతిని సుఖపెడతారన్న నమ్మకం కలిగింది".

"ఈజిట్ ! రాక్షసుడిలా కనిపించే నామీద మీకంత నమ్మకమెలా కల్గింది?" కిశోర్ గలగలా నవ్వుతూ అన్నాడు.

"అదంతే! దాన్ని ఎక్స్‌ప్లెయిన్ చెయ్యమని నన్ను అడక్కండి... వస్తాను...గుడ్‌బై!" వినయ్ అరుంధతి కేసి చూస్తూ వెనక్కి తిరిగి వెళ్ళి పోయాడు.

"ఇంటరెస్టింగ్ ఫెలో!" —కిశోర్.

"బోర్!"-అరుంధతి ఎంతో రిలీఫ్‌ను వ్యక్తం చేస్తూ.

"ఎందుకు పాపం అతన్నంత మాట అనేశావు ?"

"ఏమో ! ఊరికే అన్నాను."

"అతనంత సేపు మనతో మాట్లాడితే నువ్వతనితో ఒక్క మాటన్నా మాట్లాడ లేదేమిటి ?"

"ఏముంది మాట్లాడడానికి? అంతా అయిపోయాక !" ఆబ్సెంట్ మైండెడ్‌గా అనేసింది.

"ఏమిటి అయిపోయింది ?"

"మన పెళ్ళి!" వెంటనే నవ్వింది. అరుంధతి.

"ఓ ! అదా !" మళ్ళీ పెద్దగా నవ్వాడు కిశోర్.

అతని నవ్వు తనకు హాయిగా ఉంది. అతని నవ్వులో ఎంత మగతనం! వినయ్ ఒక్కసారైనా అలా నవ్వగలడా ? ఎప్పుడూ ఏడుస్తూ ఉంటాడు. ఎప్పుడూ ఏదో ఫిలాసఫీ మాట్లాడుతూ ఉంటాడు. వచ్చిందల్లా తమ మేలుకే నన్నట్టు వినయ్‌తో తన పెళ్ళి జరక్కపోవటమే మంచిదయింది. ఎప్పుడూ ఏదో ఆలోచిస్తూ, మూడీగా, మొరోజ్‌గా ఈ ప్రపంచం ఎందుకు? మనమెందుకు? ఈ తిండి తినటమేమిటి ? పెళ్ళి చేసుకోవటమేమిటి? ఈ రోగాలేమిటి? అంటూ మధనపడ్తూ ఎప్పుడూ ఏదో రాస్తూ తననెంత బోర్ చేసేవాడో ! నవ్వటం తెలీదు. నవ్వించటం తెలీదు. ఓ సరదా లేదు. సాంగత్యం లేదు. తనలో తను జీవించటం తప్ప కలిసి జీవించటం తెలీదు. కానీ కిశోర్! ఎంత లౌలీమ్యాన్! అతనితో తన జీవితం తప్పని సరిగా సుఖవంత మౌతుంది.

పెళ్ళికొడుకు పక్కన కూర్చొని





చాలా రోజుల తర్వాత కడుపునిండా భోజనం చేసింది అరుంధతి.

రవికాంత్ 'బాబుల్ మొరా...' అన్న పాట మొదలు పెట్టాడు. అతని చుట్టూ ఉజ్వల, సారిక, సందీప్, అపర్ణ, సుధీర్, అనల, ఉమ, అరుంధతి పెళ్ళి కొచ్చిన కిశోర్ ఫ్రెండ్సు, అరుంధతి ఫ్రెండ్స్ కూర్చున్నారు. రవికాంత్ పాట పూర్తి చెయ్యగానే అందరూ చప్పట్లు కొట్టారు.

"సుపర్బ్! చాలా అద్భుతంగా పాడారండి!" అంది ఉజ్వల.

"ఆ సైగల్ కంటే మీరే బాగా పాడారండి!" అన్నాడు సుధీర్.

"పొగడ్త కొంచెం ఎక్కువైంది బావగారూ!" —అనల.

"కొంచెం ఎక్కువ ఫరవాలేదన్నార్లే! దయచేసి ఇంకోటి!"—కిశోర్.

"సైగల్ పాటలు నువ్వెప్పుడన్నా విన్నావురా సుధీర్? ఇవ్వాళ్టి వరకు సైగల్ అనేవాడొకడున్నాడని నీకు తెలుసా?" అని —సందీప్.

"సైగల్ తెలియక పోవటమేమి ఉన్నయ్యా! ఈ మధ్యనే అమెరికాలో హత్య చేశారు అతడేగా!" —సుధీర్.

అందరూ గొల్లున నవ్వారు.

"అయ్యో బావా! ఎందుకనవసరంగా భ్రమపడి పోతావు. మొన్న అమెరికాలో చంపింది ఎవర్నో. సైగల్ నువ్వూ, నేను పుట్టకముందే ఇండియాలోనే చనిపోయాడులే!" —అనల.

"ఒక మంచి ముఖేష్ పాట పాడండి రవికాంత్‌గారూ!" —సుధీర్.

"నీకు నచ్చిన ముఖేష్ పాటొకటి చెప్పరా చూద్దాం' —సందీప్.

"నాకు అన్నిటికంటే బాగా నచ్చిన పాట 'రూప్ తేరా మస్తానా... ప్యార్ మేరా దీవానా!" కొంచెం పాడి వినిపించాడు సుధీర్.

మళ్ళీ అందరూ గొల్లున నవ్వారు.

"అయ్యోబావా! అది కిశోర్‌కుమార్ పాట బావా!" —అనల.

"అది నాకు నచ్చిన పాట అన్నాను గాని ముఖేష్ పాటన్నానా? —సుధీర్.

"మీరు మరో పాట పాడండి రవికాంత్ గారూ!" —ఉజ్వల.

"మీ చెల్లాయి చేత పాడిస్తా నన్నారుగా! మీ చెల్లాయి పాడిన తర్వాత నేను పాడాను —రవికాంత్.

"సారికా! ఒక అష్టపది అందుకోవే!" —ఉజ్వల.

"మీకు అష్టపదులంటే ఇష్టమా?" —సందీప్.

"ఇష్టమనేం కాదు. దాని కవి తప్ప వేరే రావు. అది పాడితేగాని కాంత్ పాడడు" —ఉజ్వల.

"ఐసీ! అది సరేగాని ఈ కాంత్ ఎప్పట్నుంచి?" —సందీప్.

"ఇప్పట్నుంచే బావా! ఆయనింకో రెండు పాటలు పాడితే ఆ కాంత్ కూడా పోతుంది" —అపర్ణ.

"అయితే అప్పుడింకేం మిగులుతుంది?" —సుధీర్.

"ఊరుకు పేరుకు అతీతమైన అనుబంధం మిగులుతుంది. మీరంత గింజుకోవాల్సిన పనిలేదు" —ఉజ్వల.

"ఇప్పుడెవరు గింజుకుంటున్నారు?" —అపర్ణ.

"ఎవరూ గింజుకోవటం లేదు. సారికా! వెంటనే ఓ పాట పాడు! ఈ

గోలంతా సద్దుమణుగుతుంది" —ఉజ్వల

"ధీర సమీరే యమునా తీరే..."

అందుకుంది సారిక.

అంతా నిశ్శబ్దంగా విన్నారు. సారిక పాట పూర్తి చెయ్యగానే

"చాలా అద్భుతంగా పాడావు సారికా! హాట్సాఫ్ టు యూ!" అన్నాడు కిశోర్ ఆవేశంగా చప్పట్లు కొడుతూ.

"మీది శ్రావ్యమైనగొంతు,సంగీతాన్ని చక్కగా అధ్యయనంచేస్తే ఏ యం.ఎస్. సుబ్బలక్ష్మి అంతటివారో అవుతారు మీరు" అన్నాడు రవికాంత్.

"ఇంకేం? నువ్వు సైగల్‌వి. ఆమె సుబ్బలక్ష్మి. అద్భుతంగా ఉంది జోడి!" —సందీప్. అందరూ నవ్వారు. అందరి కంటే ఎక్కువ అపర్ణ నవ్వింది.

"మీ కామెంట్ చాలా అద్భుతంగా ఉంది!" —ఉజ్వల.

"థాంక్యూ మేడమ్" —సందీప్.

"నాకు చిన్నప్పుడు మా వాళ్ళు సంగీతం చెప్పించలేదుగాని చెప్పిస్తేనా నేనూ అద్భుతంగా పాడేదాన్నే!" —అపర్ణ.

"పాడేదానివి కాదు. ప్రయాసపడే దానివి" —ఉజ్వల. మళ్ళీ అందరూ నవ్వారు.

"నీతో ఎవరూ మాట్లాడలేదిప్పుడు." —అపర్ణ.

"మిష్టర్, కాంత్! ఇప్పుడిహ మీ వంతు" —ఉజ్వల.

'జబ్ దిల్ హీ టూట్‌గయా...' మొదలెట్టాడు రవికాంత్.

అతడిప్పుడీ పాట పాడకపోతేనే బాగుండుననుకుంది అరుంధతి. నిన్నటికి ఇవ్వాళ్టికి తనలో ఎంత తేడా! రాత్రి తనను ఏవేవో లోకాలకు తీసుకుపోయిన ఆ పాట తెల్లారగానే తనకు దుర్భరంగా తోస్తోంది. తన మనసిప్పుడెంతో హాయిగా ఉంది. అతడేదన్నా అందర్నీ నవ్వించే పాటపాడితే బావుండును.

"ఒరే కాంత్! మనమున్నది పెళ్ళి పందిట్లోరా! స్మశానంలో ఉన్నట్లుగా ఎప్పుడూ ఆ ఏడుపు పాట లేమిట్రా?" —సందీప్.

రవికాంత్ పాట ఆపేశాడు.

"అనవసరంగా అతన్ని డిస్టర్బ్ చేశారు. ఎంతబావుందా పాట!" —ఉజ్వల.

"కొంపదీసి మీరు భగ్నప్రేమికులా ఏమిటీ? మీలాంటి రెవల్యూషనరీకి ఈ పాట నచ్చటమేమిటి?"— సందీప్.

"మిష్టర్ సందీప్! ఒక మాట చెప్పండి. మీరతన్ని పాడనిస్తారా? లేదా?" అసహనంగా ధ్వనించింది ఉజ్వల కంఠం.

"పాడించేవారు మీరు. పాడేవాడు వాడు. మధ్య నేనెందుకు వద్దనాలి? అందరికీ హుషారుగా ఉండే పాటలు పాడమంటున్నాను. అంతే!"—సందీప్.

"'హమ్ తుమ్ ఏక్ కమరేమే బంద్ హో...' పాట పాడండి రవికాంత్ గారూ! భలే జోరుగా ఉంటుంది" —సుధీర్. మళ్ళీ అందరూ నవ్వారు. సుధీర్ మాటనెవరూ సీరియస్‌గా తీసుకోలేదుగాని నిజంగా రవికాంత్ ఆ పాట పాడ్తే తనకెంత హాయిగా ఉండేదో అనుకుంది అరుంధతి.

"అలాంటి పాటలకు నా గొంతు సరి పోదు. నేనలాంటి పాటలు పాడలేను. మీరు వింటానంటే ఈ ఒక్కపాట




పాడేసి ఊరుకుంటాను" అన్నాడు రవి కాంత్.

"ప్లీజ్! పాడండి!" —ఉజ్వల.

"తర్వాత మీరో అష్టపది పాడాలి." అన్నాడు రవికాంత్ సారికకేసి చూసి.

"అలాగే" అంది సారిక.

రవికాంత్ 'జబ్ దిల్ హీ టూట్ గయా...' పాడాడు.

తర్వాత సారిక 'సావిరహే తవదీనా రాధా!' పాడింది.



# 15

"పదింటికల్లా అందరికీ భోజనాలు పెట్టించి పెళ్ళి కొడుకును, పెళ్ళి కూతురును తయారుచేసి అందర్నీ 12 వరకల్లాబస్సెక్కించాలి. తెల్లారేవరకల్లా సూర్యాపేట చేరుకోవాలి. అసలే ఎండా కాలం. తెల్లారితే అగ్గిలాగ ఎండ" అన్నాడు రామచంద్రయ్య కృష్ణ మూర్తితో.

"అలాగే బావగారూ! 12 గంIIలకు వర్జ్యం వస్తోంది అందుకని వధూవరుల్ని పదకొండున్నరకే బస్సెక్కించాలి" అన్నాడు కృష్ణమూర్తి.

"మీరు కాస్త అందరినీ తొందర పెడితేనేగాని పనులేమన్నా అవుతాయి. పన్నెండింటికి వర్జ్యం వస్తోందన్న సంగతి నేను మరిచేపోయాను. వర్జ్యానికి అరగంట ముందుగానే వధూవరుల్ని బస్సెక్కించాలి" అన్నాడు రామ చంద్రయ్య.

"మాదేం ఆలస్యంలేదు బావగారూ? వంటలన్నీ రెడీ అయ్యాయి. ఇప్పుడు 8 గంటలవుతోంది. రెండుగంటల్లో భోజనాలు పూర్తవుతాయి. పదిగంటల నుండి ప్రయాణానికి సిద్ధంకావచ్చు" —కృష్ణమూర్తి.

"మరయితే భోజనాలు పెట్టించండి. ఆలస్యందేనికి?" —రామచంద్రయ్య.

"ఆలస్యమేమీలేదు. అరే రాములూ విడివిడివెళ్ళి అందర్నీ భోజనాలకు రమ్మను" కృష్ణమూర్తి.

* * *

రాత్రి 11 గంటలకు అప్పగింతలు ప్రారంభమయ్యాయి. అకస్మాత్తుగా పెళ్ళికూతురు తరఫువాళ్ళందరి కళ్ళల్లోను నీళ్ళునిండాయి. పొంగివస్తున్న దుఃఖాన్ని ఆపుకోలేక పోయింది అరుంధతి.

అందర్లోను "అరుంధతి వెళ్ళిపోతుంది ఇరవైఏళ్ళుగా అరుంధతికి ఈ యింటితో ఉన్న సంబంధం తీరిపోతుంది.!" అన్న భావం మెదలటంతో కన్నీటి ప్రవాహం పొంగింది.

ప్రతి స్త్రీ జీవితంలోను అదొక మహత్తరమైన సంఘటన. ఒక ముఖ్యమైన మలుపు. కన్నీరు,చిరునవ్వు కలిసిన ఒక అద్భుత అపూర్వ క్షణం. ఒక దశ పరిసమాప్తమై మరొక దశ ప్రారంభమౌతున్న సంధికాలం. తల్లి, తండ్రి, అక్క, చెల్లి, అన్న, తమ్ముళ్ళతో ముడి పడిఉన్న స్త్రీ జీవితం అంతమై భర్త, అత్త, మామ, ఆడబిడ్డ మొదలైన కొత్త వాళ్ళతో ప్రారంభమయ్యే క్షణానికి నాంది. ఆ క్షణంలో కూతుర్ని కన్న

ప్రతి తల్లీ, ప్రతి తండ్రీ కంట తడిపెట్ట కుండా ఉండలేరు.

అరుంధతిని పెళ్ళికొడుకు తల్లి కాంతమ్మ చేతుల్లో పెడుతూ దుఃఖంతో పూడుకుపోయిన గొంతును ఎంతో ప్రయత్నంతో పెకలించుకొని రాజమ్మ చెప్పదలచుకొన్న ఆ నాలుగు మాటలు చెప్పింది

"చిన్ననాటినుంచి నా బిడ్డల్ని ఎంతో ప్రేమగా పెంచాను వదినగారూ! మా అరుంధతి మరీ సున్నితం. ఎప్పుడన్నా కొంచెం కోపగించుకున్నా విలవిల్లాడి పోయేది. వట్టి సత్తెకాలం మనిషి.అన్నెం పున్నెం ఎరుగని అమాయకురాలు. ఇప్పట్నుంచి దానికి తల్లీ తండ్రీ అన్నీ మీరే!"

రాజమ్మ ఇక మాట్లాడలేక పోయింది. ధారాపాతంగా తన గుండె ల్లోంచి పొంగి పొరలి వస్తున్న కన్నీ ళ్ళను ఇక ఆపుకోలేకపోయింది. ఆమెతో పాటు అందరూ ఏడ్చారు. రత్నమ్మ, రమణమ్మ, అపర్ణ, అనల, సారిక, ఉమ, గౌతమ్ అందరూ వెక్కివెక్కి ఏడ్వసాగారు. కన్నీళ్ళను ఆపుకోవాలని ఎంతో ప్రయత్నం చేసిన ఉజ్వల కూడా కన్నీళ్ళు ఆగలేదు. అంత సేపూ ఎంతో నిగ్రహాన్ని చూపించిన కృష్ణమూర్తి అరుంధతినిరామచంద్రయ్య దగ్గరకు తీసుకెళ్ళగానే పసిపిల్లాడిలా ఏడ్వసాగాడు. చెట్టంత మనిషి యాభై ఏళ్ళ జీవితంలో ఎన్నో గడ్డుసమస్యల్ని ఎంతో ధైర్యంగా ఎదుర్కొన్న కృష్ణ మూర్తి ఆ క్షణంలో అకస్మాత్తుగా పసి పిల్లాడిలా రోదించాడు.

"అరుంధతిని నా ప్రాణంతో సమా నంగా పెంచాను బావగారూ! ఇకనుండి దానికి తల్లీ, తండ్రీ అన్నీ మీరే!" అన్నాడు కృష్ణమూర్తి గద్గదస్వరంతో.

"ఊరుకోండి బావగారూ! మీ అంతటి పెద్దమనిషి ఇంత దుఃఖించడం ఏమీ బాగాలేదు. మీ అమ్మాయిని నా కన్న కూతురిలా చూసుకుంటాను."

ఒకరి తర్వాతొకరికి పెళ్ళికొడుకు తరఫున వచ్చిన ముఖ్యమైన వాళ్ళందరికీ అప్పగింతలు పెట్టడం పూర్తయ్యే టప్పటికి ఎన్ని కన్నీటి దొంతరలు ఖాళీ అయ్యాయో!

పెళ్ళికూతురు తరపువాళ్ళు పసిపిల్లల్లా రోదించటం కిశోర్ కి ఆశ్చర్యంగా తోచింది. ఎందుకు వీళ్ళింతగా ఏడవాలి? తనమీద వీళ్ళకు నమ్మకం లేదా? వాళ్ళం దరి మధ్యలోకి వెళ్ళి 'ప్లీజ్! స్టాపిట్! నేను రాక్షసుణ్ణి కాదు. మీ అమ్మాయిని నేనేమీ కష్టపెట్టను. మీకంటే ప్రేమగా చూసుకుంటాను. నన్ను నమ్మండి. మీ అమ్మాయి నేదో అడవికి పంపిస్తున్న ట్టుగా మీరందరూ అలా ఏడుస్తుంటే నాకంతా ఎలాగో ఉంది' అని అరవాలని పించింది. ఈ ఆడవాళ్ళంటే ఏదో ఏడు స్తున్నార్లే అనుకుంటే చెట్టంత మనిషి మామగారి కేమయింది? అతడ్ని చూస్తే తనకూడా దుఃఖం ఆగటంలేదు.

"మీరు కూడా ఏడుస్తున్నారా?" అన్నాడు సందీప్ ఉజ్వల దగ్గరికొచ్చి. చేతి రుమాలుతో కన్నీళ్ళను తుడుచు కొని.

"ఏం? నేను మీకు మనిషిలా కని పించడం లేదా?" అంది ఉజ్వల.

"మీరు నాకు ఒక మామూలు ఆడ మనిషిలా కన్పించలేదు"—సందీప్.

"ఇప్పుడైనా అలా కన్పిస్తున్నానా? థాంక్స్" —ఉజ్వల.

"వీళ్ళంతా ఎందుకిలా ఏడుస్తున్నారు? అరుంధతి నెక్కడికో అడవికి పంపించడంలేదుగా! ఓ! దీజ్ ఇండియన్ ప్రతిదానికీ ఏడవటం తప్పితే వీళ్ళ కింకేమీ చేతకాదు" —సందీప్.

"మీలాంటి గొప్పవాళ్ళకు, ఉన్నతమైన వాళ్ళకు ఈ మామూలు భారతీయులు అర్థం కారులెండి!" —ఉజ్వల.

"సోసీయ్! మీ కర్థమవుతున్నానా? పెళ్ళిలాంటి సంతోష విషయంలో వీళ్ళంతా ఇలా ఏడవటం ఏమిటి? దీన్ని మీరెలా ఎక్స్‌ప్లెయిన్ చేస్తారు?" —సందీప్.

"కొన్ని విషయాల్ని ఎక్స్‌ప్లెయిన్ చెయ్యకూడదు. అర్థం చేసుకునే హృదయముంటే అవే అర్థమవుతాయి. అంతే..." —ఉజ్వల.

"ఈ అపర్ణ కేమన్నా పిచ్చెక్కిందా? అందరికన్నా ఎక్కువగా ఏడుస్తోం దేమిటి? అలా పిచ్చిగా ఏడ్చేవాళ్ళంటే నా కసహ్యం. వీళ్ళంతా వట్టి కంట్రీ గర్ల్స్‌లా ఉన్నారు..." అంటూ అక్కణ్ణించి వెళ్ళిపోయాడు సందీప్.

"ఊరుకోండి! పెద్దవాళ్ళు మీరే ఇలా ఏడిస్తే అమ్మాయి దిగులు పడ్తుంది. అమ్మాయి కన్నీళ్ళతో బయట అడుగు పెట్టకూడదు. ఊరుకోండి! అందరూ ఊరుకుంటే గాని అరుంధతి ఊరుకోదు" —రాధమ్మ.

ఒక్కొక్కరే అందరూ ఊరుకున్నారు. "ఊరుకోవే అరుంధతీ!... అత్తగారింటి కెళ్తూ కన్నీళ్ళతో పుట్టింటి గడప దాట కూడదు. ఊరుకో" అంది రమణమ్మ. కనుకొలకుల్లోంచి కన్నీళ్ళను బయట పడకుండా ఆపుకొంది అరుంధతి.

"వర్జ్యం వచ్చే టైమయింది. వధూవరుల్ని త్వరగా గడప దాటించాలి" అన్నాడు రామచంద్రయ్య.

"ఇంకా ఆలస్యం ఎందుకు పదండి!" అన్నాడు నాగభూషణం.

మొదట పెళ్ళి కొడుకు, తర్వాత పెళ్ళి కూతురు ఆ ఇంటి గడపదాటి బయటున్న జీపులోకి ఎక్కి కూర్చున్నారు. జీపుకదిలింది. అరుంధతి జీవితంలో నూతన ఘట్టం ప్రారంభమైంది.

* * *

మగపెళ్ళి వాళ్ళంతా అర్ధరాత్రి పన్నెండు గంటలు దాటాక వెళ్ళిపోయారు. కృష్ణమూర్తి ఇంట్లో ఒక జడివాన కురిసి వెలిసినట్టుగా ఉంది. అందరూ భోజనాలు చేసి ఇంకా సేపటికి తెల్లవారు తుందనగా పక్కల మీదకు ఒరిగారు.

* * *

అక్కయ్య పెళ్ళయిపోయింది. సందీప్ బావతో తన పెళ్ళి కూడా అయిపోతే ఎంత బావుండును? సందీప్ బావ ఎంత కొంటెవాడు! కొంచెం ఏకాంతం చిక్కగానే తనను గట్టిగా గుండెలకు హత్తుకున్నాడు. తనకా క్షణం ఎంత హాయిగా ఉందో! బావ తనను పెళ్ళి చేసుకుంటే తన జీవితమంతా అలాంటి మధుర క్షణాలతో నిండిపోతుంది. బావ తనను తప్పకుండా పెళ్ళిచేసు కుంటాడు. బావ తనను ప్రేమిస్తున్నాడు. తనను తన కౌగిలిలో బంధించాలని ఉవ్విళ్ళూరు

తున్నాడు. వాళ్ళు వెళ్ళేలోగా నాన్న గారు అత్తయ్యతో తన పెళ్ళి ప్రసక్తి తప్పకుండా తీసుకొస్తారు. బావ ఓ.కే. అంటే వెంటనే ముహూర్తం కూడా పెట్టేస్తారు. పెళ్ళి పందిట్లో తనూ... బావా! ఎంత తియ్యటి కల! అలా కలలు కంటూనే నిద్ర పోవటానికి ప్రయత్నిం చింది అపర్ణ.

*   *   *

పెద్దక్కయ్య పెళ్ళయింది. చిన్న క్కయ్య పెళ్ళి సందీప్ బావతో నిర్ణయ మవుతుంది అప్పుడిక సుధీర్ బావతో తన పెళ్ళికి అడ్డమేమీ లేదు. వీలైతే చిన్నక్కయ్య పెళ్ళి తన పెళ్ళి రెండూ ఒక్కసారే చేస్తానన్నాడు నాన్న. సుధీర్ బావ అమాయకుడు. అతనిలోని భోలాతనమంటేనే తనకెంతో ఇష్టం. దేన్నీ సీరియస్‌గా తీసుకోకుండా, ఎప్పుడూ నవ్వుతూ, నవ్విస్తూ తిరిగే సుధీర్ బావను తను ప్రేమించింది. సుధీర్ బావ కూడా తనను ప్రేమిం చాడు. పల్లెటూరైతేనేం? వాళ్ళకు బోల్డు ఆస్తుంది. సుధీర్ బావ తను చెప్పినట్టు వింటాడు. తన కిష్టమైన పద్ధతిలో తన జీవితాన్ని మలచుకొంటుంది. అంత కన్న ఏం కావాలి? వాళ్ళు వెళ్ళేలోగా తన పెళ్ళి కూడా నిర్ణయమైపోతే ఎంత బాగుండును !

అనల కెంతకూ నిద్ర రావటం లేదు.

*   *   *

వెళ్ళేలోగా రవికాంత్ పాట మరో సారి వింటే ఎంత బావుండును ! వెళ్ళే రవికాంత్‌తో "మిమ్మల్ని ప్రేమిస్తు న్నాను రవీ! మీతో నన్ను మద్రాసు తీసుకెళ్ళరూ ?" అని చెప్పగలిగితే తన జన్మ ధన్యమవుతుంది. అతడేమంటాడు. తను ప్రేమను స్వీకరిస్తాడా ? అపర్ణలా ఉజ్వలలా తను అందగత్తె కాదు. కానీ తనకు అందమైన గొంతుంది. వాళ్ళెవరికీ లేని సంగీతం తనకుంది. సంగీతమంటే రవికాంత్ కిష్టం. సంగీతంలో తను రవి కాంత్‌ను గెలువగలదా ? రేపటితో అత నెక్కడో ! తనెక్కడో ! ఈ కొద్ది క్షణాల్లోనే అతడు తనను శాశ్వతంగా దోచుకున్నాడు. అతనిలో ఏర్పడిన ఈ అనుబంధాన్ని శాశ్వతం చేసుకుంటే ? తన జీవితమంతా కళామయంగా కల కల్లాడుతుంది. అతడూ, తనూ సంగీ తాన్నే జీవితంగా జీవించేవాళ్ళు. కానీ... కానీ...తన కలలు ఫలిస్తాయా? ఏమైనా సరే! అతడు తననెలా అర్థం చేసు కున్నా సరే... తన మనస్సును అతడి ముందు పెడ్తుంది. వెళ్ళేలోగా అతన్తో "నా హృదయం మీకే అంకితమయింది. మీరు స్వీకరించినా సరే, తిరస్కరించినా సరే!" అని చెప్పేస్తుంది. లేక వెళ్ళే లోగా అతనికో చిన్న లెటర్ రాస్తే!

"ప్రియమైన రవీ ! నేను మిమ్మల్ని ప్రేమిస్తున్నాను! నా హృదయం మీకే అంకితం. మీరు స్వీకరిస్తారా ! నాఅంత అదృష్టవంతురాలు లేదనుకుంటాను. తిరస్కరిస్తారా! నా అంత దురదృష్టవంతు రాలు లేదనుకుంటాను..."

రవికాంత్‌కు రాయబోయే ప్రేమ లేఖను మనస్సులోనే రాసేస్తున్న సారికకు నిద్రెలా వస్తుంది ?

*   *   *

మనస్సెంత చిత్రమైంది ! మేధ స్సుకు, మనస్సుకు తనలో ఎప్పుడూ సంఘర్షణే. ఆ సంఘర్షణలో కొన్నిసార్లు

మనస్సు గెలుస్తుంది. కొన్నిసార్లు మేధస్సు గెలుస్తుంది. ఈసారి మనస్సే గెలిచినట్లుగా ఫీలౌతోంది.

తెల్లారగానే వాళ్ళు వెళ్ళిపోతారు. వాళ్ళు వెళ్ళిపోతారంటే తన మనస్సు సంతా ఏదో దిగులు ఆవరిస్తోంది. ఎందుకు? తను వాళ్ళను ప్రేమించిందా? లేదు...లేదు... తనెవర్నీ ప్రేమించ లేదు.

మొదట్లో తను ఎందుకో సందీప్‌కు దగ్గర కావాలని ప్రయత్నించింది. తర్వాత రవికాంత్‌కు దగ్గర కావాలని ప్రయత్నించింది. ఇప్పుడెందుకో వాళ్ళిద్దరూ వెళ్ళిపోతారంటే మనస్సంతా ఏదో వెలితి. వాళ్ళింకో రెండు మూడు రోజులుంటే! తను రవికి ఇంకా దగ్గిర కాగలిగితే! లేదు... తను రవికాంత్‌కు దగ్గర కావడానికి వీల్లేదు. తను రవికాంత్‌కు దగ్గరైతే సారిక భరించ లేదు. సారిక! పిచ్చిపిల్ల! అప్పుడే రవికాంత్‌ను గురించి కలలు గంటోంది. ఏమీ అవదు. అందరమూ కొన్ని గంటల్లో విడిపోతామని తెలుసు. అయినా ఈ పిచ్చి మనస్సు కలలు గనకుండా ఉండ లేదేం?

తను సందీప్‌కు దగ్గరవుతున్నానని పసిగట్టిన అపర్ణ విలవిల్లాడి పోయింది. సందీప్ మీద తనకేదో హక్కుంది, అధికారం ఉందన్నట్టుగా ఫీలౌతుంది అపర్ణ. సందీప్ ఆమె ఆస్తి. ఆ ఆస్తి మీద ఎవరికన్నూ పడటానికి వీల్లేదు. పిచ్చి అపర్ణ! అపర్ణ హక్కును ఆ మరో ప్రపంచంలోంచి ఊడిపడ్డ మహానుభావుడు గుర్తిస్తాడా? సందీప్ కాదంటే అపర్ణ బతుకుతుందా? ఆత్మహత్యచేస్తుంది? ఏదీ మనం ఊహించుకున్నంత భయంకరంగా ఉండదు. వినయ్‌ని ప్రేమించిన అరుంధతి కిశోర్ నిప్పుడే ఆరాధిస్తోంది. స్త్రీ ఒక్కసారే, ఒకర్నే ప్రేమిస్తుందంటారు. కానీ అబద్ధం. ప్రేమించే హృదయముండాలే గాని ఎందర్నైనా ప్రేమించొచ్చు. ఎన్నిసార్లయినా ప్రేమించొచ్చు. అసలీ ప్రేమంటే ఏమిటి? ఈ ప్రేమించామనుకుంటున్న వాళ్ళలో నిజంగా ఎంత మంది ప్రేమించుకొంటారు? చాలా మంది ప్రేమిస్తున్నామనే భావాన్ని ప్రేమిస్తారేమో! నిజంగా ప్రేమించేవాళ్ళు చాలా తక్కువ మందే ఉంటారేమో! నిజంగా ప్రేమించట మంటే ఏమిటి? ఈఆలోచనలన్నీ ఆపేసి హాయిగా నిద్రపోతే ఎంత బావుండును. కానీ తనకు నిద్రరాదు. అలా ఆలోచిస్తూనే ఉండి పోయింది ఉజ్వల.

* * *

సిగరెట్ మీద సిగరెట్ వెలిగిస్తున్నాడు సందీప్. ఎంతకూ నిద్రరాదు. ఓ క్వార్టర్ విస్కీ తాగి, ఏ ఉజ్వల లాంటి దాన్నో, అపర్ణ లాంటి దాన్నో పక్కలోకి తెచ్చుకుంటే తనకు హాయిగా నిద్ర పట్టేది. ఉజ్వల లాభం లేదు. అతితెలివి, ఆ అతితెలివి లోంచి వచ్చే అరోగెన్స్... స్త్రీ సహజమైన ప్రేమ, ఆవేశం, తనకు నచ్చినవాడి కోసం తన సర్వస్వాన్ని త్యాగం చేసే తత్వం— ఇవేవీ ఉజ్వలలో లేవు. ఆమెను చూసినపుడు ఆమెతో చిన్న ఎఫైర్ సాగించాలను కున్నాడు. ఆమెలోని అందం, అందంకంటె ఎక్కువ ఆమెలోని సాఫిస్టికేషన్ మోడరన్ ఔట్‌లుక్ తనకు నచ్చాయి. అందరు ఆడవాళ్ళలాగే తనని

రూపాన్ని చూసి, తన మాటల్ని విని తనని వెంటపడ్తుందనుకున్నాడు. ఉజ్వలకూడా అలా తన వెంటపడ్తే ఆమెను మద్రాసు ఆహ్వానించాలనుకున్నాడు. ఇదివరకు ఇద్దరు ముగ్గురు అమ్మాయిల్ని అలా మద్రాసు రప్పించాడు. ఓ నెల రోజులు వాళ్ళతో ఎఫైర్ సాగించి పంపేశాడు. పెళ్ళి, గిళ్ళి లాంటి బంధనాలు పెట్టుకోకుండా అందమైన అమ్మాయిలతో చిన్న చిన్న ఎఫైర్‌లు నడపటమంటే తనకు చాలా ఇష్టం. ఉజ్వలతో కూడా అలాంటిది ప్రారంభించాలనుకున్నాడు. కానీ ఆమె చాలా తెలివైనది. రవికాంత్ గాడు కొంత పాడు చేశాడు. చూడటానికి పరమ వికారంగా ఉండే రవికాంత్‌ను కూడా ఆడపిల్లలు లైక్ చేస్తారని తనూహించలేక పోయాడు. మొదట్లో తనను లైక్ చేసిన ఉజ్వల వాడు రెండు పాటలు పాడగానే తన లైకింగ్ నంతా వాడివైపు మళ్ళించింది.

ఈ ఆడవాళ్ళు నిజంగా చాలా స్ట్రేంజ్ ఫెల్లోస్. వాళ్ళు ఎవర్ని ఎందుకు లైక్ చేస్తారో చెప్పలేం...... మధ్యలో ఈ అపర్ణాకతి! నిజంగా బోరెత్తించేస్తోంది మేనరికం...బావ... అందువల్ల ఆమెకు తన మీదేదో హక్కున్నట్టు ఫీలౌతుంది. డర్టీ సెంటిమెంట్స్. వట్టి కంట్రీగర్ల్‌లా ఉంది. కొంచెం కూడా కల్చర్ లేదు. తనంటే అంత పడిచస్తుంది. కానీ పెళ్ళయ్యేదాకా తనను ముట్టుకోవద్దుట. ఈ సెంటిమెంటల్ క్రీచర్ని పెళ్ళిచేసుకుంటే ఇంకేం లేదు. తననో ప్రైవేట్ ప్రాపర్టీని చూస్తున్నట్టుగా చూసుకుంటుంది. మరో ఆడదానికేసి కన్నెత్తి చూడనివ్వదు. ఉజ్వలతో కాస్సేపు చనువుగా మాట్లాడితేనే జెలసీతో ఉడికిపోయింది. జీవితాంతం ఈ న్యూసెన్స్‌ను తనెలా భరించగలడు.

సిగరెట్ ఆర్పేసి నిద్రపోవటానికుపక్రమించాడు సందీప్.

* * *

ఉజ్వల కళ్ళల్లో ఎంత తేజస్సు!

ఎప్పుడూ ఆ కళ్ళల్లోకి చూస్తూ ఉండిపోవాలనిపిస్తుంది.

ఆమె పక్కనుంటే చాలు...ఆమె కోసం ఎన్ని గంటలైనా తను పాడుతూనే ఉంటాడు.

ఏమిటి తనకీ పిచ్చి? ఇంకో కొన్ని గంటల్లో తనెక్కడో, ఆమెక్కడో! మళ్ళీ ఇద్దరూ కలుసుకోవటమంటూ జరక్కపోవచ్చు. కానీ తాను ఉజ్వలను మరచిపోలేడు. ఆమెతో యేర్పడిన ఈ అనుబంధాన్ని శాశ్వతం చేసుకోలేడా? ఉజ్వల తనలో వెలిగించిన ఈ ప్రేమ జ్యోతిని ఆరిపోకుండా కాపాడుకోగల్గుతాడా?

తను పాడుతున్నప్పుడు ఉజ్వల పొందిన పారవశ్యమంతా వట్టిదేనా? తెల్లారగానే ఎవరిదారి వారిదేనా? కాని అలా జరగటానికి వీల్లేదు. వెళ్ళేలోగా ఉజ్వలతో మాట్లాడాలి. ఉజ్వల మీద తనలో పొంగి పొరలుతున్న ప్రేమ వాహినిలో ఆమెను కూడా ముంచెత్తాలి.

"ఉజ్వలా! ఐ లవ్‌యూ! మీ కభ్యంతరం లేకపోతే మనం పెళ్ళిచేసుకుందాం. మీరు నా పక్కనుంటె చాలు...సంగీతంలో నేనెన్నో ఉన్నతోన్నత శిఖరాలను అధిరోహిస్తాను. నాలాంటి కళాకారుడికి మీలాంటి ప్రేమదేవత అండ కావాలి. మీరు నన్ను కాదంటే నాలోని

ఈ సంగీతం, ఈ చిత్రలేఖనం — అన్నీ వట్టిపోతాయి. నా జీవితం నిస్సారమై పోతుంది..." అని తనను తాను ఆమె కర్పించుకోవాలి.

ఉజ్వల తనను కరుణిస్తుందా? అంతా తన పిచ్చి.

ఏమీ జరగదు. ఎక్కడి వాళ్ళ మక్కడ కొన్ని క్షణాల్లో విడిపోతాము.

నో నో నో! అలా జరగటానికి వీల్లేదు. కానీ అలాగే జరుగుతుంది

నో నో నో! అలా జరగదు. ఉజ్వల కూడా తనను ప్రేమిస్తోంది. తనతో తన జీవితాన్ని పెనవేయటానికి సిద్ధంగా ఉంది.

దేదీప్యమానమైన సౌందర్యంతో వెలిగిపోతున్న ఆ అందాల రాశి తన లాంటి ఓ కురూపిని ప్రేమిస్తుందా? కాని తన సంగీతం, ఆమె సౌందర్యం కలిస్తే ఆ కలయిక ఎంత మహోజ్వలంగా ఉంటుందో!

అంతా తన ఊహ.

అసలు తనీ పెళ్ళి కెందుకొచ్చాడు? ఎక్కడ తను? ఎక్కడ ఉజ్వల? ఈ కలుసుకోవటమేమిటి? ఈ కల లేమిటి? ఈ మనసులు పారేసుకోవటమేమిటి?

తెలారే వరకు రవికాంత్ అలా ఆలో

చిస్తూనే ఉన్నాడు.

* * *

అరుంధతి పెళ్ళయిపోయింది.

అపర్ణను తనకిస్తే ఎంత బావుండును!

కానీ అపర్ణ తనకు దక్కదు. సందీపన్నయ్యే ఆ ఛాన్స్ కొట్టేశాడు. సందీప్ కంటే ఓ వారంరోజులు ముందు పుట్టి వుంటే అపర్ణ తనకే దక్కేది. ప్రస్తుతం తనకు మిగిలేది అనలే! ఆ అనలతోనైనా తన పెళ్ళి త్వరగా జరిగిపోతే బావుండును. కానీ అపర్ణలో ఉన్నాకర్షణఅనలలో లేదు. ఆ ముగ్గురక్కచెల్లెళ్ళలో అపర్ణ అందమే అందం. అపర్ణను చూసినప్పుడల్లా తన నరనరాల్లో యేదో బాధ. ఎందరో సినిమా స్టార్ల అందాన్ని తలదన్నే అపర్ణలాంటి అప్సరసను పెళ్ళి చేసుకోవటమంటే ఎంతదృష్టం! కానీ ఆ అదృష్టం తనకు లేదు. అపర్ణ కూడా సందీపన్నయ్యనే ప్రేమిస్తోంది. పాపం! అనలకు తనంటే ఇష్టం. పోనీలే... అ న ల తో తృ ప్తి ప డ దా ం. కానీ ఎవరితోనో ఒకరితో తన పెళ్ళి త్వరగా జరిగిపోవాలి. రాత్రిపూట తను నిద్రపోలేకపోతున్నాడు. యవ్వనంలో వున్న ఆడపిల్లల్ని చూసినప్పుడల్లా తన రక్తం వేడెక్కిపోతోంది. తను పొలాల్లోకి పని చెయ్యటానికికొచ్చే ఆడ కూలీల్లో కాస్త వయసులో వున్నవాళ్ళను చూస్తే తనలో కోరికలు బుసకొడుతున్నాయి. తను ఎలాంటి పిచ్చిపని చెయ్యకుండా ఉండాలంటే తనకూ అనలకు..అదృష్టం కలిసొస్తే అపర్ణకు పెళ్ళయిపోవాలి. తనకింకా అపర్ణమీది ఆశ పోవటంలేదు. పాపం అనలకు మాత్రం యేం తక్కువ అయింది? తెల్లగా, బొద్దుగా, బంతి పువ్వులాగా నూత్న యవ్వనంతో మిసమిస లాడ్తూ, తనను తన హృదయమంతటితో ప్రేమిస్తున్న అనలను పెళ్ళి చేసుకుంటేనే తను సుఖపడతాడు. అందనిదానికోసం అర్రులు చాచటంకంటే అందినదానితో తృప్తిపడటమే తన పాలసి.

కొద్దిసేపట్లోనే సుధీర్ హాయిగా గాఢ నిద్రలోకి జారిపోయాడు.



## 16

భళ్ళున తెల్లవారింది.

పెళ్ళివారింట్లో ఒకరి తర్వాతొకరు అందరూ లేచారు. బంధువులందరూ ఎక్కణ్ణించి వచ్చారో అక్కడకు వెళ్ళి పోవటానికి తమతమ సూట్‌కేసుల్ని సర్దుకోవటం మొదలెట్టారు.

"వెళ్ళేలోగా మీ అక్కయ్యతో మన అపర్ణ పెళ్ళి విషయం ప్రస్తావించటం మరచిపోకండి" అంది రాజమ్మ కృష్ణమూర్తిని లోపలకు పిల్చి.

"అలాగే లేవే!" అన్నాడు కృష్ణమూర్తి.

అందరికంటే మొదలు వెళ్ళిపోవటానికి మద్రాసునుండి వచ్చిన రాధమ్మ, సందీప్, రవికాంత్‌లు సిద్ధమయ్యారు.

"అంత దూరంనుండి రాక రాక వచ్చావు. ఇంత హడావుడిగా వెళ్ళకపోతే యేమిటే అక్కయ్యా! ఇంకో రెండు మూడు రోజులుండకూడదా?" అన్నాడు కృష్ణమూర్తి రాధమ్మతో.

"మీ బావగారి సంగతి నీకు తెలుసు కదరా! మూడురోజుల్లో తప్పకుండా వస్తానని ఎన్నో విధాలుగా నచ్చచెబితే పంపించారు. సందీప్‌కు కూడా ఎంతో కష్టంమీద ఈ మూడు రోజులూ సెలవు దొరికింది..." అంది రాధమ్మ.

"మళ్ళీ ఎన్నాళ్లకు కలుసుకుంటామో యేమిటో! ఇప్పుడే మన అపర్ణ సందీప్‌ల పెళ్ళి విషయం మాట్లాడుకుంటే బావుంటుంది. ఏమంటావే అక్కయ్యా!" అన్నాడు కృష్ణమూర్తి.

ఆ ఇంట్లో వున్నవాళ్ళంతా ఆ హాల్లోకి చేరారు. రాధమ్మ యేమంటుందోనని అందరూ గుండెలు బిగబట్టుకొని ఎదురు చూశారు.

"నేననేదేముందిరా.... ఈ రోజుల్లో మన పిల్లలు మన చేతుల్లో ఉన్నారా? మనం చేసుకోమన్న పిల్లను వాళ్ళు చేసుకునేట్టున్నారా? దీపుతో అపర్ణ విషయం నేను రెండు మూడుసార్లు ప్రస్తావించాను. ఇప్పుడు నా పెళ్ళికి తొందరేమీ లేదని తప్పించుకున్నాడు. ఏరా దీపూ! మామయ్య ఏమంటున్నాడో విన్నావుగా. అపర్ణను నీకివ్వాలని ఎప్పట్నించో అనుకుంటున్నాము. నువ్వు సరేనంటే వెంటనే ముహూర్తాలు కూడా పెట్టుకోవచ్చు. మీ నాన్నగారు కూడా అంతా నీమీదే పెట్టారు. అపర్ణనెప్పుడో చిన్నప్పుడు చూశాను. మరోసారి చూస్తేనేగాని చెప్పలేనంటావేమోననే నిన్నీ పెళ్ళికి తీసుకొచ్చాను. అపర్ణను చూశావు. మీరిద్దరూ మాట్లాడుకున్నారు. నీ అభిప్రాయమేమిటో చెప్పు" అంది రాధమ్మ.

అందరూ సందీప్‌కేసి చూశారు.

కాస్సేపటివరకు అతడేమీ మాట్లాడలేదు.

హాలంతా నిశ్శబ్దం. అపర్ణ గుండెల్ని పిండిచేసిన నిశ్శబ్దం. కొన్ని క్షణాల్లో తన భవిష్యత్తేమిటో నిర్ణయమౌతుంది అటో ఇటో తేలిపోతుంది.

"నన్ను క్షమించాలి మామయ్యగారూ!"

నిశ్శబ్దాన్ని ఛేదిస్తూ సందీప్ కంఠం ఖంగున మ్రోగింది.

"నేను ఇప్పట్లో పెళ్ళిచేసుకోదల్చుకోలేదు. మా కంపెనీవాళ్ళు నన్ను వచ్చే నెలలో జపాన్ పంపించాలని నిర్ణయించారు. నేనక్కడో రెండేళ్ళు ట్రయినింగ్‌లో ఉండాలి. ఆ ట్రైనింగ్ పూర్తి అయ్యేవరకు నేను పెళ్ళి చేసుకోదల్చుకోలేదు" అన్నాడు సందీప్.

"పెళ్ళి చేసుకొని అమ్మాయిని తీసుకునే జపాన్‌కు వెళ్ళొచ్చుగా. నువ్వు సరేనంటే ఈ వారం పది రోజుల్లోనే ముహూర్తం పెట్టిస్తాను" అన్నాడు కృష్ణమూర్తి.

"ప్లీజ్ మామయ్యగారూ! నేనిప్పుడిప్పుడే ఈ పెళ్ళి, పిల్లలూ, సంసారం అనే బంధనాల్లో ఇరుక్కోదల్చుకోలేదు. దయచేసి నన్నర్థం చేసుకోండి" అన్నాడు సందీప్ కొంచెం ఇబ్బందిగా ఫీలౌతూ.

"పోనీయ్.....నువ్వు తప్పకుండా అపర్ణను చేసుకుంటానంటే మేమీ రెండేళ్లు ఆగడానికి సిద్ధంగా ఉన్నాము. నువ్వు జపాన్‌నుండి తిరిగొచ్చాకే పెళ్ళి చేసుకుందువుగానీ" అన్నాడు కృష్ణమూర్తి.

"నోనో మామయ్యగారూ! మీ మనస్సును కష్టపెడుతున్నందుకు నన్ను క్షమించండి. అపర్ణకేదైనా వేరే మంచి సంబంధం చూసి పెళ్ళి చేసెయ్యండి.




అందుకు నన్నేదైనా సహాయం చెయ్య మంటే చేస్తాను. డారికి సరిపోయేంత డబ్బు మీదగ్గర లేకపోతే నన్ను సర్ద మంటే సర్దుతాను. నేనీ విషయంలో ఇంతకంటే చెప్పేదేమీ లేదు...ట్రైన్ టైమౌతోంది. మేం వెళ్ళిపోతాం మామయ్యా!" అంటూ సందీప్ లేచి హ్యాండ్‌బేగ్ భుజాన వేసుకున్నాడు.

ఆ క్షణంలో అపర్ణ గుండెల్లో ఓ అగ్నిపర్వతం బ్రద్దలైంది. లోపలకు పరుగెత్తి బెడ్‌మీద పడిపోయింది. ఆ క్షణంలో ఎవరైనా తన గొంతు నులిమి తనను చంపేస్తే బావుండుననిపించింది. రత్నమ్మవచ్చి ఓదార్చేవరకు ఏడుస్తూనే వుంది అపర్ణ.

"వాడలా మొండికేస్తున్నాడు.... నన్నేం చెయ్యమంటావురా ?" అంది రాధమ్మ.

"వాడికంత ఇష్టం లేనప్పుడు మనం బలవంతం చెయ్యటం కూడా మంచిది కాద క్కయ్యా! ఎవరికెవరు ప్రాప్తమో ఆ భగవంతుడే రాసిపెట్టాలి - వాడు రాసి పెట్టందే ఏదీ జరగదు" అన్నాడు కృష్ణ మూర్తి.

"అదీ నిజమేరా తమ్ముడూ! మనం అనుకున్నవన్నీ అయితే ఇంకేముంది?" అంది రాధమ్మ.

"ఒరే రవీ! నీ ధోరణి చూస్తోంటే నువ్విక్కడే సెటిలయిపోయేట్టున్నావు.. నీకేం నాయనా! పనీపాటా లేదు... రేపెళ్ళి నేను డ్యూటీలో జాయినవక పోతే మా జనరల్‌మానేజర్ నన్ను ఫైర్ చేస్తాడు... కమాన్ గెటప్... ఏరా రాములూ! ఆటో పిల్చుకొచ్చావా ?" అన్నాడు సందీప్...

"ఆటో ఎప్పుడో వచ్చిందయ్యగారూ" అన్నాడు రాములు.

"నాకు మళ్ళీ ఆ తమిళదేశానికి రావాలని లేదురా! ఇక్కడే ఇంకొంతకాలం ఉండిపోవాలని ఉంది" —అన్నాడు రవికాంత్.

"మా ఊరికెళదాం రండి రవికాంత్ గారూ! అన్నయ్యావాళ్ళను వెళ్ళిపోనివ్వండి. తెలుగు దేశపు పల్లెటూర్లుకూడా ఎలా ఉంటాయో చూద్దురుగాని"అన్నాడు సుధీర్.

"థాంక్యూ వెరీమచ్ సుధీర్‌గారూ! ఇంత మందిలో మీరొక్కరైనా మీ ఊరు రమ్మని ఆహ్వానించారు...థాంక్యూ వెరీమచ్... కానీ రాలేను వెళ్ళిపోవాలి.. మరోసారెప్పుడైనా చూద్దాం..." అన్నాడు రవికాంత్.

"మరోసారా ? ఆ మరోసారి ఈ జన్మలోనే వస్తుందంటారా?" —సుధీర్.

"నిజమే! రాకపోవచ్చు... కానీ వస్తుందనుకొని బ్రతకటంలోనే ఏదో హాయి, ఆనందం ఉన్నాయనుకొంటాను..." —రవికాంత్.

"వెరీగుడ్ ... మీరూ నాలాగే ఆప్టిమిస్టులన్నమాట..." అన్నాడు సుధీర్.

"వెళ్ళొస్తాంరా తమ్ముడూ! అంటూ రాధమ్మ అందరితోను వెళ్ళొస్తానని చెప్పి ఇంటిముందున్న ఆటోలోకి ఎక్కి కూర్చుంది.

సందీప్ అందర్నీ ఒకసారి పరికించి చూశాడు - వాళ్ళల్లో అపర్ణ లేదు. 'పూర్‌చాప్! లోపలెక్కడో ఏడుస్తూ ఉంటుంది. 'గుడ్‌బై' అంటూ అందరికేసి చెయ్యి ఊపి ఆటో ఎక్కాడు.

రవికాంత్ కూడా అందర్నీ ఒక్క

సారి చూశాడు... తనకేసి రెప్పవాల్చ కుండా చూస్తున్న సారికను, నిర్లిప్తంగా చూస్తున్న ఉజ్వలను ప్రత్యేకంగా చూశాడు.

'గుడ్‌బై' అంటూ చెయ్యి ఊపి ఆటో ఎక్కాడు. తన గుండెల్లో ఎక్కడో "దిల్ జల్తాహైతో జల్‌నే దో..." అన్నపాట తన గొంతుదాటి బయటకు రావాలని పెనగలాడుతోందని గ్రహించాడు - వాళ్ళందరికీ తనాపాట పాడి వినిపిస్తే బావుండుననిపించింది. ఆటో స్టార్టయింది.

* * *

"పోనీ మన అపర్ణను వాళ్ళ సుధీర్‌కు చేసుకుంటుందేమో విమలమ్మ నడగండి... అనల పెళ్ళికిప్పుడేం తొందర్లేదులెండి.. అది కాలేజికెళ్తోంది.. ఇంకో రెండు మూడేళ్ళు ఆగి చేసినా ఫరవాలేదు. కాని అపర్ణ పెళ్ళి మాత్రం వెంటనే చేసెయ్యాలి..." అంది రాజమ్మ కృష్ణమూర్తిని లోపలకు పిలిచి—

బయట విమలమ్మ, సుధీర్‌లు వెళ్ళ టానికి సిద్ధమవుతున్నారు.

"అదేమిటే...సుధీర్‌కు అనల నిస్తా మనుకున్నాంగా! ఇప్పుడు అపర్ణను చేసుకొమ్మంటే ఏం బావుంటుంది ?..." అన్నాడు కృష్ణమూర్తి.

"బావుండక పోవడమేమిటండీ .. సుధీర్‌కు అపర్ణేఈడవుతుంది...అనలకు సుధీర్‌కు పదేళ్ళ తేడా ఉంటుంది... అపర్ణను సందీప్ చేసుకుంటాడని మొదట్లో అలా అనుకున్నాము... ఇప్పుడా అబ్బాయి చేసుకోనన్నాడు కాబట్టి అపర్ణను సుధీర్‌కిస్తేనే బావుం టుంది" — అంది రాజమ్మ

"అదీ నిజమే... కాని సుధీర్‌ను చేసుకోవటానికి అపర్ణ ఒప్పుకుంటుందా?" —కృష్ణమూర్తి.

"ఒప్పుకోకేం చేస్తుందండి ... ఆ అబ్బాయికేం తక్కువ? చక్కగా బి.ఎ ప్యాసయ్యాడు... బోల్డు ఆస్తిపాస్తు లున్నాయి. తమ్ముళ్ళు, ఆడ బిడ్డలు ఎవరూలేరు... విమలమ్మ కూడా మన అపర్ణను ప్రేమగా చూసుకుంటుంది... మీకు తెలియదు కాని విమలమ్మకు, సుధీర్‌కు వాళ్ళిద్దరికీ కూడా అపర్ణ నిస్తేనే బావుండునని ఉంది..." అంది రాజమ్మ.

"అయితే సరే... అలాగే మాట్లాడ తాను" అన్నాడు కృష్ణమూర్తి.

"ఏమే విమలా! మీరన్నా రెండ్రోజు లుండకుండా వెళ్ళిపోతున్నారా?" అన్నాడు కృష్ణమూర్తి బయట హాల్లో కొచ్చి.

"మాదేముంది మామయ్యా! ... ఎప్పుడంటే అప్పుడే వస్తాం... ప్రస్తుతం వ్యవసాయంపనులు చాలా ఉన్నాయి. పొలాల్లో మట్టి పోయించాలి... నార్లు పోయించాలి, లేకపోతే ఎన్ని రోజులుంటే అన్ని రోజులుండే వాళ్ళం..." అన్నాడు సుధీర్.

'వెళ్ళేముందు ఒక్క మాట..." అన్నాడు కృష్ణమూర్తి విమలతో.

"చెప్పన్నయ్యా! నీ మాట నేనెప్పు డన్నా కాదన్నానా ?" అంది విమలమ్మ.

"ఇంతకాలం అపర్ణను సందీప్‌కు, అనలను సుధీర్‌కు ఇద్దామనుకున్నాం.. ఇప్పుడా సందీప్ అపర్ణను చేసుకోనని తేల్చేశాడు. కాబట్టి అపర్ణను సుధీర్‌కే ఇవ్వాలని నేనూ, మీ వదినా నిర్ణయించు




కున్నాము... అనల పెళ్ళికిప్పుడేం తొందర్లేదు... ఇంకో మూడు నాలుగేళ్ళు ఆగినా ఫరవాలేదు..." అన్నాడు కృష్ణమూర్తి.

"అలాగే కానియ్ అన్నయ్యా! మాకు అపర్ణయినా అనలయినా ఒక్కటే! ఇద్దరూ మా అన్నయ్య బిడ్డలేగా. యేమంటావురా సుధీర్!" అందివిమలమ్మ.

"నీ అభిప్రాయమే నా అభిప్రాయ మమ్మా!" వెంటనే అన్నాడు సుధీర్.

అకస్మాత్తుగా తననింత అదృష్టం వరిస్తుందని ఆశించని సుధీర్‌కు ఎక్క డెక్కడికో తేలిపోతున్నట్టుగా ఉంది. ఆడుతూ, పాడుతూ గంతులు వెయ్యా లన్నంత ఆనందంగా ఉంది.

కానీ లోపల అనల గుండెల్లో రగులు తున్న చితిని ఎవరూ ఆర్పే ప్రయత్నం కూడా చెయ్యలేదు.

ఎదుటి వ్యక్తి మనస్సును కొంచెం కూడా అర్థం చేసుకోలేని సుధీర్ బావ లాంటి మూర్ఖుణ్ణి ప్రేమించటం తనదే బుద్ధి తక్కువ... యే గాలి వస్తే ఆ గాలికి కొట్టుకుపోయే సుధీర్ లాంటి వ్యక్తిత్వం లేని మనిషి తనకు భర్తగా రాకపోవటం ఒకరకంగా తన అదృ ష్టమేనని తనను తాను ఓదార్చుకోవ టానికి ప్రయత్నించిందా అమ్మాయి.

"అయితే త్వరలోనే ముహూర్తాలు పెట్టిద్దాం" అన్నాడు కృష్ణమూర్తి.

"అలాగే అన్నయ్యా! నాకూ్కడా వాడి పెళ్ళి ఎంత త్వరగా చేస్తే అంత హాయిగా ఉంటుంది. వాడికి పిల్లనిస్తా మని బోల్డుమంది వస్తున్నారు...మా అన్నయ్య కూతుర్ని తప్ప వేరేవాళ్ళను చేసుకోమని చెప్పలేక చస్తున్నాను. త్వరగా వాడి పెళ్ళి చేసేస్తే వాళ్ళ బెడదా తప్పుతుంది. ఒక్కదాన్ని... కోడలొస్తే నాక్కాస్త తోడుగానూ ఉంటుంది" అంది విమలమ్మ.

"ఓ వారం రోజులు పోయాక కబురు పంపిస్తాను. నువ్వూ, సుధీర్ రండి- అప్పుడే ముహూర్తం పెట్టుకుందాం" అన్నాడు కృష్ణమూర్తి.

"అలాగే అన్నయ్యా! ఇక వెళ్ళొస్తాం అన్నయ్యా! వెళ్ళొస్తాం వదిన! అప ర్ణెక్కడా కనిపించదేం...వెళ్ళొస్తానమ్మా రమణమ్మొదిన..." అందరికీ పేరు పేరునా వెళ్ళొస్తానని చెప్పి విమలమ్మ రిక్షా ఎక్కింది.

"వెళ్ళొస్తాం మామయ్యా! వెళ్ళొస్తాం అత్తయ్యా!" అంటూ సుధీర్ కూడా రిక్షా ఎక్కాడు. రిక్షా బస్స్టాండువైపు కదిలింది అందరూ నిశ్శబ్దంగా ఆ రిక్షా కేసి చూస్తూ నిల్చుండిపోయారు.

* * *

ఆ తర్వాత కాస్సేపటికి రమణమ్మ, ఉజ్వల, ఉమ, రత్నమ్మ, సారిక మొద లైన వాళ్ళంతా రిక్షాలెక్కి స్టేషన్‌కు చేరుకున్నారు.

కాస్సేపట్లో ట్రెయినొచ్చింది.

అందరూ ట్రెయినెక్కారు.

"సో దటీజ్ లైఫ్!" అనుకుంది ఉజ్వల.

ట్రెయిన్ స్టార్టయి వేగాన్ని పుంజు కుంది.

ఉజ్వల ఆలోచనల వేగం కూడా పెరిగింది.



# శునకాలు కావు స్మగ్లర్ల పాలిటి సింహాలు

కొన్నేళ్ళ క్రితం జర్మనీలో నిషాద్రవ్యాల దొంగ రవాణా విచ్చలవిడిగా సాగింది. హాషిష్, ఓపియమ్, హెరాయిన్, కొకైన్‌లాంటి నిషాద్రవ్యాలు రకరకాల పద్ధతుల్లో దొంగ రవాణా చేయబడేవి. జర్మనీ కస్టమ్స్ అధికారులు ఈ నిషాద్రవ్యాల స్మగ్లింగ్‌ను అరికట్టేందుకు ఎన్నో కట్టుదిట్టాలు చేశారు. దొంగ రవాణాదార్లు కస్టమ్స్ అధికార్ల కన్నుగప్పి నిషాద్రవ్యాల్ని సరిహద్దులు దాటవేసేందుకు ఎన్నో రహస్యపద్ధతుల్ని అనుసరించారు. అయితే జర్మన్ కస్టమ్స్ అధికారులచేత వదిలిపెట్టబడిన సునిశితమయిన శ్వాసజ్ఞానంగల శునకాలముందు వారి ఆటలు సాగలేదు. నిషాద్రవ్యాల దొంగ రవాణా నిరోధించటంలో శిక్షణపొందిన 'జర్మనీ శునకాలు' గొప్ప విజయాల్ని సాధించాయి.

ఇటీవల జర్మన్ కస్టమ్స్ అధికారులు అనుమానాస్పద పరిస్థితిలో ఒక కారును తనిఖీ చేయవలసివచ్చి, శిక్షణపొందిన ఓ శునకాన్ని కొన్ని క్షణాలపాటు అక్కడ వదిలిపెట్టారు. అది గట్టిగా మొరుగుతూ, కాలి గోళ్ళతో గీస్తూ కారులోని ఒక వ్యక్తి కాలిబూటులో రహస్యంగా దాచిన నిషా పదార్థాలను బట్టబయలుచేసింది. దానితోపాటు అతి గోప్యంగా వెల్డింగ్ చేసిన ఒక పెట్టె అడుగున భద్రపరచిన కొన్ని కిలోల 'హాషిష్'ను కూడా అధికార్లు శునకం సహాయంతో కనుగొనగలిగారు.

గత ఎనిమిదేళ్ళుగా ఇలా నిషా పదార్థాల దొంగ రవాణాను అరికట్టేందుకు శిక్షణపొందిన శునకాలను ఉపయోగిస్తూనే ఉన్నారు. ఇప్పుడు, దాదాపు 300 శునకాలు నిషాద్రవ్యాల స్మగ్లింగ్ జరిగే సరిహద్దుల్లో, విమానాశ్రయాల్లో, ఇంకా అందుకు నెలవైన అనేక ప్రాంతాల్లో కస్టమ్స్ అధికార్లకు సహకరిస్తున్నాయి. వెయ్యికిపైగా 'వేట కుక్కలు' కూడా సరిహద్దు ప్రాంతాల్లో స్మగ్లింగ్‌ను అరికట్టేందుకు కనిపెట్టుకుని ఉన్నాయి.

దీర్ఘకాల శిక్షణ పూర్తయిన తరువాతనే ఈ శునకాలు కస్టమ్స్ అధికారులవద్ద, పోలీసు ఉద్యోగుల దగ్గర నిషాద్రవ్యాల స్మగ్లింగ్ వేటలో పాల్గొంటాయి. జర్మనీ కస్టమ్స్ విభాగంచే ఏర్పాటు చేయబడ్డ రెండు శిక్షణ కేంద్రాలలో ఒకటి దక్షిణ జర్మనీలో ఉంది. న్యూరెంబర్గ్‌కు సమీపంలో 5,000 మంది మాత్రమే నివశిస్తున్న ఓ చిన్న గ్రామంలోని కస్టమ్స్‌వారి శునక శిక్షణ కేంద్రంలో 1958 నుండి ఈ శునకాలు, వాటి నిర్వాహకులు శిక్షణపొంది తమ ఉద్యోగ బాధ్యతలలో ప్రవేశించటం జరుగుతోంది.

"ఇవి మాములు వేటకుక్కలలాంటివి మాత్రం కావు. సరిహద్దుల్లో నిషాద్రవ్యాలతో తప్పించుకు పారిపోయే వ్యక్తుల్ని అతిశక్తివంతమైన తమ ముక్కులతో వాసన పసిగట్టి, వెతికి పట్టుకునే అపురూప సింహాలు ఇవి. ధృఢంగా వుండి, ఎలాంటి బలిష్టుల్ని అయినా ఎదుర్కొనేందుకు సిద్ధంగా ఉంటాయి" అంటాడు 'మిస్టర్ హాన్స్' ఎనిమిదేళ్ళుగా శునక శిక్షణ కేంద్ర నిర్వాహకుడిగా తన అనుభవాల్ని వివరిస్తూ.

శిక్షణ కేంద్రంలో శునకానికి [illegible] వారాల్లో ప్రాథమిక శిక్షణ పూర్తవుతుంది: సరిహద్దు ప్రాంతాలలో [illegible]ను అరికట్టేందుకు, నిషాద్రవ్యాల్ని వాసనపట్టి పసిగట్టేందుకు అనుకూలమైన అనుభవాన్ని సంపాదించేందుకు కస్టమ్స్ అధికార్లు తర్ఫీదు ఇస్తారు. ఈ శిక్షణ శునకానికేకాక దాన్ని నిర్వహించే [illegible] కూడా ఉంటుంది. ఆ శునకాన్ని బాధ్యతా నిర్వహణలో ఏ విధం[illegible] పద్ధతిలో వినియోగించాలో కూడా అతడు శిక్షణలో అనుభవం పొందుతాడు.

గుప్తంగా ఉంచబడిన నిషా[illegible] శిక్షణపొందిన శునకం తన ఘ్రాణేంద్రియాలతో పసిగట్టి, [illegible] నిర్ధారించుకునే విషయాల్ని శునక చోదకుడు ముందుగానే [illegible] తర్ఫీదు పొందుతాడు.

ఈ శిక్షణలన్నీ పూర్తయిన తరువాత శునకం నిషాద్రవ్యాల్ని కనిపెట్టి పట్టుకోవడంలో [illegible] సామర్థ్యాన్ని సంపాదించిందా, లేదా అనే విషయాన్ని పరీక్షించి [illegible]స్తారు.

మొదట్లో ఈ శునకాలకు శిక్షణ చాలా తమాషాగా ఉంటుంది. ఒక బొమ్మలో దాచబడిన [illegible] కనుగొనే ప్రత్యేక శిక్షణతో ప్రారంభమవుతుంది. నిషాద్రవ్యాల వాసన పులిమిన గుడ్డ బంతులను ఈ శునకాలకు ఇస్తారు. ఇవి వాటి వాసనలను మాత్రమే పసిగడతాయి. నాలుగు రకాల నిషాద్రవ్యాల్ని పసిగట్టేందుకు నాలుగు వారాలు శిక్షణ ఇస్తారు.

పెట్రోలు డబ్బాతో ఉంచి వెల్డింగు చేయబడిన నిషాద్రవ్యాల్ని సుశిక్షితమైన శునకాలు కనిపెట్టగలవు. ఇది చాలా ఆశ్చర్యకరమైన విషయం. ఏ మానవమాత్రుడికీ సాధ్యపడని అసాధారణ చర్య.

శునకం మనిషికంటే 100 లక్షల రెట్లు అధికంగా వాసనను పసిగట్టగలదని జంతు గుణవిశేష పరిశీలకులు తెలియజేశారు.

శునక శిక్షణ కేంద్రంలో శిక్షణపొందిన శునకాలు సాధించిన విజయాలను ప్రపంచం దేశాలు అభినందిస్తుంటే ఈ శిక్షణకేంద్ర ప్రధాన అధికారి ఆ శునకాల ప్రతిభకు ఎంతో గర్వపడుతున్నాడు. ఫ్రెంచి కస్టమ్స్ విభాగం కూడా తమ అధికారులను, శునకాలను ప్రత్యేక శిక్షణ నిమిత్తం ఈ చిన్న గ్రామం బవేరియాకి పంపించటమూ ఒక విశేషమే!




ఆస్ట్రేలియా దేశంలో అంఖలాసాల్స్ బర్గ్ అనే ప్రాంతానికి నలభై మైళ్ళ దూరంలోని 'కోహ్ మర్దార్' దాదాపు ఎనిమిది వేల అడుగుల ఎత్తయిన పర్వత ప్రాంతం. ఈ పర్వతం మధ్య ఉన్న లోయగుండా ఓ చిన్న పిల్లనది ప్రవహిస్తూంటుంది. అతిభయంకరంగా కనిపించే ఆ లోయ ప్రాంతంలో కొన్ని గుహలున్నాయి. ఆ గుహలను చేరుకోవాలంటే చిన్న పడవలో కూర్చుని ప్రయాణం చేయాల్సి ఉంటుంది. విశ్వవిఖ్యాతిగాంచిన ఈ ప్రదేశాన్ని తిలకించేందుకు వేలాది యాత్రికులు తరచుగా ఇక్కడికి వస్తూ ఉంటారు.

'కోహ్ మర్దార్' పర్వత లోయలకు సంబంధించిన అనేక భయంకర విశేషాలు,నమ్మలేని నిజాలు బయటపడ్డాయి. ఇక్కడి గుహల్లోని హిట్లర్ రహస్య నిధికై అన్వేషణ సాగించిన అనేకమంది ప్రాణాలు పోగొట్టుకున్న ఒళ్ళు గగుర్పొడిచే సంఘటనలు ప్రపంచాన్ని విస్మయపరిచాయి.

## జలాంతర్భాగంలో జీవన్మరణ సమస్య

ఒకనాటి రాత్రి పండు వెన్నెల్లో, ముగ్గురు వ్యక్తులు 'కోహ్ మర్దార్' పర్వత లోయలోకి ప్రవేశించారు. ఓ రబ్బరు నావలో కూర్చుని ఆ చిన్న నది గుండా ప్రయాణించి గుహలను చేరుకున్నారు. భయంకర నిశబ్దం గూడు కట్టుకుని ఉన్న ఆ ప్రదేశంలో బిక్కుబిక్కుమంటూ దిక్కులు చూస్తున్న ముగ్గురు వ్యక్తులు అప్పటికే రెండు వందల గజాల దూరం దాటి వచ్చేశారు. గుహల ప్రాంతంలో తమ రబ్బరు నావను ఆపేశారు.

ముగ్గురు వ్యక్తుల్లో ఒకడు పరిశోధనకు అవసరమైన సరంజామాతో ఉన్నాడు. కళ్ళకు పెద్దపెద్ద అద్దాలు. భుజాన ఆక్సిజన్ సిలెండర్, తలమీద కాంతి విరజిమ్మే దీపం. ఒళ్ళంతా కప్పిన గట్టి ప్లాస్టిక్ డ్రెస్. నడుముకి బిగించిన బలమైన తాడు. అతడు నీటిలో

ఈదుకుంటూ వెళ్ళి క్రింది భాగాన గల ప్రవేశమార్గం నుంచి పైనగల గుహను చేరుకోవాలి.

మిగతా ఇద్దరు వ్యక్తులూ నావలోనే ఉండి మూడో వ్యక్తిని నీటిలోకి విడిచి పెట్టారు. అతను ఈదుకుంటూ వెళ్ళి పోయాడు. అంతే !!

అతనికి తన సహచరులు చేసిన మోసం అర్థమై ఉంటుంది. పంపులో ఆక్సిజన్ లేకపోవడం, తీగె తెగిపోవడం



తను మృత్యువుకి దగ్గర కావడం! అప్పటికే అతను నూటఅరవై అడుగుల లోతుకి వెళ్ళిపోయాడు. అలా ఆ వ్యక్తి దుర్మరణం పాలయ్యాడు.

ఈ సంఘటన 1963 అక్టోబరులో జరిగింది. ఆస్ట్రేలియా పోలీసులు మృతుడి కుటుంబానికి ఈ విషయం తెలిపారు. పోలీసుల నివేదికలో ఇది బుద్ధిపూర్వకంగా జరిగిన హత్యగా పేర్కొన్నారు.



'కోహేమర్దార్' గుహలకు ఎంతో మంది పనికట్టుకుని ఎందుకు వెళ్తారు? వాళ్ళలో కొందరు అకాల మృత్యువు వాతపడటం, అంతు తెలియని హత్యలకు లోనుకావటం ఎలా జరుగుతుంది? అనేవి ప్రపంచానికి అర్థంకాని ప్రశ్నలుగా నిలిచిపోయాయి.

ఆ తర్వాత్తరువాత "కోహేమర్దార్" పర్వత ప్రాంతాల్లో జరిగిన ఇలాంటి అనేక గొలుసుకట్టు హత్యలు, అకాల మరణాల సంఘటనలు జరగటంతో ఈ రాద్ధాంతాల వెనుకదాగిన అంతరార్థం వెలుగులోకి వచ్చి, ప్రపంచానికి తెలిసింది.

ఈ పర్వత లోయల్లోని గుహల్లో నిగూఢంగా ఉన్న హిట్లర్ నిధినిక్షేపాల కోసం అనేకమంది అన్వేషణ సాగిస్తూ వచ్చి, నిధి ఉన్నస్థలం దగ్గర పడగానే దురాశతో, ఆ నిధి పూర్తిగా తమ స్వంతం కావాలనే దురుద్దేశంతో ఒకరినొకరు ప్రాణాలు తీసుకోవటమో, ఆ గుహల్లోనివాతావరణ ప్రభావానికి అకాల మృత్యువు వాతపడటమో జరుగుతూ వస్తుంది.

## మంచు తుఫానులో మారణహోమం

అది 1946వ సంవత్సరం. రెండవ ప్రపంచ యుద్ధం ముగిసి ఓ ఏడాది మాత్రమే అయింది. అప్పుడు ముగ్గురు జర్మన్లు 'కోహే మర్దార్' ప్రాంతంలో అడుగు పెట్టారు. "ఈ గుహలను చూడ్డానికి మాత్రమే వచ్చాం" అని అక్కడి వారితో బొంకారు ఆ జర్మన్లు. వారు గుహలకు బయలుదేరి వెళ్ళిన సమయంలోనే 'మంచు తుఫాను' వచ్చి,



ముగ్గురిలో ఇద్దరు అక్కడికక్కడే మరణించారు. ఒక్కడు మాత్రం చావుతప్పి కన్ను లొట్టపోయి వెనుదిరిగి వచ్చాడు. వారు **ని**ధినిక్షేపాల అన్వేషణకై వచ్చినట్లు తర్వాత తెలిసింది.

ఇలా ఎందరెందరో హిట్లర్ రహస్య నిధికై అన్వేషిస్తూ ప్రత్యక్షంగానో, పరోక్షంగానో ప్రాణాల్ని పోగొట్టుకున్నారు. కొద్దికాలానికే 'కోహ్ మర్దార్' పర్వతలోయ ప్రాంతాల్లో ఎన్నెన్నో శవశకలాలు లభ్యమయ్యాయి. ఆ ప్రాంత ప్రజలు 'కోహ్ మర్దార్‌ను' 'మృత్యు లోయ' అని కూడా పిలిచేవారు.

## ప్లాను కాగితాన్నే మింగిన ప్రబుద్ధుడు

ఓసారి ఇద్దరు జర్మన్లు నిధిని సూచించే ప్లాను కాగితం తీసుకుని దాని ప్రకారం అన్వేషిస్తూ గుహ ప్రాంతాలకు వచ్చారు. తాము అఖండ ధనరాసులకు అతిసమీపంగా వచ్చామనీ, అవి తమ కైవశం కాబోతున్నాయనే ఆలోచన వచ్చేసరికి వారిలో ఒకడికి దురాశ కలిగి అమాంతం ప్లాను కాగితాన్నే మింగేశాడు. రెండవవాడు మాత్రం తక్కువ తిన్నాడా? అతడి దుర్బుద్ధిని అర్థం చేసుకుని వెంటనే అతడి పొట్ట చీరేశాడు. ఫలితంగా అతను చావటమే కాక, ప్లాను కాగితం రక్తంలో తడిసి ముద్దయి ఎందుకూ పనికిరాకుండా పోయింది.

గత 18 సంవత్సరాల్లోను హిట్లర్ గుప్తనిధి కోసం ప్రయత్నించి, ఇలా ఎందరెందరో ప్రాణాలు పోగొట్టుకున్నారు. ఇలాంటి హత్యలు, మరణాలు ఆస్ట్రేలియా ప్రభుత్వానికి తలనొప్పి వ్యవహారంగా పరిణమించడంవలన చిట్టచివరకు ప్రభుత్వమే జోక్యం కల్పించుకుని హిట్లర్ నిధి రహస్యాన్ని తెలుసుకునేందుకు ప్రయత్నాలు సాగించింది. ఇందుకుగాను ఆస్ట్రేలియా ప్రభుత్వానికి రోజుకు ఆరువేల రూపాయలు ఖర్చు అయ్యేది.

'కోహ్ మర్దార్' పర్వత ప్రాంతాన్ని నాజీలు 'అల్పెయిన్ హిల్స్'గా వ్యవహరిస్తుండేవారు. ఈ పర్వత ప్రాంతంలోనే 'గెస్టోపో' పంచమాంగదళ ఛీఫ్ అర్నెస్ట్‌కాల్డన్ అరెస్టు చేయబడ్డాడు. ఇక్కడే యూదుల్ని అధిక సంఖ్యలో

రప్పించి, 'గెస్టోపో' వాళ్ళు వారిని మూక ఉమ్మడిగా హత్య చేసేవారు. 'గెస్టోపో' ముఖ్యుడు అడాల్ఫ్ అయిఖయిన్ కూడా రెండవ ప్రపంచ యుద్ధంలో ఇక్కడే అరెస్టయ్యాడు.

## ఆపారధన రాసులు ఇక్కడికెలా వచ్చాయి?

1945 మార్చిలో ఈ పర్వత ప్రాంతంలో నివశించేవారి జనసంఖ్య



కేవలం పదిహేను వేలే ఉండేది. అది ఇప్పుడు 70 వేలకు పెరిగింది.

అప్పట్లో కొత్తగా 'కోహ్ మర్దార్' పర్వత ప్రాంతాలకు వచ్చేవారు దాదాపు అందరూ 'నాజీ' పార్టీతో సంబంధాలు పెట్టుకున్నవారే. వీరందరూ తమతో తెచ్చిన ధనరాసులను ఇక్కడి గుహ ప్రాంతాలలో దాచిపెట్టారు. మిత్ర రాజ్యాలు ఈ ప్రాంతంపై దాడి చేసి



నప్పుడు ఇక్కడ అతివిలువైన వజ్రాలు, బంగారం, రహస్య గూఢచారి పత్రాలు, ఆయుధాలు-ఇంకా ఎన్నో వస్తువులు లభ్యమయ్యాయి. కానీ, ఇప్పటిపరకు హిట్లర్ గుప్తనిధి నిక్షేపాల గురించి, దాని విలువ గురించి సరియైన అంచనాలు తెలియలేదు.

1946 లో 'గెస్టోపో' ముఖ్యుడు కార్‌బోజ్ మిత్రరాజ్యాల ఆదేశాల మేరకు ఇక్కడే ఉరి తీయబడ్డాడు. అతను మరణించే కొద్ది కాలానికి ముందు జర్మనీనుంచి అపార ధనసంపదను తరలించి తెచ్చాడు. ఆ సంపదనంతా ఈ ప్రాంతంలోనే భద్రపరిచాడు.

ప్రభుత్వ అంచనాల ప్రకారం 'కార్‌బోజ్' జర్మనీ నుంచి తీసుకు వచ్చిన సంపద యాభై కర్ర పెట్టెలలో ఉంటుందనీ, వాటినిండా వజ్రాలు, నగలు, నగదు ఉంటాయనీ అనుమానించింది. వాటి బరువు సుమారు వంద పౌండ్లవరకు ఉండొచ్చు. ఇదేకాక ఇరవై లక్షల డాలర్ల కరెన్సీ, యాభై లక్షల రూపాయలు విలువచేసే జర్మన్ తపాలా బిళ్ళలు, ఇంకా ఇతరత్రా ఖరీదైన వస్తువులు "కోహ్‌మర్దార్" గుహప్రాంతాల్లోనే దాచిపెట్టినట్లు ఎన్నో దాఖలాలు ఉన్నాయి.

'కార్‌బోజ్' దాచిపెట్టిన అపార ధనవస్తు సముదాయం నుంచి ఇప్పటి వరకూ కేవలం వజ్రాలతో నిండిన మూడు కర్ర పెట్టెలు మాత్రం ఆస్ట్రేలియా ప్రభుత్వానికి లభించాయి. మిగతా నిధికోసం అన్వేషణ జరుగుతోంది.

'అడాల్ఫ్' కూడా ఈ ప్రాంతంలో కోటిన్నర డాలర్లవిలువచేసే బంగారాన్ని

దాచిపెట్టినట్లు దృష్టాంతాలు ఉన్నాయి. కానీ ఆ నిధిలోంచి ఇంతవరకూ 40 పౌండ్లు విలువచేసే ఒక రత్నం మాత్రం ప్రభుత్వానికి లభించింది.

## ఆటోమేటిక్ కెమెరాలతో అతిసూక్ష్మ రహస్యాలా ?

రెండవ ప్రపంచయుద్ధం ముగిసిన తర్వాత ఇక్కడికి వచ్చిన యాత్రికులు చాలామంది చూస్తూ చూస్తూనే కోటీశ్వరులయ్యారు. వారికి ఈ ప్రాంతంలో నిధి లభించి ఉండవచ్చు. అలాగే ఎందరో విదేశీయులు ఇక్కడి నిధులపై ఎన్నో ఆశలు పెట్టుకుని, అవసరమైన ప్రయత్నాలు చేసి, అజ్ఞానంతో తమ ప్రాణాలకే ముప్పు తెచ్చిపెట్టుకున్నారు.

ఆస్ట్రేలియా ప్రభుత్వం ప్రస్తుతం ఈ గుహల రక్షణకు రెండు వందల మంది గస్తీ సైనికులను ఏర్పాటు చేసింది. గుహలలోని నిధి నిక్షేపాలను కనుగొనే నిమిత్తం నీటి అడుగున ఉన్న వస్తువులను సైతం స్పష్టంగా ఫొటోలు తీయగల శక్తివంతమైన ఆటోమేటిక్ కెమెరాలను జర్మనీ, ఇటలీల నుంచి కొనుగోలు చేసింది. మిక్కిలి మేలు రకమైన ఈ ఆధునిక కెమెరాల వలన అతి సూక్ష్మమైన ఏ వస్తువునైనా ఫొటోలు తీసి నిధి రహస్యాలను కనుగొనడంలో ఎందరో భూగర్భ శాస్త్రవేత్తలు నిమగ్నమై ఉన్నారు.

ఇప్పటి వరకు 'కోహ్ మర్దార్' గుహలనుండి ఎంతో విలువైన వస్తువులు లభ్యమయ్యాయి. అందులోని రెండు కోట్ల యాభైలక్షల డాలర్ల దొంగ జర్మన్ కరెన్సీ ముద్రించడానికి ఉపయోగపడే బ్లాకులు కూడా లభించాయి.

హిట్లర్‌కు సంబంధించిన 'గుప్తనిధి' రహస్యాన్ని తెలుసుకొనేందుకే ఇప్పటికి పరిశోధనల నిమిత్తం ఆస్ట్రేలియా ప్రభుత్వానికి రెండు కోట్ల రూపాయలు ఖర్చయ్యాయి. ఎన్నో నిండు ప్రాణాలు బలి అయ్యాయి. ఏది ఏమయినా నేడో రేపో 'హిట్లర్ గుప్తసంపద' రహస్యం తెలిసి పోతుందనే ఆశతో ఉంది ఆస్ట్రేలియా ప్రభుత్వం. ఈలోగా ఎంత ఖర్చవుతుందో, ఎందరి ప్రాణాలు బలి అవుతాయో చెప్పలేం!!

—డి. కె. రూప్‌సింగ్



# వృత్తిరహస్యం

జోగినాధం కాలేజీలో నా క్లాసుమేటు. క్లాసులో ఎప్పుడూ నిద్రమత్తుతో జోగుతూండే జోగినాధం హఠాత్తుగా సినీరంగంలో 'డ్యాన్స డైరెక్టర్' ఎలా అయ్యాడన్నది రెండేళ్ళుగా నాకు అంతు బట్టని సమస్య.

నాకు తెలిసినంతవరకు వాడెక్కడా డాన్స్ నేర్చుకోలేదు. కనీసం రికార్డింగ్ డాన్సన్నా ప్రాక్టీసు చేయలేదు. అలాంటి బడుద్ధాయి తెలుగు సినీరంగంలో ఇప్పుడు ప్రముఖ నృత్యదర్శకుడు, వాడి సినిమాలన్నీ శతదినోత్సవాలు జరుపుకొన్నవే.

ఆఫీసు పనిమీద మద్రాసు వెళ్ళినప్పుడు నాలుగైదు స్టూడియోలకి ఫోన్ చేసి, చివరి కెలాగో జోగినాధాన్ని పట్టుకున్నాను. మనిషి చాలా మారేడు. వేషభాషల్లో ప్రత్యేకత కనుపించింది. వీడు 'మా జోగినాధమేనా' అనిపించింది.

సెట్ వేసిఉన్న ఓ ఫ్లోర్‌లోకి లాక్కెళ్ళాడు నన్ను. ప్రముఖ తార డాన్స్ షూటింగు, అడుగడుగునా జోగినాధంకి అందరూ దణ్ణాలు పెడుతున్నారు. వాడి పలుకుబడి ప్రత్యక్షంగా అర్థమైంది.

నున్నటి పాలరాతి హాల్లో బంకమట్టి బురద పల్చగా పరిచారు. దానిమీద గజానికో రాయి చొప్పున ఉందారు. నటీమణి శృంగార వరూధినిలా తయారై డాన్స్‌కు సిద్ధమై వచ్చింది.

షూటింగ్ ప్రారంభమైంది. హీరోయిన్ కాళ్ళకి బురద అంటకుండా రాళ్ళ మీదే జాగ్రత్తగా అడుగులేస్తూ గంతులేస్తోంది. నేను విస్తుపోయాను. కెమేరా ఆవిడ మోకాళ్ళ నుంచి పైకి మాత్రమే ఎక్కువసార్లు చూపిస్తుంది.

షూటింగు పూర్తయిన తర్వాత ఒంటరిగా చూసి జోగినాధాన్ని అడిగేశాను "ఒరేజోగీ! ఆమెను హాయిగా డాన్స్ చెయ్యనివ్వక ఆ బురద ఎందుకు?" అని.



"అదేరా నా వృత్తి రహస్యం. బురద కాళ్ళకి అంటుకోకుండా ఆ నటి ఒళ్ళు దగ్గర పెట్టుకుని జాగ్రత్తగా రాళ్ళ మీదే అడుగులు వేస్తుంది. సమాన దూరంలో ఉన్న రాళ్ళ మీద లయబద్ధంగా అడుగులు పడతాయి. ఓ వేళ ఆమె స్టెప్ రాయిమీద వేయక బురదలో వేసిందనుకో, వెంటనే కాలుజారి పడటం ఖాయం. దాంతో బ్రహ్మాండమైన ఎఫెక్ట్ వస్తుంది. థియేటర్లలో ఆ సీక్వెన్స్‌లోనే చప్పట్లు పడేది!" అన్నాడు చిద్విలాసంగా నవ్వుతూ జోగినాధం.

—గ. స. నా.

# నష్టం

మృణాళిని అతనివంక చూసి ఒకసారి ఒళ్ళు విరుచుకుంది. ఆ ప్రయత్నంలో జారిన పైటని అలస్యంగా సర్దుకుంది. తన వంక చూస్తున్న అతను కదిలి మృణాళిని దగ్గరకి వచ్చాడు.

"బస్ ఎప్పుడు వస్తుంది?" అడిగాడు.

"తెలియదు. కాని నా వయసెంతో చెప్పగలను" నవ్వింది.

"ఏం చేస్తున్నారు ?" అడిగాడు.

చిలిపిగా నవ్వి చెప్పింది.

"అదే"

"పదయితే"

"రాత్రి అంతా ఉంటే వంద. గంటకి..."

"రాత్రంతా ఉంటాను."

ఆ మర్నాడు ఉదయం మృణాళిని ఇంట్లోంచి వెళుతూ రెండువందల ఏభై ఇచ్చాడు అతను. నూటయాభై ఎక్కువ ఇవ్వడం ఆనంద పరిచింది మృణాళినిని. వరసగా మూడు రాత్రులు వచ్చి, రాత్రికి రెండు వందలయాభై చొప్పున మొత్తం ఏడువందల ఏభై ఇచ్చాడు అతను.

"రేపు రాత్రి కూడా వస్తారా ?" అడిగింది ఆశగా-మూడోరాత్రి అయాక.

"రాను" చెప్పాడు.

"ఏం?"

"డబ్బు అయిపోయింది" అని ఆగి చిన్నగా నవ్వి చెప్పాడు మృణాళినితో అతను-

"నేను మీ ఊరునుంచి వస్తున్నాను. పట్నంలో నువు ఉద్యోగం చేస్తున్నావని నమ్ముతున్న మీ అమ్మగారు నాకు ఏడు వందల ఏభై ఇచ్చి పంపారు నీకిమ్మని".

"మీరు...?"

"మా ఇంట్లో అద్దెకుంటున్నారు





ఆవిడ. మీకు డబ్బిచ్చేశాను... ఇవ్వ లేదా ?" నవ్వి వెళ్ళిపోయాడు.

-మల్లాది వెంకటకృష్ణమూర్తి

# వేట

"అమ్మ బాబోయ్, పాము!" ఒక్కసారిగా ఇంటాయన, ఆ వెనకే చంకన పిల్లతో ఇంటామె ఇంట్లోనుంచి ఒక్క పరుగున వీధిలోకి వచ్చిపడ్డారు.

"తాచుపాములా ఉంది! నా అంత పొడవుంది" అన్నాడు ఇంటాయన-తను బెదిరిపోయిందే కాక, బయటివాళ్ళని అదరగొడుతూ.

"పాములవాణ్ణి పిలుస్తే బావుండును" తలోకరు తలో ఉచిత సలహా పారేశారు.

ఇంతలో ఆపంద్బాంధవుడు రానే వచ్చాడు నాగస్వరం వాయించుకుంటూ. ఆ సమయంలో వాడెక్కడ్నుంచి ఊడి పడ్డాడనే అనుమానం ఎవరికీ రాలేదు.

"దేవుడిలా వచ్చావు నాయనా! రా, రా!" అంటూ వాడిని ఆహ్వానించి అసలు విషయం చెప్పాడు ఇంటాయన.

వాడోసారి లోపలికి పోయి వచ్చి, "సాలా పెద్దపాము బాబూ! పేణాలకి తెగించాలి. సాలా కరుసవుద్ది" అని బెట్టెక్కి కూచున్నాడు.

"నీక్కావలసినంత తీసుకో. ముందు ఆ పాము సంగతి చూడు బాబూ!" అర్థించాడు ఇంటాయన.

ముందుగా పదిరూపాయలు అడ్వాన్స్ తీసుకొని రెండు నిమిషాల్లో పామును పట్టేసి బయటకి తెచ్చాడు. జనానికి గుండెలవిసిపోయాయి దాన్ని చూసి.

"బాబ్బాబూ దాన్నింకా ప్రాణాలతో ఉంచావా, చంపి పారెయ్యక!" అన్నారు

మరో పదిరూపాయలు ఇంటాయన దగ్గర వసూలుచేసి, "మీకేం భయం లేదండి. దీని కోరలు ఎప్పుడో పీకేశాను" అని వాడు చిద్విలాసంగా నవ్వుతూ దాన్ని పట్టుకుపోయాడు.

—బొమ్మిడి అచ్చారావు

# ఉద్యోగం

శంకర్రావు సచివాలయంలో ఉద్యోగం చేస్తున్నాడు. ఓ రోజు అతని ఊరి నుంచి అతని స్నేహితుడొచ్చాడు వెతుక్కుంటూ.



'బాబ్బాబూ! ఏదేనా ఉద్యోగం చూపించుదూ! రాన్రాను నాకు గడవడం కష్టమయిపోతోంది' అన్నాడు స్నేహితుడు దీనంగా.



శంకర్రావు ఓ క్షణం ఆలోచించాడు.

"నీకు సంతకం చెయ్యడం వచ్చా?"

"ఎందుకు రాదు?"

"న్యూస్ పేపరు రోజంతా చదువుతూ కూర్చోగలవా?"

"అందులో పెద్ద కష్టమేముందీ?"

"గంటకోసారి కాఫీ తాగగలవా?"

"ఓర్నీ మనకెవడెస్తాడని?"

"క్రాస్ వర్డ్స్ పజిల్స్ పూర్తి చేయడం నీకు ఆసక్తిగా ఉంటుందా?"

"దాన్దేముందీ? చేయవచ్చు!"

"ఆఫీసుకి గంట ఆలస్యంగా వచ్చి, గంట ముందుగానే వెళ్ళిపోగలవా?"

"అంతకంటే కావల్సిందేముంటుందీ"

"అర్థంలేని వాగుడు వాగ్గలవా?"

"ఓ! కాని..."

"అయితే, పద! మా ఆఫీసులో ఆఫీసర్ కాబిన్ ఒకటి ఖాళీగా ఉంది; అందులో కూర్చో! నువ్వు నిజంగా ఆఫీసరులా నటించు! ఎవరికీ నువ్వెవరో తెలీదు! దాంతో నెల్రోజుల్లో ఆ ఉద్యోగం నీదే

అవుతుంది..." అన్నాడు శంకర్రావు.

ఇద్దరూ ఆఫీస్‌కెళ్ళారు. శంకర్రావు చెప్పినట్లే చదువుకొంటూ, మధ్య మధ్యలో ప్రతిగంటకూ కాఫీ తాగుతూ, క్రాస్ వర్డ్స్‌పజిల్స్‌తో గడిపేశాడు. వారం తర్వాత శంకర్రావు కలిశాడు

"ఎలావుంది ఉద్యోగం ?"

"అద్భుతంగా ఉంది. అప్పుడప్పుడూ ఫైల్సు తెచ్చి గుమాస్తాలు నా ముందు పెడుతున్నారు. నేను సంతకం పెట్టేస్తున్నాను. అదంతా బాగానే ఉందిగాని ఒకడు ఎవడో నా గది తలుపుముందు నుంచుని ప్రతి పావు గంటకీ ఓ సారి లోపలకి తొంగిచూసి నా వేపు అనుమానంగా చూస్తున్నాడు" అన్నాడు స్నేహితుడు.

"అదా ! నువ్వు ఛార్జీ తీసుకొన్నావని తెలిసి— నీకో ప్యూన్‌ని నియమించారులే" తేలిగ్గా అన్నాడు శంకర్రావు.

—యర్రంశెట్టి శాయి

# హెల్మెట్

వెంకట్రావు హెల్మెట్ కొన్నాడు. మనసుపడికాదు, తప్పనిసరై కొన్నాడు. నెత్తిమీద పెట్టుకుని అద్దంలో చూసుకున్నాడు. తను తనేనా అన్పించింది. నిజంగానే తనలో ఎంతో మార్పు వచ్చేసింది. అద్దంలో కన్పిస్తున్న తన ప్రతిరూపం నీల్ ఆర్మ్‌స్ట్రాంగ్‌ని గుర్తుకు తెస్తోంది. అంతేకాదు, నెత్తిమీద కొండంత బరువు పెట్టినట్టూ, కొద్దో గొప్పో చెవు దొచ్చేసి నట్టూకూడా అన్పించింది!

పావుతక్కువ పదింటికి బుద్ధిగా స్కూటర్ తీసుకుని రోడ్డుమీదికొచ్చాడు. రోడ్డుమీద స్కూటర్ రోజుకన్నా మెత్తగా పోతున్నట్టనిపించింది. ఎప్పుడూ సముద్రంలా హోరుమంటూ వుండే బజారు ఆరోజు ఎందుకో బోలెడంత నిశ్శబ్దంగా వున్నట్టుంది. సిటీ బస్‌లు ఝామ్మని పక్కనించే దూసుకు పోతున్నా, వెనక నించి కారు డ్రైవర్ సైడిమ్మని ఢ్యూయల్ హారన్ కొడుతున్నా విన్పించటం లేదు. అబిడ్సు సర్కిల్‌లో టర్న్ కొడుతున్నాడు వెంకట్రావు. అంతలో వెనకనించి "బోయ్" మని హారన్ కొట్టుకుంటూ, బాణంలా వెంకట్రావుని దూసుకు పోయాడో ఆటో డ్రైవర్ అంతే - స్కూటర్ ఓ పక్కకి, వెంకట్రావు మరోపక్కకి విసిరి కొట్టినట్టు పడ్డారు.

వెంకట్రావు భారంగా కళ్ళు తెరచి చుట్టూ చూశాడు, తనని తాను చూసుకున్నాడు. ఒంటిమీద ఎక్కడ చూసినా బేండేజీలు కన్పించాయి,

అంతలో డాక్టర్ బూట్సు టకటక లాడించు కుంటూ వచ్చి, "హౌ ఆర్ యూ?" అన్నాడు

వెంకట్రావు ఏదో చెప్పాలనుకున్నాడు. పెదవులు కదిలాయిగాని మాట పైకి రాలేదు

"యూ ఆర్ లక్కీ! లేకపోతే అంత పెద్ద ఏక్సిడెంట్ అయినందుకు నీ ప్రాణం పోవలసింది. అలాకాకుండా నీ ప్రాణాలు కాపాడినందుకు నీ హెల్మెట్‌కి నువ్వు థ్యాంక్స చెప్పుకోవాలి" అన్నాడు డాక్టర్.

వెంకట్రావు జాలిగా చూశాడు.

—బొమ్మకంటి



# బ్లాక్ మెయిలర్

అఖండమైన తెలివితేటలు గల అప్పారావు ఆఫీస్‌లో తన సీట్లో కూర్చుని క్రితంరోజు తమ 'మ్యారేజి డే' సందర్భంగా ఒక ఖరీదైన హోటల్‌లో రూమ్ తీసుకొని తనూ, తన భార్య కలిసి గడిపిన మధుర క్షణాలు నెమరు వేసుకుంటుండగా అతనికి ఫోనొచ్చింది.

అతను వెళ్ళి ఫోనెత్తి "ఎవరూ" అనగానే అవతలినుంచి 'అజ్జాద్‌ఖాన్' నవ్వినట్టు గరగరమనే నవ్వువినిపించింది. తరువాత మాటలు వినిపించాయి.

"నేనెవరో నీకు తెలియదుగాని నిన్న మీ 'మ్యారేజి డే' సందర్భంగా నువ్వు, నీభార్యా కలిసినిన్నంతా ఒక హోటల్‌లో రూమ్ తీసుకొని గడిపారు అవునా?

'అసలు వీడెవడు? ఈ సంగతి వీడి కెలా తెల్సిందని' మనస్సులో ఆశ్చర్య పోతూనే "అవును" అన్నాడు అప్పారావు.

"మరి నిన్న నువ్వు, నీ భార్య కలిసి ఉండగా చాలా ఫొటోలు తీశాను తెల్సా" అవతలతను అన్నాడు.

అప్పారావుకి కేసు అర్థమయింది కాని ఖంగారు పడకుండా "అయితే" అని ఎదురు ప్రశ్న వేశాడు.

"అయితే ఏమిటి వెర్రి ప్రశ్న. అవి ఏదైనా పత్రికలో పడితే నీ పరువు ఏమవుతుందో తెల్సా?" అవతలతను చిరాకు పడ్డాడు.

"గుడ్.... వెరీగుడ్ మరి నా వాటాకి ఎప్పుడు రమ్మంటావు" అప్పారావు ఉత్సాహంగా అన్నాడు;

"వాటా ఏమిటి?'' అవతలతను హోరున ఆశ్చర్యపడి పోయేడు.

"అదేనోయ్ ఆ ఫొటోలు ఏదైనా పత్రిక్కి పంపిస్తానంటున్నావు కదా! మరి అవి ప్రచురించినందుకు పత్రిక వాళ్ళు నీకు భారీ ఎత్తున పారితోషికం పంపిస్తారు కద్దా! మరి అందులో నాకు న్యాయంగా సగం వాటా రావాలి. అది



తీసుకొంటానికి ఎక్కడకి, ఎప్పుడు రమ్మంటావోనని అడు...'' అప్పారావు మాటలు పూర్తి అవకుండానే అవతలి వేపున ఫోన్ డిస్కనెక్టు అయింది.

—వడ్డి లక్ష్మణరావు

Edited, Printed and Published by Ramoji Rao Ch for Vasundhara Publications Printed at Colorama Offset Printers, Hyderabad. Office Address : CHATURA Telugu Monthly Eenadu Compound, Somajiguda, Hyderabad500 004

